# నిజానికి చూస్తే జీవితం మొదలయ్యేది 58 ఏళ్ళకే



## ... మీరు సరిగ్గా అలా ప్లాన్ చేస్తే. ఇప్పుడే!

ప్రవేశపెడుతున్నాం, యుటిఐ వారి రిటైర్‌మెంట్ బెనిఫిట్ ప్లాన్. రిటైరవడం ఇక అలా హాయినిచ్చే అనేక సుఖసంతోషాల రోజులకోసం ఎదురుచూడటానికి తోడ్పడే
పెట్టుబడి ఆధారంగాగల మొట్టమొదటి రిటైర్‌మెంట్ ప్లాన్. మీరు పెట్టే సబ్‌స్క్రిప్షన్‌కి సెక్షన్ 88 క్రింద పన్ను రాయితీకి అర్హత వుంటుంది.
యుటిఐ వారి రిటైర్‌మెంట్ బెనిఫిట్ ప్లాన్‌లో పెట్టుబడి పెట్టండి నేడే. దీన్ని మించిన పెట్టుబడి మరొకటి యింకేమియు లేదు

### ముఖ్యాంశాలు

- ఇది 18-52 మధ్య వయస్సులోని వ్యక్తుల కోసం.
- మొత్తంగాగల కనీసపు సబ్‌స్క్రిప్షన్ - రూ. 10,000. కనీసం రూ. 500/- చొప్పున (ఇక దాని గుణిజాలలోనూను) 20 సాలీనా వాయిదాలు మించకుండా వుండేలాగా, 52 ఏళ్ళ వయసొచ్చేదాకాను. సబ్‌స్క్రిప్షన్‌కి గరిష్ఠ పరిమితి లేదు. 52 ఏళ్ళ వయసు వచ్చేదాకా చెల్లించే రూ. 10,000/- యొక్క దఫాలవారీ సొమ్మును చెల్లించని పక్షంలో, సొమ్ము వాపస్ అనేది, తిరిగి కొనుగోలు సొమ్ముపైన 15% డిస్కౌంటు తీసుకుని చెల్లించబడుతుంది.
- ముఖపత్రపు విలువ రూ. 10/-. 1వ నెలలో అమ్మకం సరిసమానమైన ధరలోనూ, ఇక ఆ తర్వాత ఎన్‌ఎవి ఆధారమైన అమ్మకపు ధరకీను - (ఎలాట్‌మెంట్ మూడు దశాంశాల దాకాగల భిన్నాలలోని యూనిట్లలో )
- దీనిలో పెట్టే సబ్‌స్క్రిప్షనుకి, మొత్తపు పరిమితి అయిన రూ. 60,000/-లో, ఆదాయ పన్ను చట్టం, 1961 సెక్షన్ 88 క్రింద, పన్ను రాయితీకి అర్హత వుంటుంది.
- నెలవారీ ఆదాయం, 58 ఏళ్ళ వయస్సు వచ్చినప్పటినుంచీను.
- సొమ్ము వాపసు తీసుకోవడం అనేది, 70 ఏళ్ళ వయస్సు వచ్చిన తర్వాత, ఎన్‌ఎవి ఆధారమైన తిరిగి కొనుగోలు ధరకే కాలవ్యవధి ముగిసేముందు సొమ్ము వాపసు తీసుకోవడం అనేది, తిరిగి కొనుగోలు సొమ్ముపైన 10% డిస్కౌంటు తీసుకుని చెల్లించబడుతుంది

పెట్టుబడి ఆధారంగాగల మొట్టమొదటి రిటైర్‌మెంట్ ప్లాన్




**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**
మీ ఉజ్వల భవిష్యత్తు కోసం

**RETIREMENT BENEFIT PLAN**
రిటైరవ్వడంలోని ఆనందాన్ని కనుగొనండి.

మ్యూచువల్ ఫండ్లూ, సెక్యూరిటీలలో పెట్టుబడులన్నీ మార్కెట్ రిస్క్‌లకు లోబద్ధంగా వుంటాయి. ఇక స్కీముల యొక్క ఎన్‌ఎవి అనేది, సెక్యూరిటీ మార్కెట్‌ని ప్రభావం చేసే అంశాలూ, శక్తులపైన ఆధారపడి వాటికి హెచ్చుతగ్గులు వుండవచ్చును ఆ తీరులో. గతంలోని కార్యసాఫల్యం, భవిష్యత్తులోని ఫలితాలకు సూచన కాదు. రిటైర్‌మెంట్ బెనిఫిట్ ప్లాన్ అనేది పథకం యొక్క పేరు మాత్రమే అది యీ పథకంయొక్క లక్షణాన్నిగాని, భవిష్యత్తులోని అవకాశాన్నిగాని లేదా లాభాల్నిగాని ఏవిధంగానూ సూచించదు. ఈ పథకాల ఉద్దేశ్యాలు సాధించబడతాయనే హామీ యివ్వబడటం లేదు. పెట్టుబడి పెట్టేముందు, ఆఫర్ డాక్యుమెంటుని చదవమని మనవి.

జోనల్ ఆఫీసు: 29, రాజాజీ సాలై, మద్రాసు 600 001, ఫోను: 517101.
బ్రాంచి ఆఫీసులు: హైదరాబాదు, ఫోను: 511095 • విశాఖపట్నం, ఫోను: 550275 • విజయవాడ, ఫోను: 74434

UTI-159/94 TE B

# చతురకతలు

## పురుగు

మోహన్రావ్‌కి ఆ కవర్ చించేటప్పుడు అందులో ఇంత మహత్తరమైన విషయం ఉంటుందని తెలియదు. ఓ క్షణం అందుక య్యే ఖర్చు తలుచుకొని బాధనిపించినా మరు క్షణం మహదానందం కలిగింది.

ఆ ఉత్తరంలోని సారాంశం ఇది.

"ఇదేదో మామూలు కాగితం అనుకునేరు. కానేకాదు. ఓ గొప్ప అదృష్టం మీ తలుపు తట్టింది. ఈ భగవంతుణ్నే మీరు నమ్మండి. నమ్మటమే కాదు. ఈ ఉత్తరం కాపీలు తీయించి ఇరవైఏడు మందికి పంపించండి. పదిరోజుల్లోగా అదృష్టం మిమ్మల్ని వరి స్తుంది. ఆగండి... ఇంతేనా అని చించేయ కండి. ఇలాగే చించేసిన రమణారావుగారి లారీ కాలిపోయింది. మధుగారు ఉద్యో గంనుండి సస్పెండ్ అయ్యారు. సత్యంగారు ఈ కాపీలే ముద్రించి పంపటంతో దాయాదుల ఆస్తి కలిసింది. సూరయ్యగారికి లాటరీలో అయిదు లక్షలు వచ్చాయి"

చివరన ఇంకో హెచ్చరిక ఉంది.

"ఈ లేఖను నాలుగురోజులకి మించి ఉంచ కండి. అది చాలాప్రమాదం" మోహన్రావ్ భక్తుడు. ఉపవాసాలుంటాడు. పూజలు చేయి స్తాడు. ప్రతిరోజూ ఏదో ఒక గుడికి వెళ్తాడు. జాతకాలమీద నమ్మకం ఉంది. మనిషి నిమిత్త మాత్రుడని అభిప్రాయపడతాడు.

వెంటనే ఆ లేఖను ఇరవైఏడు కాపీలు



కవర్‌ఫొటో: వి.సత్యమూర్తి

తీయించాడు. కవర్లు కొన్నాడు. ఎవరెవరికి పంపాలా అనే విషయంలో రామదాసు సలహా తీసుకున్నాడు. చివరికి ఒక్కటి మాత్రం మిగి లింది.

'ఇంకెవరున్నారబ్బా' అని రామదాసు ఆలోచిస్తుండగా తనే కవర్ అందుకుని పేరు రాశాడు.

"ఎందుకు అశోక్ పేరు రాశారు. అతను శుద్ధనాస్తికుడు. ఇది చూడగానే చించి అవతల పారేస్తాడుగా"

"అందుకే' అన్నాడు మోహన్రావ్.

-పి. చంద్రశేఖర అజాద్

## ఫైరింజన్

"భార్యామణీ! పెళ్లాంగారూ! బీవీజీ! ఓ మై మిసెస్..."

"చూడండీ! నాకేం చెవుడు లేదు, మీ బహుభాషా పాండిత్యం తెలుసుకోవాలనీ లేదు. నేనిక్కడ వంటతో కుస్తీ పడుతూ నానా అవస్థ పడుతుంటే తీరి కూర్చుని వీధీవాడా వినేట్లు ఏవిటా అరవడం?"

ఆ చెంగు దోపిన తీరూ, మాటల్లో విసురూ చూస్తుంటే ఆవిడే నాకు మొగుడనిపిస్తుంది చూసేవాళ్లకి.

నేను తగ్గిపోయి, నంగినంగిగా వంట య్యిందో లేదో వాకబుచేశాను.

మళ్లీ ఒక అష్టోత్తరం చదివి వంట అవుతూ అవుతూ వుందనీ, నేను తనకి సహాయం చేయకపోగా మధ్యలో ఆటంకాలు కలిగిస్తు న్నందుకు ఆలస్యమనీ వివరించింది.

నాకు ఒళ్లు మండిపోయింది. అలాని కోపా న్ని వెళ్లగక్కే ధైర్యమూ లేదు. దురాశకి పోయి ఉద్యోగస్తురాలైన భార్య కావాలని కోరిమరీ చేసుకుంటే ఈమెగారు ఇంటాబయటా చాకిరీ చేయలేక రోజుకోసారి డైరెక్టుగా, అరవయ్యారు సార్లు ఇండైరెక్టుగా విరుచుకుపడడం మామూ లైపోయింది.

అందుకే ఆమెని కదిలించినందుకు నాకు నేను లెంపలేసుకుని, చల్లగా స్కూటరు తాళా లు తీసుకుని బయల్దేరాను.

నగరం ఈ మూల మా ఇల్లుంటే ఆ మూల ఆఫీసు. ఇరుకు రోడ్లమీద ట్రాఫిక్ జామ్‌లని భరిస్తూ కోపిష్టి ఆఫీసరుగారి ముఖాన్ని తల్చు కుని చింతిస్తూ లేటైపోతోందన్న టెన్షన్‌తో వున్న నన్ను రణగొణధ్వనుల ఫైరింజన్ దూ సుకుపోయింది.

ఆ రొదకు నా బీపీ పెరుగుతుందేమో అనిపించింది. అది క్షణికమే. వెంటనే ఎక్కడో అగ్నిప్రమాదం సంభవించిందనుకోగానే అయ్యోపాపమని మనసు ద్రవించింది.

రెండు ఫర్లాంగులు ఏదో రేస్ పెట్టుకున్నట్లు నా స్కూటర్‌తోబాటే ఫైరింజన్ వస్తుంటే కొంపదీసి మా ఆఫీసుకే నిప్పంటుకోలేదుకదా అనిపించిందో క్షణం.

ఆ రోడ్డు స్ట్రెయిట్‌గా రెండు కిలోమీటర్లు వెళ్లి లెఫ్టుకి తిరిగితే అక్కడే మా ఆఫీసు.

మా కాంటీన్ కనకయ్య ఈ పూట ఏమేం టిఫిన్లు చేస్తాడు? రాళ్లమాదిరి కరకరలాడే మైసూరు బజ్జీలా? జావగారే ఉప్మానా? అందులో బోన్‌లెస్ జీవులు ఏమేం తేలడానికి స్కోపుంది? అని ఆలోచిస్తుంటే నాపక్కనే ఫైరింజన్ ఆగింది.

'నా కడుపు మంటని చల్లార్చుకోడానికి కాదుగదా' అనుకుని నేనూ బండి ఆపి ప్రశ్నా ర్థకంగా చూశాను.

ఫైర్‌మేన్ దిగివచ్చి ఓ కాగితం చూపి ఆ అడ్రస్‌దారి ఎటో చెప్పమని అడిగాడు.

నిత్యం ప్రయాణించే వీధులే కనుక నాకు ఆ ఏరియా అంతా కొట్టినపిండే!

నేను వాళ్లకి మార్గదర్శకుణ్ణయితే వాళ్లిప్పు డు నాకు ఆపద్బాంధవులనుకోవాలి. మా దుర్వాసబాసుగారికి నా మొత్తం ఆలస్యానికీ




ఈ సాకు వాడుకోవచ్చు.

అంతే... ఠక్కున సరేనని నన్ను ఫాలో అవమన్నాను.

కుడి, ఎడమలకి మళ్లుతూ ఒక సందు లోంచి మరో సందులోకి వెళ్ళగా వెళ్లగా చివరికి గమ్యం చేరాము.

కరెక్ట్ అడ్రెస్ దొరగ్గానే మా ఆఫీసుకి మళ్లుదా మనుకున్నాను. కానీ అంతదూరం వెళ్లీ తీరా అక్కడి పరిస్థితి తెలుసుకోకుండా ఎలా వెళ్లడ మని నేనూ వాళ్లతోబాటే స్కూటర్ ఓ పక్కకి పార్క్‌చేసి విషయం తెలుసుకోవాలనే కుతూ




హలంతో నిలబడిపోయాను.

కనుచూపు మేరలో మంటలుగానీ పొగలు గానీ కనబడ్డంలేదు. అదేమాట పైకి అనేశాను. ఫైరింజన్ డ్రైవర్ నన్నో పల్లెటూరి బైతుని చూసినట్లు చూసి అమాయకంగా ముఖంపెట్టి 'ఇవేం గడ్డివాములా, తాటాకుల కొంపలా మంటలు బుగబుగా కనపడటానికి?' అంటూ నవ్వేశాడు.

నాకూ నిజమేననిపించింది. అయితే కనీసం ఇరుగూ పొరుగూ కూడా పోగవ్వలేదే మని మరో సందేహం కలిగినా, పల్లెల్లో వున్నంత తీరిక పట్నవాసులకెక్కడిది. పొరుగి ల్లు కాలితేనేం, కాలకపోతేనేం అవన్నీ ఎక్కడ పట్టించుకుంటారు అని కిమ్మనలేదు.

ఇంటాయన కాబోలు లబలబలాడుతూ పరిగెత్తుకుంటూ వచ్చి, "చాలా థ్యాంక్సండీ... మీరేనయం అరగంటలో వచ్చేశారు. అక్కడికీ మా ఆవిడకి చెప్తూనేవు న్నాను. ఆవిడ వినిపించుకుంటేకదా, ఆమె తరపున నేను క్షమాపణ చెప్పుకుంటానండీ! ఒక్క రెండు నిమిషాలు ఓర్పు పట్టండి..." అన్నాడు.

నాతోబాటు ఫైర్‌మాన్‌లు కూడా అయోమ యంగా చూశారు.

"మా ఆవిడ టాంకు కడిగిస్తోంది. అయిపో వచ్చింది. మీరు మా టాంకు తగలడిందను కుని ఆ నీళ్లు కాస్త మా టాంకులో పోసి పోండి బాబూ! వాటర్ వర్క్స్‌వాళ్లకి ఓ టాంకర్ పంపమని వందసార్లు చెప్పినా రాలేదు, మీరే నయం ఒక్క ఫోను కొట్టగానే..."

ఆశ్చర్యంనుంచి తేరుకోగానే మా ఆఫీసరు గారి రుద్రరూపం గుర్తొచ్చి స్కూటర్ని పరుగు దీయించాను.

-నాగరత్న

# చతుర

సంచిక: 2
సంపుటి: 18
మార్చి 1995



“మన పెళ్లి వీలయినంత త్వరలో జరిగిపోవాలి ప్రియా! ఇంక నిన్ను విడిచి ఒక్క క్షణం కూడా వుండలేను” అన్నాడతను తమకంగా.

“నేనూ అంతే రాజేష్! నువ్వే తేదీ ఫిక్స్ చెయ్యి” అంది ఆమె అతని చేతిని మరింత ప్రేమగా నొక్కుతూ.

**ఆలస్యమయితే తన గుట్టు బట్టబయలవుతుందని అతడు, తొందరపడకపోతే తన జీవితానికి సంబంధించిన చేదునిజం అతడికి తెలిసిపోతుందని ఆమె... ఇలా ఒకరినొకరు తొందరపెట్టి 'పెళ్లి' బంధంలో ఇరుక్కుని సంసారజీవన నౌకలో అడుగుపెట్టారు. అటుపైన ఆ నౌక ఎటు పయనించింది? ఆ ఇద్దరి జీవితాల్లో దాచుకున్న రహస్యాలు ఎలాంటివి?**

నైతిక విలువలకు నీళ్లొదిలి, విచ్చలవిడి ప్రవర్తనతో జీవితాన్ని కష్టాలమయం చేసుకునే ఒకవర్గం యువత మనోభావాలకు సాహితీరూపం **ఎమ్. లక్ష్మీరమణకుమారి 'తప్పు'** ఈ నెల 'చతుర' సమగ్రనవల.

కురిసీ కురవనట్లు వాన కురుస్తోంది.

పొగమంచు కప్పిన చెట్లు సన్నని మేలిము సుగు ధరించినట్లున్నాయి.

రెండురోజుల్నుంచీ పడిస వానవల్ల మురికి అంతాపోయి చెట్లన్నీ శుభ్రంగా కడిగేసినట్లు తయారయ్యాయి.

రాజు ఇంట్లో వెచ్చగా దుప్పటి కప్పుకుని కూర్చుని మరీ టీ తాగుతున్నాడు. పక్కనే అతని మేనమామ చంద్రయ్య పడుకునివున్నాడు దుప్పటి కప్పుకుని.

"ఈసారన్నా పదోక్లాసుకి కడ్తున్నావా లేదా?" అడిగాడు చంద్రయ్య, ముసుగు కొద్దిగా తొలగించి.

రాజుకి ఆ ప్రశ్న వినగానే చిర్రెత్తింది. రాజుకి ఇరవైఏళ్లు. అయిదుసార్లు పదోక్లాసు పరీక్ష రాసి ఇహ వదిలేశాడు.

"ప్రతి వెధవకీ నా చదువు గురించే బాధ" అన్నాడు విసుగ్గా.

"నేను వెధవలా కనిపిస్తున్నానా'' కసురుకున్నాడు చంద్రయ్య.

"నిన్ను కాదు మామయ్యా. ఇందాక కోటయ్య కనిపించి వెకిలిగా నవ్వుతూ ఇదేప్రశ్న అడిగాడు. ఇంకో నలుగురైదుగురన్నా ఇవాళ అదే విషయం అడిగారనుకో. వీళ్ళకి ఎందుకింత ఆసక్తి ఉందో నా చదువుమీద"

"అది లోకరీతి! ఎవరైనా, ఎవరినైనా ఇదే అడుగుతారు. బాధపడకు'' అన్నాడు చంద్రయ్య.

రాజు కిటికీలోంచి వర్షాన్ని చూస్తూ అన్నాడు- "చదువంత అవసరమా?"

"అవసరమే''

"ఎందుకనీ?"

"చదువుకుంటే ఉద్యోగం వస్తుంది''

"వస్తే...?"

"జీతం వస్తుంది. అది పెట్టి మనక్కావాల్సినవి కొనుక్కోవచ్చు. అది ఉంటేనేగదా మనం బ్రతికేది''

"బోడి జీతం... ఎవడికి చాల్తుంది? ఏ మూలకి చాల్తుంది."

"అయితే వ్యాపారం చేసుకోవచ్చు. చదువుకుంటే బ్యాంక్ రుణాలు ఎక్కడెక్కడ దొరుకుతాయో ఎలా తెచ్చుకోవాలో తెలుస్తుంది. చదువు వచ్చినవాడిని ఎవరూ మోసం చెయ్యలేరు''

"సరే...! ఎటుతిరిగి ఎటొచ్చినా, మొత్తంమీద డబ్బుంటే మంచిది. ఆ డబ్బు కావాలంటే చదువు కావాలి. అంతేగా నువ్వు చెప్పదల్చుకుంది?"

చంద్రయ్యకి చాలా సంతోషం కలిగింది. తను చెప్పదల్చుకున్నది మేనల్లుడు అంత తేలిగ్గా గ్రహించినందుకు ఆనందించాడు.

అంతలోనే రాజు బాంబ్ పేల్చినట్లు అన్నాడు- "అయితే నేను చదువుకోను''

"ఏం?"

"డబ్బు కోసమేగా, మనమీపాట్లు పడాల్సింది. చదువూ గిదువూ అని డబ్బు సంపాదించటం కోసం నానాతంటాలు పడేకన్నా, బాగా డబ్బున్న వాళ్ళ పిల్లని ఎవత్తెనో చూసి చేసుకుంటేపోలా..." అన్నాడు రాజు తేలిగ్గా.

చంద్రయ్య పగలబడి నవ్వటం మొదలుపెట్టాడు.

"ఎందుకూ నవ్వుతావు'' ఉక్రోషంగా అడిగాడు రాజు.

"ఓరి వెర్రివెధవా! అదంత తేలిగ్గా జరిగేప...ుతే అందరూ అట్లాగే చేసేవాళ్లు. ఒళ్లు హూనం చేసుకుని డబ్బు సంపాదించటానికి ఇంత కష్టపడేవాళ్ళా? ఎవత్తెరా అంత తేలిగ్గా వచ్చి నిన్ను చేసుకునే డబ్బున్న పిల్ల?"

"ఏమో... ఎవరన్నా కావచ్చు''

"అలాంటి పగటికలలు కనకు. ఎవరూ అంత తేలిగ్గా పెళ్ళిళ్లు చేసుకోరు. డబ్బున్నవాళ్లు బాగా డబ్బున్నవాళ్ళనీ వాళ్లు ఇంకా ఇంకా డబ్బున్నవాళ్ళనీ వెతుక్కుంటారుగానీ,





నిన్నూ నన్నూ చేసుకుంటారా?"

రాజు సమాధానం చెప్పలేదు.

నిశ్శబ్దంగా ఆలోచిస్తూ ఉన్నాడు.

ఇంతలో దూరంగా మోటార్‌సైకిల్ చప్పుడు వినిపించింది. ఆ చప్పుడు దగ్గరయ్యేకొద్దీ భయంకరంగా వినిపిస్తోంది.

ధడధడమని ఆ ఇంటిముందునుంచే వెళ్ళి మలుపు తిరిగినట్లుంది.

అది రంగారావుది! చీకట్లో కూడా అతని గోల్డ్‌చైన్ వాచీ, రాళ్ళ ఉంగరాలు, తెల్లటి సిల్కుబట్టలు మెరుస్తుంటాయి. అతని చైన్ చప్పుడు ఫర్లాంగుదూరంనుండీ అతన్ని గుర్తు చేస్తుంది.

"మరైతే రంగారావు సంగతేంటంటావు" అడిగాడు రాజు.

రంగారావు ఆ ఊళ్ళో బాగా డబ్బున్నవాడని పేరుపడ్డ సుబ్బయ్య ఏకైక కుమార్తెని ప్రేమించి పెళ్లిచేసుకున్నాడు. భార్య పుణ్యమా అని మామగారి ఆస్థిని దర్జాగా అనుభవిస్తున్నాడు.

"రంగారావు సంగతి సరే... నా సంగతేంటి మరి" అన్నాడు చంద్రయ్య.

చంద్రయ్య ఏపనీ చెయ్యడు. సంపాదన ఏమీలేదు. అతని ధోరణిని మార్చలేక విసుగెత్తి చివరికి అతని భార్య అతన్ని విడిచిపెట్టి, పిల్లల్ని తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది. నాలుగిళ్లల్లో పనిచేసి తను బతుకుతూ, పిల్లల్ని పోషించుకుంటోంది.

"ముగ్గురు పిల్లల్ని పోషిస్తోంది. నేను ఒక్కడ్నే బరువయ్యానా. మొగుడితో కలిసి వుంటే ఎంత గౌరవం" అని చంద్రయ్య ఆవిడ దగ్గర చేరుదామని చూశాడు. కానీ అతని ఆటలు ఆవిడ ఏమాత్రం సాగనివ్వలేదు. వచ్చిన రోజునే సోమరిపోతులా కూర్చుంటే ఏమాత్రం కుదరదని తెగేసి చెప్పింది. అయినా వినకుండా చంద్రయ్య మరో రెండురోజులు అక్కడే ఉన్నాడు. చివరికి ఆవిడా, ఆవిడ తమ్ముళ్లూ కలిసి అతన్ని దాదాపుగా బయటకి గెంటేశారు. చంద్రయ్య చేసేదిలేక తిట్టుకుంటూ అక్క శాంతమ్మ దగ్గర చేరాడు. ఆ శాంతమ్మ కొడుకే ఈ రాజు.

శాంతమ్మది భర్తపోయిన మగదిక్కులేని సంసారం. పోన్లే, తమ్ముడు కూడా తన ఇంట్లోనే ఉంటే తనకీ కాస్త మనసుకి ధైర్యంగా ఉంటుంది అనుకుని ఉండనిచ్చింది. ఉన్న అర్ధఎకరం పొలం, చిన్న ఇల్లూ... వీటితోపాటు ఏవో చేతనైన పనిపాటలు చేస్తూ శాంతమ్మ సంసారాన్ని ఈడ్చుకొస్తున్నది.

"మామయ్యా నీ సంగతి వేరు. నీకు సమర్థించుకోవటం చేతకాలేదు. పెళ్ళాన్ని ఎక్కడ ఉంచాలో అక్కడ ఉంచితే వచ్చినట్లు పడుంటుంది" అన్నాడు రాజు.

"ఒరేయ్. గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందని నువ్వు నాకు చెప్పవచ్చావురా. నాకు సమర్థత లేదంటావా వెధవా. ఆడవాళ్ళ సంగతి నీకు తెలీక అట్లా మాట్లాడావు. సర్లే... ఏదైనా కానీ నువ్వు నా అల్లుడివి. నీమంచి కోరి చెప్తున్నాను. చదువుకుని బాగుపడు. ఆడదానిమీద ఆధారపడదామని చూస్తే నిన్ను కుక్కని చూసినట్లు చూస్తుంది. ఇంకో విషయం చెప్పనా. ఒక్క మొగాడు నలుగురు పెళ్ళాలకి భోజనం పెట్టగలడు, కానీ నలుగురు పెళ్ళాలు కలిసి కూడా ఒక్క మొగుడికి భోజనం పెట్టి పోషించాలంటే ఏడిచిచస్తారు. నీ కోరికలు నెరవేరవుగానీ నేలమీద నిలబడు" అన్నాడు చంద్రయ్య కోపంగా.

"అదీ చూస్తాను" అన్నాడు రాజు, ఛాలెంజ్ చేస్తున్నట్లుగా.

"నువ్వు బాగుపడితే నాకన్నా ఎవరూ సంతోషించరు. నిజంగా నీకు ఎవరన్నా బాగా డబ్బున్న పిల్ల దొరికి కాలుమీద కాలేసుకుని బతికే స్థితి వస్తే నాకంతే చాలు" అన్నాడు చంద్రయ్య.

"అదీ.. అట్లా అన్నావు బాగుంది"

"మరి ఇకనేం... ఇవాళే ప్రయత్నం ప్రారంభించు"

"ఎప్పుడో ఆరంభించా..." నవ్వాడు రాజు.

"ఓరినీ... నిజంగానా? ఎవరా పిల్లా?"

"సస్పెన్స్... ఇప్పుడప్పుడే చెప్పను'' అన్నాడు రాజు.

చంద్రయ్య మళ్ళీ ముసుగు బిగించాడు.

రాజు కూర్చుని ఆలోచిస్తున్నాడు.

వారంరోజుల క్రితం అతనికి రాగిణి గురించి ఆలోచన వచ్చింది. ఈ పిల్లని మనం ప్రేమిస్తే పోలా అనిపించింది.

రాగిణి అతనికి దూరపుచుట్టం. మనిషి చాలా అందంగా ఉంటుంది. పదహారేళ్లు ఉంటాయి. ఇంటర్ చదువుతోంది. రాగిణి తండ్రికి చాలా ఆస్థి ఉంది, రాగిణి ఒక్కత్తే సంతానం.

మర్నాడు పొద్దున్నే లేచి రాగిణిని కలుసుకోవాలి అని నిర్ణయించుకున్నాడు రాజు.

లేవగానే ముందుగా ఇంటిముందు అందంగా విరిసిన గులాబీని కోశాడు.

ఆ క్షణంలో మాత్రం పదోక్లాసు పాస్ కానందుకు కాస్త చింతించాడు.

ఎందుకంటే, తనే కనక పదోక్లాసు పాసై ఇంటర్‌లో చేరిఉంటే, హాయిగా రాగిణితో పాటే కాలేజీలో చదువుతూ ఉండేవాడు. ఆమెని పలకరించటానికి తను ఇంత కష్టపడి తడుముకోవాల్సిన అవసరం ఉండేదికాదు.

పువ్వుని జాగ్రత్తచేసి గబగబా పళ్లుతోమి, స్నానంచేసి, అందంగా తయారయ్యాడు.

తర్వాత రాగిణిని ఎట్లా ఎక్కడ కలవాలో ఏమేం మాట్లాడాలో అన్నీ బాగా ఆలోచించి పెట్టుకున్నాడు.

రాజు సినిమాలు జోరుగా చూస్తుంటాడు. అడపాదడపా నవలలు కూడా చదివేవాడు. అంతకుమించి వాళ్ళూ వీళ్లూ చెప్పుకునే కబుర్లు ఓపిగ్గా వింటుంటాడు. ఆ అనుభవాల్తో ఏవిధంగా మాట్లాడి రాగిణిని బుట్టలో వేయాలో ఆయా డైలాగులు ఆలోచించుకుని బట్టీ పట్టి రెడీగా ఉన్నాడు.

రాగిణి కాలేజీ పక్క ఊర్లో ఉంది.

రాజు ఉంటున్న చిన్న పల్లెలో స్కూల్ మాత్రం ఉంది. జూనియర్ కాలేజీకిగానీ, పెద్ద కాలేజీకిగానీ పోవాల్సినవాళ్లు పక్కఊరికి బస్సో, బండో ఎక్కివెళ్తారు. సైకిళ్ళమీద, మోటార్ సైకిల్స్‌మీద వెళ్లేవాళ్లు కూడా కొందరున్నారు.

పొద్దున్నే బస్ ఎక్కుతుంది రాగిణి.

ఆమెతో చదివే ఆడపిల్లలెవరూ లేరు ఆ ఊళ్లో. అందుకని బస్ దిగాక పక్కఊర్లో ఒక్కత్తే కాస్త దూరం నడిచి కాలేజీ చేరుతుంది.

రాజు ఆమెకన్నా ముందే సైకిల్‌మీద ఆ ఊరు చేరాడు. ఆ తర్వాత సైకిల్ ఒకచోట భద్రంగా పెట్టి పువ్వు పైకి తీసి పట్టుకుని బస్సు ఆగే దగ్గర నిలబడ్డాడు.

బస్సు ఆగగానే పొలోమంటూ ముగ్గురు మగపిల్లలూ, వాళ్ళ వెనకాల రాగిణీ దిగారు.

మగపిల్లలు ఏవో మాట్లాడుకుంటూ గబగబా వెళ్తున్నారు. రాగిణి ఆ వెనుకే మెల్లగా నడుస్తోంది.

రోడ్డుకి అటుపక్కా ఇటుపక్కా పొలాలు. రోడ్డుకి అటూ ఇటూ చెట్లు! వాతావరణం హాయిగా ఉంది.

అక్కణ్ణుంచి కాస్త దూరం నడిస్తేగానీ ఊరురాదు. రోడ్డుమీద దాదాపుగా ఎవరూ లేరు.

"రాగిణీ' మెల్లగా పిలిచాడు రాజు. రాగిణి ఏమిటన్నట్లు చూసింది.

రాజు తెచ్చిన గులాబీ పువ్వు ఎరుపు రంగులో ఉంది. రాగిణి కూడా ఆరోజు ఎర్ర రంగు డ్రెస్సే వేసుకుంది.

"పువ్వు...! నీ కోసమే...! తీసుకో' అన్నాడు.

రాగిణి ఒక్కక్షణం సందేహించి తీసుకుంది.

"బాగా చదువుతున్నావా? నువ్వు సైన్సు




తీసుకున్నావుకదూ... డాక్టరవుతావా ఏం?" అన్నాడు రాజు.

రాగిణి నవ్వేసి ఊరుకుంది. రాగిణికి రాజు పదో తరగతి ఇంకా పాస్ కాలేదని తెలుసు.

"ఈ ఊరు వచ్చాను. నీ కోసమే'' అన్నాడు.

"నా కోసమా... ఎందుకు?"

"ఎందుకా... నేను ఊరు వదిలి వెళ్ళిపోతున్నానుగదా! నీకు చెప్పాలని..."

"ఎక్కడికి వెళ్తున్నావు'' ఆశ్చర్యంగా అడిగింది రాగిణి.

"దుబాయ్‌కి''

"ఎందుకూ. అక్కడ నువ్వేం చేస్తావు'' ఆశ్చర్యంగా చూసింది రాగిణి.

"మా ఫ్రెండొకడున్నాడు. మన ఊరబ్బాయి కాదులే. పట్నంలో పరిచయమయ్యాడు. అతను దుబాయ్‌లో వ్యాపారం చేస్తున్నాడు బ్రహ్మాండంగా. ఒక్కడే నిభాయించుకోలేక, నన్ను తోడురమ్మని బతిమాలుతున్నాడు. వీసా, పాస్‌పోర్ట్ అన్నీ రెడీ అవుతున్నాయి. ఇంక వెళ్ళిపోవటమే''

రాగిణి ఆగి నిలబడి వింటోంది.

రాజు కూడా నిలబడ్డాడు.

"డాక్టర్లు, ఇంజనీర్లు వెళతారు విదేశాలకు. వాళ్లు సంపాదిస్తే జీతం తప్ప ఏం ఉంటుంది. అదే వ్యాపారం అయితే కోట్లు, కోట్లు సంపాదిస్తారు'' అన్నాడు రాజు.

రాగిణి విస్మయంగా వింటోంది. ఆమెకి ఇల్లు, కాలేజ్ తప్ప మరోటి తెలీదు.

"ఎవరూ చెప్పుకోవటం లేదేం మరి, నువ్వు వెళ్తున్నావని'' అంది.

"నేను చెప్పలేదులే! మా అమ్మకి తెలిస్తే చాలా బాధపడుతుందని! ఎంత డబ్బున్నవాళ్ళకయినా, అసలు డబ్బులేని మాలాంటి వాళ్ళ

కయినా, కన్నప్రేమ ఒకటే.. అమ్మకి చెప్పను. వెళ్లేరోజు చెప్తాను చాలు''

"పాపం బాధపడుతుందేమో'' అన్నది రాగిణి.

"తప్పదు. అయినా నేను వెళ్ళి కోట్లు సంపాదించి తెస్తే ఆవిడ మాత్రం సంతోషించదూ..."

"నిజమేలే... కానీ అంత తేలికా అక్కడ డబ్బు సంపాదించటం?" రాగిణికి ఇంకా నమ్మబుద్ధి కావటంలేదు.

కనీసం తను దుబాయ్‌కి వెళ్తున్నానన్న విషయంలో ఆమెకి నమ్మకం కలిగినందుకు లోలోపల సంతోషించాడు రాజు.

"తేలికేనని మా ఫ్రెండ్ చెప్పాడు. వాడు వెళ్ళి ఏడాది కాలేదు. మొదట్లోనే రెండు మూడు నెలలు తిరిగేసరికే అయిదారు లక్షలు ఇక్కడికి ప్రతినెలా పంపించాడు''

రాగిణి మొహంలో ఆశ్చర్యం మరింత ఎక్కువైంది.

"రాగిణీ వాడు చెప్పాడుగదా, విమాన ప్రయాణం ఎంతో బాగుంటుందట. కింద మేఘాలు, పైన నీలంరంగు ఆకాశం. అట్లా కిందికి చూస్తే నీలంరంగులో తళతళలాడ్తున్న సముద్రం... విమానం ఎగుర్తుంటే కింద ఇళ్ళన్నీ చీమలంత కన్పిస్తాయిట. అట్లా ఒళ్లు తేలిపోయినట్లు ఉంటుందిట"

రాగిణికి మొత్తం నమ్మకం కలిగిందని తెలుసుకున్నాక ఇంక విజృంభించి తను చూసి చదివి తెలుసుకున్న పరిజ్ఞానాన్ని మాటల్లో పదును పెట్టి సంధించటం మొదలుపెట్టాడు.

"అక్కడ కార్లు ఎంతో అందంగా వుంటాయి. మన డొక్కు కార్లలా కాదు. అన్నీ ఎయిర్‌కండిషన్డ్ కార్లే... బోలెడు పెట్రోల్ తాగుతాయవి! అయినా వాళ్లకేం. ఎంత కావలిస్తే అంత పెట్రోలు..."

"ఇట్లా చెయ్యి పెట్టామంటే వాష్ బేసిన్లో, అట్లా నీళ్లు వస్తాయి. చెయ్యి తీసేస్తే నీళ్లు ఆగిపోతాయి. అంతా ఆటోమేటిక్. ఇక్కడలా చెయ్యి కడుక్కోవాలంటే పంపు చచ్చేట్లు తిప్పి మళ్ళీ కట్టేసి బాధపడక్కర్లేదు''

"ఎక్కడికన్నా షాపులకి వెళ్తే అన్నీ ఒకేచోట దొరుకుతాయి. పిన్ టు గన్. నువ్విక్కడ పట్టుచీరె, అమెరికన్ సిల్కూ కొనుక్కొని, అక్కడ డైమండ్ నెక్లెస్‌కొని, ఆ పక్క కూరగాయలు కొనుక్కుని వచ్చేస్తావన్నమాట"

"నడుస్తుంటే లైట్లు వెలుగుతాయి. నువ్వు ఆ చోటు దాటగానే ఆరిపోతాయి. నువ్వు కార్లో ఇంటికి వస్తావు, గేట్ ఆటోమాటిక్‌గా తెరుచుకుంటుంది. ఇక్కడిలా కారుదిగి గేటుతీసి తోసుకుంటూ నెట్టి కారు లోపల పెట్టుకోక్కర్లేదు. తలుపులు నువ్వు వస్తుంటే తెరుచుకుంటాయి. నువ్వు పోగానే మూసుకుంటాయి''

అవన్నీ వర్ణిస్తూ రాగిణికి తను స్వయంగా అనుభవిస్తున్న అనుభూతిని కలిగించాడు రాజు.

"తిండి ఇక్కడలా కాదు. అన్ని దేశాల నుంచి మంచి మంచి ఐటమ్స్ అన్నీ అక్కడకే వెళతాయి ముందు. మెత్త మెత్తటి బట్టలు, డైమండ్ నెక్లెస్‌లు, ఏ.సీ. కార్లూ, ప్యాలస్ లాంటి భవంతులు... ఓహ్... నిజంగా స్వర్గం అనుకో..."

రాగిణికి వింటుంటేనే కడుపు నిండిపోయినట్లుంది. కళ్ళముందు ఆ భవంతులు, కార్లు, విమానాలు కదులుతున్నాయి.

రాజు అలా ఇంకా ఎన్నెన్నో చెప్పాడు. "మరి ఇవన్నీ సంపాదించే మార్గం అందుబాటులో ఉండగా అమ్మకోసం మానుకోమంటావా... నువ్వే చెప్పు రాగిణీ' అన్నాడు.

రాగిణి ఈ లోకంలోకి వచ్చింది.

"ఉహూ వద్దు. తప్పకుండా వెళ్లు'' అంది.

"అందుకే వెళ్తున్నాను. రాగిణీ... ఇవన్నీ నేను సంపాదించేది ఎవరికోసం అనుకున్నావు. నీ కోసమే'' అన్నాడు రాజు.

"నా కోసమా..."




"అవును... రాగిణీ... నిన్ను నేను గాఢంగా ప్రేమిస్తున్నాను... నీకూ నాకూ మధ్య బోలెడు తేడా ఉంది. ఇన్నాళ్ళూ నీకు చెప్పలేకపోయాను. ఎందుకంటే నీ డబ్బు చూసి ప్రేమిస్తున్నానని నువ్వు అపార్థం చేసుకోవచ్చు. కానీ ఇప్పుడు నేను మీకన్నా ఎంతో ఎక్కువ కాబోతున్నాను. అందుకే ధైర్యంగా చెబుతున్నాను. ఐ లవ్ యూ'" అన్నాడు.

రాగిణికి గాలిలో తేలిపోతున్నట్లు ఉంది.

ఒకపక్క రాజు చెప్పిన కబుర్లు కళ్లని మిరుమిట్లు గొలిపిస్తే, ఇంకోపక్క రాజు తనని ప్రేమిస్తున్నానని చెప్పటం మతినే పోగొట్టింది.

పదహారేళ్ళ పసిడిప్రాయంలో ఉంది రాగిణి. ఆ వయసులో అమాయకురాలైన ఒక ఆడపిల్లని ఐ లవ్ యూ అని ఎవరైనా అంటే నమ్మే స్థితిలో ఉంటుంది.

రాజు హఠాత్తుగా ఆమెకి చాలా గొప్పవాడిలా కనిపిస్తున్నాడు. తను అందుకోలేని చందమామలా కనిపిస్తున్నాడు.

"వెళ్తాను'' అన్నాడు మెల్లగా రాజు.

"మళ్లీ ఎప్పుడు కనిపిస్తావు'' అంది రాగిణి మెల్లగా.

"నీ అనుగ్రహం, ఎప్పుడు అంటే అప్పుడే''

"రేపు... ఇదే టైమ్‌కి'' రాగిణి సిగ్గుగా చెప్పేసి పారిపోతున్నట్లు గబగబా అడుగులు వేస్తూ వెళ్ళిపోయింది.

రాజు తృప్తిగా నిట్టూర్చాడు. కష్టం అనుకున్నపని ఇంత సులువుగా జరుగుతుందనుకోలేదు.

రాగిణి ప్రేమ అంటూ పొందాక ఇంక పెళ్లి దగ్గరికి తీసుకెళ్ళటం చాలా సులువు.

మళ్ళీ మర్నాడు ఠంచనుగా ఆ ఊరు చేరాడు.

ఏవేవో కబుర్లు చెప్పి రాగిణిని మైమరపించాడు.

రాగిణికి మరో నాలుగురోజులు గడిచేసరికి అతన్ని చూడందే ఉండలేని స్థితి ఏర్పడింది. నాలుగురోజులు గడిచాక అయిదోరోజున కావాలనే రాగిణిని కలుసుకోలేదు రాజు.

ఆరోజు రాగిణికి పిచ్చెక్కినట్లే అయింది. కాలేజీలో పాఠాలు సరిగ్గా వినలేకపోయింది. అడిగిన ప్రశ్నలకి సమాధానాలు చెప్పలేదు. మౌనంగా పిచ్చిచూపులు చూస్తూ ఉండిపోయింది.

ఆరోజంతా అట్లాగే ఏమీ తినకుండా గడిపింది. నీళ్లు కూడా తాగలేదు. రాజుని చూడంది తను బతకలేనని అనిపించింది.

ఏం జరిగింది? రాజు ఎందుకు రాలేదు. దుబాయ్‌కి వెళ్ళేదాకా ప్రతిరోజూ తనని కలుసుకుంటానని మాట ఇచ్చాడు.

ఒంట్లో బాగాలేక రాలేదా?

అట్లా అనుకోగానే రాగిణికి బాధగా అనిపించింది.

రాజుని చూడాలనే కోరిక తీవ్రమైంది. సాయంత్రానికల్లా రాజు ఇంటికి వెళ్దామని నిశ్చయించుకుంది.

దూరపు బంధువులే అయినా, రాగిణి తండ్రి వెంకయ్య బాగా డబ్బున్న మనిషేకాక డబ్బుమనిషి కూడా కావటంవల్ల ఒకరికొకరికి రాకపోకలు లేవు. వెంకయ్యకి రాజు కుటుంబం ఏమాత్రం కంటికి ఆనదు. శుభకార్యాలకి కూడా వాళ్ళని పిలవడు.

రాగిణి రాజు ఇంటికి వెళ్లేసరికి ఎవరూ లేరు. రాజు ఒక్కడే మంచంమీద పడుకుని దిగులుగా మొహం పెట్టుకుని ఏదో ఆలోచిస్తున్నాడు.

"రాజూ'' పిలిచింది రాగిణి. రాగిణి వస్తుందేమోనని ఊహిస్తూ ఉండడంవల్ల రాజు ఏమంత ఆశ్చర్యపడలేదుగానీ, ఆశ్చర్యం నటించాడు.

"నువ్వా రాగిణీ... రా... రా'' అన్నాడు.

రాగిణి లోపలికి వచ్చింది.

"రాగిణీ... కూర్చో'' అన్నాడు రాజు.

రాగిణి స్టూల్‌మీద కూర్చుంది.

"పొద్దున్న రాలేదేం" అంది.

నిస్పృహగా నవ్వాడు రాజు.

"ఎందుకూ రావటం..." అన్నాడు.

"అదేంటి... ఊరెళ్లేదాకా వస్తానని మాట ఇచ్చావుకదా".

"నిజమే... కానీ నీ బాగుకోసమే... రాలేదు"

రాగిణి అర్థం కానట్లు చూసింది.

"అవును రాగిణీ... రోజూ నిన్ను కలుసుకుంటుంటే లోకం కోడై కూస్తుంది. నీకూ నాకూ మధ్య ఏదో ఉందంటుంది. నేను ఇవాళ ఉండి రేపు ఆ దేశం పోతాను. నువ్వు ఇక్కడే ఉండాల్సినదానివి. నీకు చెడ్డపేరు వస్తే కష్టం. నిజానికి నిన్ను చూడకుండా ఉండటానికి నేనెంత కష్టపడాల్సివచ్చిందో తెల్సా. నా గుండె కత్తిరించి ముక్కలు చేసినట్లయింది. సహించాను. భరించాను, ఎందుకు నీ కోసం... నువ్వు హాయిగా ఉండాలని"

తన కోసం అంత బాధపడే మనిషి రాజు.

రాగిణి గుండె కరిగిపోయింది.

అతని కోసం ఏదైనా సరే చేసేయాలన్పించింది.

"రాజూ... నువ్వు రాకపోతే నాకెంత బాధ కల్గిందో తెల్సా... ప్లీజ్ రాజూ... నువ్వు రోజూ రావాలి" అంది.

"వద్దు రాగిణీ. నన్ను మర్చిపో" అన్నాడు రాజు.

"అది అసంభవం" అంది రాగిణి.

"రేపు నేను వెళ్ళిపోతాను. నీ పెళ్ళవుతుంది. అప్పుడు ఏం చేస్తావు?" అన్నాడు రాజు.

"నిన్ను తప్ప నేను మరెవరినీ చేసుకోను. నిన్ను చేసుకోలేకపోతే జీవితాంతం ఇట్లాగే ఉండిపోతాను" అంది రాగిణి ఆవేశంగా.

సినిమాల్లో, నాటకాల్లో విన్న డైలాగులు తను నిజజీవితంలో చెప్పగలుగుతున్నందుకు లోలోపల ఆమెకి ఆనందంగా ఉంది.

"రాగిణీ" అన్నాడు రాజు.

రాగిణి సిగ్గుగా తలవంచుకుంది.

రాజు ఆమె దగ్గరకు వచ్చి ముద్దుపెట్టుకున్నాడు.

రాగిణి పులకించిపోయింది.

రాజుని తప్ప మరెవరినీ చేసుకోకూడదని గట్టిగా నిర్ణయించుకుంది.

చిత్రమైన అనుభూతితో ఆమె హృదయం తేలిపోతోంది. ఈ అనుభూతి శాశ్వతం కావాలని కోరుకుంటోంది.

"రాగిణీ... పెళ్లికి మన ఇద్దరి పెద్దలూ ఒప్పుకోరు. రహస్యంగా పారిపోయి చేసుకుందాం. నేను ఆ దేశం వెళ్లి తర్వాత నిన్ను రప్పించుకుంటాను. మనం విమానాలు ఎక్కి, కార్లలో తిరిగి చక్కటి బంగళాల్లో ఉంటాం. నీ కోసం స్వర్గం దింపితెస్తాను. మన ఆనందం చూసి ప్రతివాడూ కళ్లుకుట్టి చస్తారు. నీ కోసం నేనేమైనా చేస్తాను. నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించుకుంటాను" గబగబా చెప్పేశాడు రాజు.

రాగిణి అరమోడ్పు కళ్ళతో వింటోంది.

"నేను మరో పదిరోజుల్లో వెళ్లిపోవాలి. ఈ లోపలే మన పెళ్లి జరిగిపోవాలి. సరేనా" అన్నాడు రాజు.

"సరే" అంది రాగిణి.

'ఎల్లుండి పొద్దున్న కాలేజీకి మామూలుగా రా. నీ బాగ్‌లో పట్టుచీరె, నగలు పెట్టుకుని వచ్చెయ్యి. నేను రేపంతా తిరిగి పెళ్ళి ఏర్పాట్లు చేస్తాను. ఎల్లుండి పొద్దున్న పెళ్లి జరిగిపోతుంది. ఆ తర్వాత ఒకవారం రోజులు మనం స్వర్గంలా గడపొచ్చు. తర్వాత నేను వెళ్ళి నీవు అక్కడికి వచ్చే ఏర్పాట్లు చేసేస్తాను" రాజు చెప్పాడు.

"అట్లాగే" అంది రాగిణి.

"ఎందుకైనా మంచిది, రేపు మనం కలుసుకోవద్దు. ఏకంగా ఎల్లుండే కలుసుకుందాం. డబ్బు కూడా వీలైనంత పట్టుకురా. ఏ అవసరా





నికన్నా కావాల్సివస్తుంది. పెళ్ళికదా'' అన్నాడు రాజు.

రాగిణి 'సరే' అంది.

"ఇంక వెళ్ళిపో. ఎక్కువసేపు కూర్చుంటే ఎవరికన్నా అనుమానం వస్తుంది'' అన్నాడు రాజు.

రాగిణి వెళ్ళలేక, వెళ్ళలేక వెళ్ళింది.

రాజు పెళ్లిపనులకని నడుం బిగించాడు.



పల్లెటూరు కాబట్టి అక్కడ ఏ విషయం అయినా దాచటం కష్టం.

అందుకే రాజు తన సంగతి ఎవరికీ తెలియనివ్వలేదు. పక్క ఊరులో అతని ఫ్రెండ్ ఒకడున్నాడు. వెళ్ళి అతనితో తన సంగతి చెప్పాడు. ఆ ఫ్రెండ్ తన గదిలో పెళ్ళి ఏర్పాట్లు చేస్తానన్నాడు.

ఇద్దరూ వెళ్ళి పురోహితుడిని మాట్లాడుకుని వచ్చారు. మంగళసూత్రాలు రోల్డుగోల్డువి కొన్నారు. పసుపుతాడు వగైరా సిద్ధం చేశారు. పూలదండలు ఆర్డరు ఇచ్చారు. పెళ్ళి జరిగినట్లు ముఖ్యంగా రుజువు చేసేవి ఫొటోలే కాబట్టి ఆ ఏర్పాట్లు కూడా చేశారు. అంతా గుట్టు చప్పుడు కాకుండా చేశారు.

ఎప్పుడెప్పుడు వస్తుందా ఆ ఘడియ అని ఎదురుచూడటం మొదలుపెట్టాడు రాజు.

రాగిణి పూర్తిగా తన మాటలు నమ్మింది. ఆమె రావటం, తనని చేసుకోవటం ఖాయం.

ఆ తర్వాత...

పెళ్ళి జరిగాక ఇంక చేసేదేముంది.

తను చెప్పినవన్నీ కోతలేనని తెలిసినా భారతస్త్రీకి భర్తే దైవం కాబట్టి నోరు మూసుకుని కూర్చుంటుంది. ఏమన్నా అంటే తనకే అవమానం అనుకుని ఊరుకుంటుంది.

ఆ తర్వాత... తను...

వెంకయ్య ఆస్థికంతా ఏకైక వారసుడవుతాడు.

రాజు ఆదుర్దాగా చూస్తున్నాడు.

రాగిణి రావాల్సిన బస్సు ఇంకా రాలేదు.

ఆమె తప్పకుండా వస్తుందని తెలుసు. అయినా ఏమో ఏ అవాంతరం వచ్చిందోనని ఆత్రుతగా ఉంది.

రాగిణి రాకుండా తప్పించుకోలేనంత మైకంలో ఆమెని ముంచాడు అతను.

రాగిణి తండ్రి వెంకయ్యకి రాగిణి అంటే ప్రాణం. కూతుర్ని తన దగ్గరే ఇల్లరికం సంబంధం ఇచ్చిచేసి, పెళ్ళయ్యాక కూడా కళ్ళ ఎదురుగానే ఉండేట్లు చూసుకుందామనుకుంటున్నాడు.

విదేశాల్లో ఉండే అబ్బాయిలంటే వెంకయ్యకి మోజులేదు. అంతంత దూరాల్లో ఇచ్చి చేస్తే పిల్లని చూడాలనుకున్నప్పుడల్లా చూసే అవకాశం ఉండదు. ఇక్కడే ఉండే అబ్బాయిని చూడాలని అందరికీ చెప్తూ ఉంటాడు.

రాగిణికి ఆ విషయం తెలుసుగానీ ఆమెకి విదేశీ మోజు మాత్రం బాగానే ఉంది. అందుకే అవన్నీ తెలిసిన రాజు ఆమెమీద ప్రేమ కురిపించి, కబుర్లు చెప్పి బుట్టలో పెట్టాడు.

"వీలైనన్ని దేశాలు చూద్దాం. ఈజిప్టులో నైలునదిమీద నావ ఎక్కి వెన్నెల్లో విహరిద్దాం. అలనాటి క్లియోపాత్రా జూలియస్ సీజర్ లాగా..."

"వెనిస్‌లో గాజుసామాను షాపింగ్ చేద్దాం"

"అమెరికాలో డిస్నీలాండ్, నయాగరా జలపాతాలు..." అంటూ చెప్పి ఆమెని ఊదరగొ

ట్టాడు.

ఇన్ని చూపించగల శక్తి తనకి రాబో తోందని మురిపించాడు. అలాంటప్పుడు రాగి ణి రాకుండా ఉండటం అసాధ్యం.

అతను చూస్తూ ఉండగానే బస్సు వచ్చి ఆగింది. రాగిణి దిగి అతనివంక ప్రేమగా చూస్తూ వస్తున్నది.

ఇద్దరూ ఒకరికళ్ళలోకి ఒకరు చూస్తూ నిల బడ్డారు. అంతలోనే కర్తవ్యం గుర్తుకొచ్చి ముందుకి కదిలారు.

"నేను ముందు నడుస్తుంటాను. నా వెనకే నువ్వురా. నన్ను అనుసరిస్తున్నట్లు ఎవరికీ తెలియనివ్వకు'' అని చెప్పాడు రాజు.

రాగిణి తల ఊపింది.

ఇద్దరూ రాజు ఫ్రెండ్ ఇంటికి చేరారు. రాజూ, ఫ్రెండూ పురోహితుడ్నీ, ఫొటోగ్రాఫర్‌నీ పిల్చుకుని వచ్చేందుకు వెళ్లారు.

ఈ లోపల రాగిణి పట్టుచీరె, జాకెట్టు, నగలు ధరించి, ఒక పూలమాల జడచుట్టూ తిప్పి పూలజడమాదిరి అల్లి కళ్యాణం బొట్టుతో పెళ్లికూతురి వేషంలో రెడీ అయింది.

అంతా సిద్ధం అయ్యేలోపలే...

ఎక్కడ్నుంచి ఊడిపడ్డాడో పెద్ద పెద్ద రంకె లు వేస్తూ మీసాలు భయంకరంగా మెలివేస్తూ ఊడిపడ్డాడు వెంకయ్య.

రాజుకీ, రాగిణికీ ప్రాణాలు పైనే పోయాయి. రాగిణి ఒక మూలకు చేరి వణుకు తూ నిలబడింది.

రాజుకి ముచ్చెమటలు పోస్తున్నాయి.

వెంకయ్య ఒక్కడూ రాలేదు. నలుగురైదు గురు వస్తాదుల్లాంటి పాలేర్లని వెంట తెచ్చుకు న్నాడు.

"ఎంత ధైర్యంరా నీకు? నా కూతుర్నే చేసుకోవాలని చూస్తావా? చంపేస్తాను జాగ్రత్త. నువ్వెంత, నీ బతుకెంత?" అరిచాడు వెంక య్య.

"నాకేం తెలీదు... నీ కూతురే చేసుకుంటా నని వెంటబడింది. పోన్లేపాపం అని..." అన్నా డు రాజు.

"నోర్మూయ్ వెధవా. ఏమే... నీకు వీడు తప్ప మరోడు దొరకలేదా? సిగ్గులేదూ... పైసా సంపాదన లేని వెధవని ప్రేమిస్తావా... ఇంటికె ళ్లాక నీపని చెప్తాను'' గర్జించాడు వెంకయ్య.

"రాజుకేం తక్కువ. రేపు దుబాయ్‌కి వెళ్లి కోట్లు సంపాదిస్తాడు'' అంది రాగిణి.

"ఏడిశాడు. వీడి మాటలు నమ్మావా? ఏదీ ఎట్లా సంపాదిస్తాడు... ఏం చేసి?" అన్నాడు వెంకయ్య.

"ఆయన ఫ్రెండ్ ఉన్నాడుట అక్కడ. ఇద్ద రూ కలిసి వ్యాపారం చేస్తారు'' అంది.

"ఏడీ... ఎవడా ఫ్రెండ్? నాకు చెప్పమను. చూద్దాం... ఏం చేస్తున్నాడక్కడ? నేను ఫోన్‌లో మాట్లాడి కనుక్కుంటాను?" అన్నాడు వెంకయ్య.

రాగిణిని మోసం చేసినట్లు వెంకయ్యని మోసం చెయ్యలేనని తెలుసు కాబట్టి రాజు నోరు మూసుకుని కూర్చున్నాడు.

"రెండు హృదయాలని విడదీయాలని చూ డటం తప్పు'' అన్నాడు రాజు.

"అట్లాగా... పదహారేళ్ల పిల్లని పెళ్లి చేసుకో వాలని చూడటం నేరం. నీమీద కిడ్నాపింగ్ కేసు బనాయించి బొక్కలోకి తోయిస్తాను. పోన్లెమ్మని ఊరుకుంటే నాతోనే మాట్లాడ్తా వా?" అన్నాడు వెంకయ్య.

"మేమిద్దరం రెండేళ్లు వేచివుంటాం. మాకు పెళ్లి వయసు వచ్చాకే చేసుకుంటాం" అన్నా డు రాజు.

"అలాగేం? ఎందుకూ వేచి వుండటం? ఇప్పుడే చేసుకో. ఒరే, వీడికి పెళ్లి కావాలిట. కాస్త చెయ్యండ్రా'' అని అనుచరులకి కనుసైగ చేశాడు వెంకయ్య.

వాళ్లు రాజుమీద విరుచుకుపడ్డారు. రాజు ఫ్రెండ్ కాసేపు వాళ్లని ఎదుర్కోవడంలో సాయంచేసి, ఆ తర్వాత ఇక లాభంలేదని కాబోలు పలాయనం చిత్తగించాడు.

 

రాజుని ఏకాకిని చేసి, వాళ్లు సున్నంలోకి ఎముకలు లేకుండా చితక్కొట్టి వెళ్లారు.

★ ★ ★

రాజు ఆలోచిస్తున్నాడు.

రాగిణికి వెంకయ్య అంతా మోసం అని చెప్పి బాగా హెచ్చరించినట్లున్నాడు.

ఒక వారం రోజులు రాగిణి కాలేజీకి రాలేదు.

ఆ తర్వాత యిద్దరు పాలేర్లని వెంటబెట్టుకుని వచ్చింది.

ఈలోపల వెంకయ్య శాంతమ్మనీ, చంద్రయ్యనీ కలుసుకుని రాజు గురించి హెచ్చరించి యికమీదట ఏమన్నా పిచ్చివేషాలు వేస్తే చావగొట్టటం కాక ఏకంగా చంపిపారేస్తానని చెప్పాడు. వాళ్లు రాజుని రాగిణిజోలికి పోవద్దని బతిమాలారు.

కొద్దిరోజుల తర్వాత రాగిణి కాలేజీకి ఒక్కతే ధైర్యంగా రాసాగింది.

రాజు ఆమె వెంటబడి అడిగాడు

రాగిణి అతని మొహం కూడా చూడలేదు.

"నువ్వంటే నాకసహ్యం అన్నీ అబద్ధాలు చెప్పావు. మా డబ్బు చూసి వెంటబడ్డావు'' అంది కోపంగా.

"కాదు రాగిణీ! నేను నిజంగా దుబాయ్‌కి వెళ్తున్నాను... ప్లీజ్... నన్ను నమ్ము'' అన్నాడు రాజు.

"అట్లాగయితే వెళ్లి వచ్చాక కనబడు చూద్దాం" అంది రాగిణి నిర్లక్ష్యంగా.

"అంతవరకూ ఎవరినీ చేసుకోనని మాట ఇవ్వు'' అన్నాడు రాజు.

"షటప్... నా పెళ్లి గురించి నీకెందుకు? ఈసారి నాతో మాట్లాడాలని చూస్తే ఫలితం తీవ్రంగా ఉంటుంది'' అంది రాగిణి.

వెంకయ్య ఆమెకి మంచి ట్రైనింగ్ యిచ్చి పంపాడని రాజుకు అర్థమైంది.

ఇక రాగిణి తనని నమ్మదు. తన ప్రయత్నాలు వృధా... వెనుతిరిగాడు.

★ ★ ★

రాగిణి జారిపోయినందుకు రాజు విచారించలేదు. అతనిది అట్లాంటి తత్వం కాదు.

దేవదాసు సినిమా చూశాడొకసారి.

'దేవదాసుకి పిచ్చా? పార్వతి కాకపోతే లోకంలో మరో ఆడదే లేదా? ఎందుకలా సీసాలు తాగుతూ కూర్చోవాలి? తాగితే ఎట్లా ఉంటుందోనని తాగటం నేరుగాని, ఇదేంపని?' అనుకున్నాడు.

'ఎవరినన్నా చూసుకోవాలి మళ్లీ... ప్రయత్నం మానకూడదు. ఈసారి పట్నంపిల్లల్ని చూడాలి' అనుకున్నాడు.

ఎందుకంటే ఆ ఊళ్లో రాగిణి తప్ప మరో డబ్బున్న అమ్మాయి లేదు. ఎవరో ఒకళ్లని చేసుకునే ఉద్దేశంలో లేడు తను. పైగా కొందరమ్మాయిలు అతని గురించీ, రాగిణి విషయమూ తెలిసిపోయాక భయంభయంగా చూస్తూ, తమని పలకరిస్తాడేమోనని బెదురుగా చూడటం మొదలుపెట్టారు. తప్పుకునీ తిరుగుతున్నారు.

అది గమనించి రాజు నవ్వుకున్నాడు.

ఇట్లాంటి అల్లాటప్పా పిల్లల్ని తను కేర్ చెయ్యనని వాళ్లకు తెలీదు పాపం అనుకున్నాడు.

రాగిణి తర్వాత ఎవరు...?

ఆలోచిస్తున్నాడు. ఈ ఊళ్లో లాభంలేదు. పై ఊళ్లో కూడా లాభంలేదు. వెంకయ్య చేసిన గొడవ వాళ్లంతా చూసేశారు.

ఇక మిగిలింది పట్నమే...

ఈసారి తెలిసినవాళ్లతో పెట్టుకోకూడదు. వాళ్లు తన చదువూ, సామర్థ్యం అన్నీ తెలిసి వుండడంవల్ల తొందరగా బుట్టలో పడరు. పడ్డా వల్లోంచి సులువుగా జారిపోతారు.

బొత్తిగా తెలీని మొహాన్ని వెతకాలి! అతను తల్లి శాంతమ్మని డబ్బు అడిగాడు.

"ఎందుకూ?" అంది ఆవిడ.

"హైదరాబాద్ వెళ్లి ఏదన్నా ఉద్యోగంకోసం

**సచిత్ర విచిత్రం**

# పెంపుడు సాలీడు




లియోన్‌యాష్ అనే ఈ పెద్దమనిషి అందమైన చిలుకలు, పావురాలు, రకరకాల పిట్టల్నేకాక పిల్లిపిల్లలు, కుక్కపిల్లలు వగైరా ఎన్నోరకాల జంతువుల్నీ పెంచి అమ్ముతుంటాడు. మూడు పిట్టలు, ఆరు పిల్లుల్లా దినదిన ప్రవర్ధమానమవుతున్న తన వ్యాపారానికి తానే మురిసిపోయి, ఈమధ్య కొత్తగా ఆఫ్రికన్ "బాబూన్ స్పైడర్స్"ని కూడా తెచ్చి అమ్మడం ప్రారంభించాడు. వచ్చినవాళ్లందరికీ ఆప్యాయంగా తన ఒంటిమీద పాకే అతిపెద్ద సాలీడును చూపించి, యజమానియందు ఈ సాలీళ్లు ఎంత విశ్వాసంగా వుంటాయో వివరిస్తుంటాడు. జనం కూడా... మందల్లా వచ్చి... క్యూలో నిలబడి మరీ కొంటున్నారు ఈ ప్రాణుల్ని. ఈ సాలీడు ప్రమాదకర ప్రాణి కాకపోయినా దాని అందంగాని, ఉపయోగంగాని ఏమిటో కొనేవాళ్లకే తెలియాలి.




ప్రయత్నిస్తాను'' అన్నాడు.

"పదోక్లాసు కూడా కాకుండా ఉద్యోగం ఎట్లా వస్తుంది?" అన్నదావిడ.

"ఎందుకు రాదు? గవర్నమెంట్ ఉద్యోగాల కి చదువు చూస్తారు. ప్రైవేట్లో చూడరు'' అన్నాడు రాజు.

శాంతమ్మకి ఈ వివరాలు, ఉద్యోగావకాశా లూ వీటి గురించి ఏం తెలీదు. నిజం కాబోలనుకుంది.

"ఏంటీ?" అడిగాడు చంద్రయ్య.

"ఏంలేదు మామయ్యా! నేను పట్నం వెళ్తు న్నాను. నువ్వూ నాతో రారాదూ'' అన్నాడు రాజు.

"వచ్చి...?"

"నాతోపాటే ఉండు. ఇద్దరం ఎక్కడైనా ఒక గది తీసుకుని ఉందాం. ఏదన్నా ఉద్యోగం చూసుకుంటాను. నీక్కూడా ఏదో దొరక్కపో దు'' అన్నాడు రాజు.

చంద్రయ్యకి హైదరాబాద్‌లో మకాం పెట్ట టమంటే అద్భుతంగా తోచింది.

"ఎప్పుడు వెళ్లేది'' ఆత్రంగా అడిగాడు.

"అమ్మ ఎప్పుడు డబ్బులు ఇస్తే అప్పుడు'' అన్నాడు రాజు.

"నువ్వు కుదురుగా ఉంటావని నమ్మకం కలిగితే తప్ప ఇవ్వను'' అంది శాంతమ్మ.

"ఎందుకు ఉండనూ? ఏదో కుర్రతనం కాబట్టి ప్రేమా గీమా అని పరిగెత్తాను. వెంక య్య మామ తిట్టాక నాకు నా స్థితి ఏంటో తెలిసింది. ఎట్లాగైనా ఉద్యోగం సంపాదించి నా సంపాదనతోటే నేను చదువుకుంటాను'' అన్నాడు రాజు.

శాంతమ్మ నవ్వి ఊరుకుంది.

ఒక నెలరోజులు తల్లికి పూర్తి నమ్మకం

కలిగేదాకా బుద్ధిగా ఉన్నాడు రాజు.

ఈ నెలరోజులూ బోలెడు పుస్తకాలు చదివి పారేశాడు. ఏ దేశం ఎక్కడుందో, అక్కడి అలవాట్లూ, వాతావరణం మొదలైనవాటి గురించి మరింత జ్ఞానం సంపాదించాడు.

ఇంగ్లీషు స్టైలుగా మాట్లాడటం, స్టైలుగా నడవటం ప్రాక్టీసుచేశాడు. ఇవన్నీ శాంతమ్మ లేనప్పుడు చేసి పుస్తకాలు మాత్రం ఆవిడ ముందు చదివాడు. తను ఉద్యోగంకోసం అవన్నీ చదివానని ఆవిడకి చెప్పాడు.

నెలరోజులు గడిచేసరికి శాంతమ్మకి రాజు కుదురుగా కూర్చుంటాడని నమ్మకం కలిగింది.

"ఎంత కావాలిరా?" యధాలాపంగా అడిగింది.

"అయిదువేలు''

శాంతమ్మ ఉలిక్కిపడింది.

"అంత డబ్బు నాదగ్గర లేదు'' అంది.

"వస్తుంది. ఇల్లు తాకట్టుపెట్టు'' అన్నాడు రాజు.

"బాగుంది... తల ఎక్కడ దాచుకోమంటావ్''

"ఏముందీ... అప్పు తీర్చిపారేస్తాం. ఇల్లు అమ్ముకుని పోవటంలేదుగా''

"నాకిష్టంలేదు'' అంది శాంతమ్మ.

"నీకు కొడుకు భవిష్యత్తుకన్నా ఇల్లే ఎక్కువా?" అరిచాడు రాజు.

శాంతమ్మ మాట్లాడకుండా వంటింట్లోకి వెళ్లి పని చేసుకోసాగింది.

"మామయ్యా! నువ్వు అమ్మకి నచ్చచెప్పు. నా ప్లాన్ సక్సెస్ అవుతుంది తప్పకుండా. అప్పు తీర్చలేకపోం. ఏదో ఒకటి చెప్పి అమ్మని ఒప్పించు'' అన్నాడు రాజు.

రాగిణిని పెళ్లిపీటలదాకా తీసుకువచ్చాడని తెలిశాక చంద్రయ్యకు రాజు సమర్థతమీద నమ్మకం కుదిరింది.

వెంకయ్య సామాన్యుడు కాదు. అట్లాంటివాడి కూతుర్ని బుట్టలో వేశాడంటే రాజ అఖండుడే. ఖర్మకాలి అంతా ఆఖర్లో రసాభాస అయిందికానీ లేకపోతే ఈపాటికి రాజు దర్జాగా కాలుమీద కాలు వేసుకుని వెంకయ్యమీదా అతని ఆస్తిమీదా అధికారం చెలాయించేవాడు కాదూ... అనుకున్నాడు చంద్రయ్య.

అంతకన్నా అతను ఆలోచించలేదు.

"అక్కా! వాడు ఇన్నాళ్లకి మారి బాగుపడదాం అనుకుంటున్నాడు. వాడికి ఒక్క అవకాశం ఇవ్వు. చూద్దాం... వాడెంత గొప్పవాడవుతాడో'' అని శాంతమ్మకి చెప్పి, చెప్పి చివరికో నెల తర్వాత ఒప్పించాడు.

ఇల్లు తనఖాపెట్టి అయిదువేలూ తెచ్చింది ఆమె.

అవి తీసుకుని 'చల్ మోహనరంగా' అంటూ బయల్దేరారిద్దరూ!

చంద్రయ్య కూడా ఉన్నాడుకదా అని కాస్త ఊరటగానే ఉంది శాంతమ్మకి.

వెళ్లి ఓ దూరపుచుట్టం ఇంట్లో దిగారు.

వీళ్ల రాకకి అతను బెదిరి, సంగతి తెలుసుకుని మొహం మాడ్చుకుని, రెండ్రోజులు భరించి, మూడోరోజు దూరంగా గది అద్దెకి ఇప్పించి చేతులు దులుపుకున్నాడు.

ఇద్దరూ ఊరినుంచి పచ్చళ్లూ, నెయ్యీ, కారంలాంటివన్నీ తెచ్చుకున్నారు. వండుకుని తినటం మొదలుపెట్టారు.

చంద్రయ్యకి ఒకచోట ఉద్యోగం ఇప్పించాడు ఆ బంధువు. బట్టల షాపులో పొద్దున్నుంచి మధ్యాహ్నందాకా కూర్చుని బట్టలు అమ్మాలి. మధ్యాహ్నానికి ఓనరు వస్తాడు. నమ్మకస్థుడెవరైనా ఉంటే చూడమని ఎప్పట్నుంచో అడుగుతున్నాడు ఆ షాపు మిత్రుడు. చంద్రయ్యకి దొంగబుద్ధి లేదని ఆ బంధువుకి తెలుసు కాబట్టి అతన్ని రికమెండ్ చేశాడు. తను చాలా కష్టపడి ఈ ఉద్యోగం సంపాదించినట్లు పోజు పెట్టాడు చంద్రయ్యదగ్గర.

అది మారుమూల ఉన్న కాలనీ. యింటద్దె




నూటయాభై. చంద్రయ్యకి యజమాని రెండు వందలు యిస్తానన్నాడు. అద్దె పోను కొంత డబ్బు మిగుల్తుంది కదాని రాజు చేరమన్నాడు.

"ఉద్యోగం చేసే పనయితే యిక్కడికి ఎందుకూ రావటం... నేను చెయ్యను'' అని చంద్రయ్య గునిశాడు.

"పార్ట్‌టైమ్ జాబేగా. చెయ్యి. కష్టపడాల్సిన పని కూడాలేదు. ఆడుతూ పాడుతూ చేసెయ్యొచ్చు'' అన్నాడు రాజు.

చంద్రయ్య అయిష్టంగా చూస్తున్నాడు.

"ఊరికే ఉండేట్లయితే వద్దు. వెళ్లిపో'' అన్నాడు రాజు.

చంద్రయ్యకి హైదరాబాద్ విడిచి వెళ్లటం ఇష్టంలేదు. కొన్నాళ్లయినా ఉండి అన్నీ చూసి వెళ్దామనిఉంది.

"సరే చేస్తాలే'' అని ఒప్పుకున్నాడు.

తీరా చేరాక అతనికి ఆ ఉద్యోగం సరదాగానే అన్పించింది. ఎక్కువమంది కష్టమర్లు లేరు. ఆడవాళ్లతో మాట్లాడుతూ చీరెలు తీసి చూపిస్తూ కాలక్షేపం బాగానే జరుగుతోంది.

రాజు తన పేరు రాజేష్‌గా మార్చేసుకున్నాడు. చంద్రయ్యని కూడా అట్లాగే కొత్తపేరుతోనే పిలవమని హెచ్చరించాడు.

'రాజేష్, రాజేష్' అని అందరూ పిలుస్తుంటే అతనికి గొప్పగావుంది.

పని ఉన్నా లేకపోయినా రోజూ సెంటర్లు తిరిగి వస్తున్నాడు.

అమ్మాయిల కాలేజీలు ఉన్నచోట తారట్లాడుతున్నాడు.

★ ★ ★

చంద్రయ్య అన్నం వండాడు.

"రాజేష్... అన్నం పెట్టనా?" అన్నాడు.

"పెట్టు..." అనేసి దర్జాగా కూర్చున్నాడు రాజు.

చంద్రయ్యే అన్నం, పచ్చడి వడ్డించి, మజ్జిగగిన్నె పక్కన పెడితే రాజు తీరిగ్గా తిన్నాడు.

చంద్రయ్య తను కూడా తిని, యింటికి తాళంపెట్టి షాపుకి వెళ్లాడు.

రాజేష్ పక్క కాలనీకి గబగబా నడిచివెళ్లాడు. అక్కడ ఇళ్లన్నీ అందంగా ఉంటాయి. చాలామందికి కార్లు కూడా ఉన్నాయి.

రాజేష్ ఒక రోడ్డు చివరికి చేరి చాక్లెట్‌కలర్ కారుకోసం ఎదురుచూస్తున్నాడు.

అందులో రోజూ ఒకమ్మాయి వస్తుంది. ఆమెకి దాదాపు పంధొమ్మిదేళ్లు ఉంటాయి. అందంగా ఉంటుంది. ఆమె కారు డ్రైవింగ్ నేర్చుకుంటోందని రాజేష్ గమనించాడు. మూడురోజుల్నుంచీ ఆమెపక్కన ఎవరో కూర్చుని కారు నడపటం నేర్పిస్తున్నారు. రోజూ ఇదే టైమ్‌కి ఇటు వస్తుంది. నిన్న ఆ అమ్మాయి బాగా నడిపేయటం చూశాడు. బహుశా ఇవాళ ఎవరూ రాకుండా ఒక్కతే నడుపుకుంటూ వస్తుందేమో అనిపించింది అతనికి.

ఆ కాలనీలో రోడ్లు పెద్ద రద్దీగా ఉండవు. అసలు ఈ టైమ్‌లో ఏ వాహనాలూ తిరగవు. కాబట్టి ఆ అమ్మాయి భయంలేకుండా రావచ్చు.

రాజేష్ కళ్లు ఆ అమ్మాయి ఉండే కారు రావటం దూరంనుంచే కనిపెట్టేశాయి. కారు అల్లంతదూరంలో ఉండగానే గబగబా దానికి ఎదురు నడిచి అటూ ఇటూ అడ్డంగా గాభరాపడిపోయినట్లు నడవటం మొదలుపెట్టాడు.

అసలే కొత్త గనుక ఆ అమ్మాయి సందేహంగా స్టీరింగ్ అటూ ఇటూ తిప్పేయటంతో కారు ఇష్టం వచ్చినట్లు పోవటం మొదలుపెట్టింది. ఆమె బ్రేక్ నొక్కబట్టి సరిపోయింది గానీ లేకుంటే యాక్సిడెంట్ అయ్యేదే.

రాజేష్ ఆ రిస్క్ తీసుకునే ఈపని చేశాడు.

కారు రాసుకుంటూ వచ్చి ఆగగానే ఆ అమ్మాయి గాభరాగా దిగి "దెబ్బలేమైనా తగిలాయాండీ'' అన్నది.

"లేదండీ... పూలు తగిలాయి'' అన్నాడు.

"సారీ అండీ... మీరు అటూ ఇటూ నడవ

టంతో నేను కన్‌ఫ్యూజ్ అయిపోయాను. దెబ్బ లేమైనా తగిలితే చూడండి... డాక్టరు దగ్గరికి వెళ్దాం" అన్నది.

రాజేష్ చూసుకుని "ఏం లేవండీ'' అన్నాడు.

"థాంక్ గాడ్... వెళ్తానండీ'' అందామె.

"సరేనండీ... మళ్లీ మీరు ఏ టైమ్‌లో వస్తారో చెప్పండి'' అన్నాడు రాజేష్.

"ఎందుకూ?"

"ఆ టైమ్‌లో ఈ చుట్టుపట్ల ఉండకుండా జాగ్రత్తపడతాను'' అన్నాడు రాజేష్ నవ్వుతూ.

ఆ అమ్మాయి కూడా నవ్వేసి వెళ్లిపోయింది.

మర్నాడూ, ఆ మర్నాడూ కూడా ఆమె వస్తుందేమోనని ఎదురుచూశాడు. రాలేదు.

ఓ అయిదురోజులు గడిచాక మళ్లీ కనిపించింది. అయితే ఒంటరిగా కాదు, జంటగా. వాడెవడోగానీ, వాడితో చెట్టాపట్టాలేసుకుని కారెక్కుతుంటే అతనికి ఒళ్లు మండిపోయింది.

ఆ అమ్మాయి రాజేష్‌ని గమనించనేలేదు. తన ఆనందంలో తనుంది.

ఆ పక్కనున్నది ఎవడో. తను మాట్లాడి చూస్తే ఏం పోయింది. సరే, ఈసారి ఎక్కడన్నా కనిపిస్తే పలకరించాలి అనుకున్నాడు.

మరో రెండు రోజుల తర్వాత ఆ అమ్మాయి మళ్లీ కనిపించింది. రాజేష్ పలకరిస్తే మాట్లాడలేదు, సరిగదా 'ఎవరు నువ్వు?' అన్నట్లు చూసింది.

ఈ అమ్మాయి లాభం లేదు అనుకున్నాడు. అలాంటి ప్రయత్నాల్లో రెండేళ్లు ఇట్టే గడిచిపోయాయి.

రాజేష్‌కి కొందరు పరిచయమై మిత్రులయ్యారు. వాళ్లు కూడా పదో క్లాసుతోనో, ఇంటర్‌తోనో కుస్తీలు పడుతున్నవాళ్లే. ఒక్కొక్కళ్లకీ వయసు ఇరవై నాలుగేళ్లకు అటూ ఇటూ ఉంటుంది. ఉద్యోగం లాంటివేవీ లేవు ఒక్కళ్లకి కూడా. కానీ వాళ్లు డబ్బు శుభ్రంగా ఖర్చు చేస్తుంటారు. అట్లాగని డబ్బున్నవాళ్లు కూడా కాదు. మరి వాళ్లకంత డబ్బు ఎక్కణ్ణుంచి వస్తున్నదో? రాజేష్‌కి అదీ అర్థమైంది కొద్ది రోజుల్లోనే.

వాళ్లు జేబులు కొట్టేసో, ఎవరి యింట్లోనన్నా దూరి చేతికందిన వస్తువు పట్టుకొచ్చేసి చవగ్గా అమ్మేయటమో చేస్తున్నారు. ఆ డబ్బు వెంటనే ఖర్చు పెట్టేస్తారు. వస్తువుల్లాంటివి కొనటానికి వాళ్లకొక మార్వాడీ ఉన్నాడు. అతని కిచ్చేసి డబ్బు తెచ్చుకుంటారు. వాళ్లు మంచి ఒడ్డూ పొడుగూతో బలంగా ఉంటారు. వాళ్లల్లో రాజేష్‌ని ఆకర్షించిన గుణం వాళ్ల ధైర్యం. ఎట్లాంటివాళ్లతో అయినా మాటలతోగానీ, చేతలతోగానీ ఎంతైనా పోట్లాడగలరు. వాళ్ల ముందు ఎవ్వరూ నిలవలేరనిపించింది రాజేష్‌కి. రాజేష్‌కి పోట్లాటలకు ధైర్యం లేదు. అందువల్ల యిట్లాంటి మిత్రులుంటే ఎందుకైనా పనికొస్తారనుకున్నాడు. ఆ ఉద్దేశ్యంతోనే వాళ్లతో కలసి తిరుగుతున్నాడు. వాళ్లు రాజేష్‌ని కూడా దొంగతనాలకు ప్రోత్సహించారు గానీ, రాజేష్ ఒప్పుకోలేదు. తనకంత ధైర్యం లేదని స్పష్టంగా చెప్పాడు. వాళ్లకి కూడా అతనందుకు పనికిరాడనే అనిపించింది.

వాళ్లలో ఒకతనికి కార్లు బాగు చేసే మెకానిక్ తెలుసు. ఒక షెడ్డులో కొందరు పనివాళ్లని పెట్టుకున్నాడతను! రాజేష్‌ని అక్కడ పనికి కుదరమని వాళ్లు సలహా యిచ్చారు.

నూనె కారుతూ, రాత్రింబవళ్లు చచ్చేట్లు పనిచెయ్యాలంటే రాజేష్ మనసు ఒప్పుకోలేదు. కానీ దూరం ఆలోచించాడు.

చేతిలో డబ్బు అయిపోతోంది. చంద్రయ్య మామ జీతం యింటద్దెకి సరిపోతుంది. తల్లిని అడిగి లాభం లేదు. ఇక ఈ ఊళ్లో ఉండాలంటే ఏదో ఒక పని చెయ్యక తప్పదు. పైగా మిత్రులు రాజేష్‌ని ప్రోత్సహించి తమ సాయం ఉంటుందని తెలియజేశారు కూడా.

"కార్ల రిపేరీ అంటే తక్కువ అనుకోకు. అక్కడికి కార్లు బాగు చేయించుకునేందుకు




ఎంతోమంది అందమైన అమ్మాయిలు వస్తుంటారు. వాళ్లని పరిచయం చేసుకోవచ్చు. నీకు ఉపయోగంగానే ఉంటుంది తప్ప ఏం తక్కువగా ఉండదు'' అన్నారు.

నిజానికి వాళ్లు కూడా రాజేష్‌కున్న లాంటి కోరికలతోనే ఉన్నారు. ఎవరో బాగా డబ్బున్న అమ్మాయి వచ్చి తమని ప్రేమించి పెళ్లి చేసుకోవాలనే కలలుకంటుంటారు. రాజేష్ ఆ షెడ్‌లో చేరితే, అతన్ని కలుసుకునే వంకతో తాము వెళ్లి ఎవరన్నా అమ్మాయిలు వస్తే పరిచయాలు పెంచుకోవాలని వారి కోరిక. చివరికి రాజేష్ ఆ షెడ్‌లో పనికి చేరాడు.

కార్ల రిపేర్ అతనికి ఆసక్తిగానే అనిపించింది. కారు నడపటం కూడా వచ్చింది.

అతను అమ్మాయిలెవరైనా వస్తే బాగుండునని ఎదురు చూస్తున్న సమయంలోనే ఓ అమ్మాయి వచ్చింది. నవ్వుతూ ఆమెకి ఏం కావాలో అడిగాడు.

కానీ ఆమె నవ్వలేదు. సరిగదా మూతి బిగించి కారు చెడిపోయిందనీ, ఎవరినన్నా పంపించి యిక్కడకు తీసుకు వచ్చే ఏర్పాటు చేసి బాగుచేయించి పెట్టమనీ చెప్పింది.

మాట్లాడదామని ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది.

ఆ అమ్మాయే కాదు. ఆ తర్వాత వచ్చిన మరో నలుగురు అమ్మాయిలు కూడా అదే తీరులో ఉన్నారు.

మరో నెల రోజులకి హాసిని అనే ఓ అమ్మాయి తన కారుకి చిన్న ప్రాబ్లంతో వచ్చింది! కానీ రాజేష్ దాన్ని పరీక్షించి, అది పోయింది, యిది పోయింది అని చెప్పి, మర్నాడు వస్తే పెద్ద మెకానిక్ ఉంటాడనీ, అతను ఎంత అయేదీ చెప్తాడనీ అన్నాడు.

ఆమె కొద్దిగా నవ్వుతూనే మాట్లాడింది పేరుకి తగ్గట్టుగా. ఆమె బి.ఏ. చదువుతోందని తెలుసుకున్నాడు. వాళ్ల నాన్నకి ఏదో ఫాక్టరీ ఉందిట. డ్రైవరు వద్దని కారు తనే నడుపు కుంటూ ఉంటుందిట.

అతను మాట్లాడుతూ ఉండగానే పెద్ద మెకానిక్ వచ్చేశాడు.

రాగానే హాసినిని ఆప్యాయంగా పలకరించి, కారు తీసి చూశాడు. ఏవో వైర్లు తిప్పి అటుచేసి యిటుచేసి, చివరికి అయిదు నిమిషాల్లో బాగు చేశాడు.

"అరే... యిందాక అతను పెద్ద రిపేర్ ఉందన్నాడు. భలే చేసేశారే'' అని ఆశ్చర్యపోయింది హాసిని.

పెద్ద మెకానిక్ రాజేష్ వంక గుడ్లురుముతూ సరిగ్గా చూసి చేయాలని తిట్టటం మొదలు పెట్టాడు.

అది చూసి హాసిని నవ్వుతుంటే రాజేష్‌కి ఎక్కడలేని బాధ కలిగింది.

హాసిని నవ్వుతూనే వెళ్లిపోయింది.

ఆ అమ్మాయి కాలేజీ ఎక్కడో కనుక్కోవటం కష్టం కాలేదు రాజేష్‌కి. మిత్రబృందం ఆ అమ్మాయి వివరాలన్నీ కనుక్కొని యిచ్చారు.

కాలేజీముందు రెండు రోజులు పని మానుకుని నిలబడ్డాక హాసిని దర్శనం అయింది. ఒక్కత్తే కారు డ్రైవ్ చేసుకుంటూ వస్తోంది.

కారుకి అడ్డంగా నిలబడ్డాడు.

హాసిని ఆశ్చర్యపోలేదు. యిట్లాంటిది ఊహించినట్లు నవ్వుతూ కారు దిగింది.

"ఏంటి... ఆత్మహత్య చేసుకోవాలనా'' అంది నవ్వుతూ.

"కాదు... నిజంగా నాకు ఆ రిపేర్ చిన్నదే అని తెలుసు.. కానీ కావాలని అట్లా చెప్పాను..." చిన్నగా అన్నాడు.

"ఎందుకట్లా చెప్పావు. ఎక్కువ డబ్బు తీసుకోవాలనా''

"ఛీ నాకు డబ్బు ఆశ లేదండీ... కానీ మిమ్మల్ని చూడగానే నాకు ఒక దేవతని చూసినట్లు అనిపించింది. అందుకే.. మళ్లీ మిమ్మల్ని చూడాలని... మర్నాడు వస్తారు కదాని... అట్లా చెప్పాను'' అన్నాడు.

"ఎందుకూ... నన్ను చూస్తే ఏం... చూడక పోతే ఏం?"

"ఏమో నాకు తెలీదు... మరి ఎందుకో అట్లా అనిపించింది''

హాసిని నవ్వేసి "సరే వెళ్లనా'' అంది.

"వెళ్లండి... కానీ మిమ్మల్ని రోజూ చూసే భాగ్యం నాకు కలిగించకూడదూ..." అన్నాడు.

"ఎట్లా..."

"ఏముంది... మనం రోజు కలుసుకుంటూ ఉంటే... ఎక్కడో చెప్పండి... ప్లీజ్'' అన్నాడు.

"రేపు... యిక్కడ కాదు. పక్క వీధిలో... అక్కడైతే జనం తక్కువ ఉంటారు. ఎవరూ చూడరు. సరేనా'' నవ్వింది హాసిని.

"సరే...." సంతోషంగా అన్నాడు. యిదంతా నిజంగా జరుగుతోందా లేక కలా అని కూడా అతనికి అనుమానం వచ్చింది.

మర్నాడు హాసిని చెప్పిన చోట నిలబడ్డాడు. హాసిని కారు కనిపించింది.

దగ్గరకు వచ్చి ఆగింది.

అందులోంచి హాసిని బదులు నలుగురు దృఢకాయులు దిగారు.

వాళ్లు మరో మాట మాట్లాడేందుకు అవకాశం యివ్వకుండా చితుగా తన్నటం మొదలుపెట్టారు.

ఒకడు పారిపోకుండా గట్టిగా పట్టుకున్నాక మిగతా వాళ్లు పది నిమిషాలపాటు రాజేష్‌ను ఫుట్‌బాల్ ఆడుకున్నారు. తృప్తి తీరా తన్నాక కారెక్కి వెళ్లిపోయారు.

కొందరు ఈ దృశ్యాన్ని చూసినా, చూడనట్లే వెళ్లిపోయారు. మరి కొంతమంది దూరంనుంచి చూడగానే వెనుతిరిగి వెళ్లారు. ఎవ్వరూ వాళ్లని యిదేమిటని కూడా అడగనూలేదు, పట్టించుకోనూ లేదు.

రాజేష్ చివరికి ఎలాగోలా తనంతట తనే లేచి యింటికి వెళ్లాల్సి వచ్చింది.

ఆ తర్వాత హాసిని కార్లో వెళ్తూ రెండుమూడు సార్లు కనబడినా మాట్లాడే సాహసం చెయ్యలేకపోయాడు.

ఒకరోజు మాత్రం హాసిని తనంతతానే కారాపింది.

"దెబ్బలు మానాయా..." అంది.

రాజేష్‌కి కోపం వచ్చి సమాధానం చెప్పలేదు.

"బుద్ధి వచ్చిందనుకుంటాను'' అంది.

"ఎందుకలా కొట్టించావ్. నీకిష్టం లేకపోతే ఆ మాట చెప్తే పోయేది కదా'' అన్నాడు కోపంగా.

"పోయేది కాదు. అప్పుడు నువ్వు నీ ఫ్రెండ్స్‌తో కలిసి నన్ను ఏడిపించాలని ప్రయత్నించే వాడివి. నీలాంటి వెధవలకి యిట్లాంటి శిక్షే వెయ్యాలని నేను నిర్ణయించుకున్నాను. యిప్పుడు నువ్వు నన్ను చూస్తే భయపడతావు. నీ ఫ్రెండ్స్ సంగతి కూడా నాకు తెలుసు. వాళ్లు కూడా నీకు యిప్పుడు సాయం చెయ్యరు. ఎందుకంటే నేను పంపినవాళ్లు తనకన్నా బలవంతులని వాళ్లకి బాగా తెలుసు. మంచిగా మాట్లాడితే నీకర్థం అయేది కాదు. అందుకే అలా అర్థమయేట్లు చేశాను'' అంది హాసిని.

యిట్లాంటి డేంజరస్ లేడీతో ఏం మాట్లాడినా కష్టమే అనిపించింది రాజేష్‌కి.

మాట్లాడకుండా వెనుతిరిగాడు.

వెనుకనుంచి హాసిని నవ్వు వినిపిస్తోంది.



రాజేష్ చివరికి ఓరోజు మాటల సంద

ర్భంలో హాసిని చేసింది చెప్పాడు ఫ్రెండ్స్‌కి.

వాళ్లు కోపగించుకున్నారు... "మాకెందుకు చెప్పలేదు... అంత గర్వంగా ప్రవర్తిస్తే నువ్వు సహించటం ఏమిటి... ఆ హాసిని అంతు చూడాల్సిందే'' అన్నారు.

"ఏం చేద్దాం"

"దాన్ని కిడ్నాప్ చేద్దాం" అన్నారు.

రాజేష్ ఉలిక్కి పడ్డాడు.

"వద్దు వద్దు''

"ఏం భయమా''

"అవును''

"భయపడ్డవాడు బతకలేడు. మరి ఆ హాసినిని నువ్వు ప్రేమించి చేసుకున్నా వాళ్ల నాన్న బతకనిస్తాడా. అందుకని ప్రేమించ కుండానే చేసుకుంటే సరి. నువ్వు కాకపోతే మేము కిడ్నాప్ చేసి మేమే ఎవరో ఒకళ్లం పెళ్లి చేసుకుంటాం దాన్ని'' అన్నాడు ఒకడు.

రాజేష్‌కి వాళ్లని చూస్తే భయం వేసింది. వీళ్లతో ఎందుకు స్నేహం చేశానా అని పించింది. దొంగలు దొంగల్లా కాక దొరల్లా మాట్లాడతారా. ఎవరితోనన్నా బాధ చెప్పు కుంటే వాళ్లకి తోచినట్లు సలహా యిస్తారు. వీళ్లు వీళ్లకి తగ్గట్లు యిచ్చారు. కానీ యిదెంత ప్రమాదంతో కూడుకున్నదో వాళ్లకి అర్థం కావ టంలేదు. ఒకవేళ ప్లాన్ సక్సెస్ అయితే... అప్పుడు కూడా ఫలితాలు ఎట్లా ఉంటాయో తెలీవు. బలవంతాన పెళ్లి చేసుకున్నా హాసిని మర్నాడే ఆ పెళ్లి చెల్లదని కోర్టులో కేస్ వేస్తుంది. తనకి శిక్ష కూడా పడొచ్చు. ఒకవేళ కిడ్నాపింగ్ వ్యవహారం మధ్యలోనే తాము పట్టుబడితే, అప్పుడు శుభ్రంగా జైల్లో పెట్టేస్తా రు. ఎందుకిదంతా...

అతను వద్దన్నా ఎవరూ వినిపించుకోలేదు. హాసిని కార్లో వస్తున్నప్పుడు ఆపి, బలవంతాన ఎక్కి తమకి కావల్సిన చోటుకి తీసుకెళ్లాలి అదీ ప్లాన్.

హాసినిని అడ్డుకుని, ఆమె కార్లోకి ఎక్కడాని కి వాళ్లు ప్రయత్నిస్తుండగానే ఎక్కడ్నుంచో పోలీస్ వ్యాన్ వచ్చి ఆగింది.

రాజేష్ ప్రైప్రాణాలు పైనే పోయాయి. పోలీస్ విజిల్స్ అతని గుండెల్లో రైళ్లు పరుగెత్తి స్తున్నాయి.

ఎక్కడ్నుంచి బలం వచ్చిందో తెలీదు. ఒక్క పరుగు తీసి పారిపోయాడు.

వాళ్లకి తెలీదు... హాసిని యిట్లాంటివి జరు గుతాయని ఊహించి ముందే పోలీస్ రిపోర్ట్ యిచ్చిందని...

పోలీసులు హాసిని రిపోర్ట్‌ని సీరియస్‌గానే తీసుకున్నట్లున్నారు.

అతని అదృష్టమో... లేక పోలీసులు అత న్ని గమనించలేదో కానీ నిమిషాలమీద ఒక్కో వీధి దాటి అందిన బస్సు ఎక్కి, అది మధ్యలో దిగి మళ్లీ యింకో బస్సు ఎక్కి చాలా దూరం వెళ్లిపోయాడు రాజేష్.

అతడి గుండె దడదడ కొట్టుకుంటోంది. ఈ గండం గడిస్తే చాలు మరి జన్మలో ఏ పిల్ల మొహమూ చూడను దేవుడా అని మొత్తుకు న్నాడు మనసులో.

యింటికి వెళ్లాలంటే భయం.

తమ ఊరికి వెళ్లిపోదామన్నా భయమే. తను ఎవరో తెలిసిపోయింది కాబట్టి పోలీసులు వెతుక్కుంటూ వచ్చేస్తారు.

భయం భయంగా ఉంది పరిస్థితి.

ఏమైతే అయిందిలెమ్మని సికింద్రాబాద్ స్టే షన్‌కి వెళ్లాడు. ప్లాట్‌ఫామ్ మీద రెడీగా ఉన్న రైలు ఎక్కి కూర్చున్నాడు. ఎక్కడ ఏ పోలీసు మొహం కనిపించినా వణికిపోతున్నాడు.

ఆ రైలు మద్రాసు వెళుతోంది.

మధ్యలో విజయవాడలో దిగిపోయాడు. ఒక హొటల్లో టీ తాగుతూ పేపర్లు చూశాడు. ఎక్కడా ఏ పేపర్లో కూడా హాసిని కిడ్నాప్ గురించి వార్త రాలేదు.

అంటే కేస్‌బుక్ చెయ్యలేదన్న మాట. భయపెట్టి, బెదిరించి పంపేసి ఉంటారు. అంతే.

పారిపోయిన రాజేష్ విజయవాడలో ఒక దూరపుచుట్టం ఇంట్లో నాలుగురోజులు కదలకుండా ఉన్నాడు.

ప్రతిరోజూ పేపర్‌లో అక్షరం విడవకుండా చదివేవాడు. తన విషయం బయట పడలేదని నిర్ధారణ అయ్యాక నెమ్మదిగా ఊళ్ళో తిరగటం మొదలుపెట్టాడు.

అతనికి అక్కడ ఆరోజు అసలేం జరిగిందో తెలుసుకోవాలనిపించి ఆ బంధువుని రెండు వందలు అప్పు అడిగాడు. అతను మొహం మాడ్చుకుని, బాధపడి చివరకు ఆ డబ్బు ఇస్తేగానే రాజేష్ వెళ్ళడని నిశ్చయించుకుని ఎట్లాగో చేతిలో పెట్టాడు.

ముందు రైల్వే స్టేషన్‌నుంచే చంద్రయ్య పని చేసే బట్టలషాపుకి ఫోన్‌చేసి చంద్రయ్యతో మాట్లాడాడు.

ఏమీ జరగలేదనీ, అంతా ప్రశాంతంగానే ఉందనీ తెలిశాక అప్పుడు ఇంటికి చేరాడు.

ఇకముందు ఎప్పుడూ ఇట్లాంటి వాళ్ళతో స్నేహం చెయ్యదల్చుకోలేదు. ఈ టెన్షన్, పోలీసులనుండి పారిపోవటం, బిక్కుబిక్కుమంటూ గడపటం తనవల్ల కాదు. అందుకే పాతమిత్రులు పలకరించినా, వాళ్ళకి తను గుడ్‌బై కొట్టేసినట్లు సూటిగానే చెప్పేశాడు.

★ ★ ★

అమ్మాయిలతో ఇన్ని ఎదురుదెబ్బలు తిన్నాక రాజేష్‌కి ఒక విషయం అర్థమైంది.

ఈ కాలం అమ్మాయిలు చాలా చురుగ్గా ఉంటున్నారు. నీళ్ళేవో, పాలేవో ఇట్టే కనిపెట్టేయగలరు. వాళ్ళని మాటల్తో మభ్యపెట్టి మాయచెయ్యటం కష్టం.

అతనికిప్పుడు రాగిణి ఆరోజు తననంత తొందరగా ఎట్లా నమ్మిందా అని ఆశ్చర్యంగా ఉంది.

నిజంగా అదంతా ఒక అద్భుతంలా జరిగింది. మరొక్క నిమిషంలో పెళ్ళయిపోయేదే గానీ తన పాలిట యముడిలా ఆ వెంకయ్య అంతా చెడగొట్టిపారేశాడు. ఎంత దురదృష్టం. మళ్ళీ అంతదాకా వచ్చిన అమ్మాయే లేదుకదా... తలుచుకుంటే అతనికి కడుపులో మండుతున్నట్లుంది.

వీళ్లు... ఈ పట్నంపిల్లలు మరీ హుషారు. ఒక్కొక్కళ్ళూ ఫెడేల్ని తన్నినట్లు సమాధానమిస్తుంటారు. సినిమాలూ, నవలలూ, టి.వి.లు ఇవన్నీ మనిషికి ఈ ధైర్యం, విజ్ఞానం ఇచ్చేస్తున్నాయో ఏమిటో లేకపోతే తనని ఎవరూ నమ్మకపోవటం ఏమిటి.

ఇంక తనకి అమ్మాయిలే దొరకరేమో అనిపించింది అతనికి.

★ ★ ★

విజయవాడనుంచి తిరిగివచ్చాక కొన్నాళ్లు బుద్ధిగా ఉండి మళ్ళీ మామూలుగా తిరగటం ప్రారంభించాడు రాజేష్.

ఇప్పుడతనికి కొందరు కొత్త స్నేహితులు ఏర్పడ్డారు. వాళ్లు మహేంద్ర, సుధీర్, రాకేష్. అందరూ గట్టిమనుషులే! పాతమిత్రుల్లా వాళ్లు దొంగలు కారు. కానీ ఘరానాగా దోపిడీ చేస్తారు. చందాల రూపంలో, సహాయం రూపంలో మనుషుల్ని బెదిరించో, బతిమాలో డబ్బు తీసుకుంటుంటారు. ఉన్నప్పుడు హాయిగా ఖర్చుపెడతారు. లేకుంటే దుప్పటి కప్పుకుని పడుకుంటారు.

వాళ్లు క్రమంగా రాజేష్‌కి సిగరెట్లూ, తాగుడూ నేర్పించారు. రాజేష్ ఆశయం ఎరిగి ఆ దిశగా ప్రోత్సహించారు

“పెళ్లి చేసుకుంటాం అనుకుంటున్నావు. దేనికైనా అనుభవం ఉంటే మంచిది'' అని రెచ్చగొట్టారు.

వాళ్లు తరచు వేశ్యల దగ్గరికి వెళుతుంటారు.

రాజేష్ కూడా వాళ్ళతో చేరి అప్పుడప్పుడూ వెళ్ళసాగాడు.

వాళ్ళ ప్రోత్సాహంతో మరికొన్ని ప్రయత్నాలు అమ్మాయిల్ని ఆకర్షించటానికి చేశాడు.

కానీ అన్నీ బెడిసికొట్టాయి.

నెమ్మదిమీద అతనికి ఒక పరమసత్యం బోధపడింది.

తను కావాలనుకుంటున్న లక్షణాలున్న ఏ ఆడపిల్లా తన వలలో పడదనీ, తనను పెళ్లి చేసుకోదనీ; రాజేష్ తనని పోషించే ధనికురాలైన భార్య ఇంక దొరకదేమోనని బెంగపడసాగాడు.

★ ★ ★

సుప్రియ తన సెక్షన్‌లో కూర్చుని పనిచేసుకుంటోందన్న మాటేగానీ మనసంతా ఎదురు సెక్షన్ మీదే ఉంది. చూపులు ఉండుండి అటువైపు చూస్తున్నాయి. వద్దన్నా అటువైపు నుంచి దృష్టి మరల్చుకోలేకుండా ఉంది.

ఎదురు సెక్షన్లో సుప్రియ స్నేహితురాలు మంజరి పనిచేస్తోంది. మంజరీ, సుప్రియా కలసి లంచ్ చేస్తారు. ఒక్కోసారి పర్మిషన్ తీసుకుని షాపింగ్‌కి వెళ్లివస్తుంటారు. సాయంత్రాలు కలసి ఇంటికి వెళ్తారు. కానీ ఇదంతా నెల్లక్రితంవరకూ జరిగిన సంగతి.

నెల్లక్రితం మంజరికి అదే ఆఫీసులో ఆఫీసరుగా పనిచేస్తున్న మధుతో స్నేహం ఏర్పడింది. మధు ధనికుడు, ఆఫీసరు, ఇంకా పెళ్లికాలేదు. మనిషి అందగాడు. పెళ్లికాని అమ్మాయిలు చాలామంది తమ భర్త ఎలా ఉండాలని కలలు కంటారో మధు అచ్చం అట్లాగే ఉంటాడు. అతని కళ్లు అల్లరిగా నవ్వుతుంటాయి. అతనికి కారూ, మోటార్‌సైకిలూ కూడా ఉన్నాయి. వేగంగా డ్రైవ్ చెయ్యటం అతని సరదా.

మధుకీ మంజరికీ ఎట్లా ఫ్రెండ్‌షిప్ ఏర్పడిందో సుప్రియకి తెలియలేదు. ఒక శుభోదయాన మధు నవ్వుతూ వచ్చి మంజరి దగ్గర కూర్చోవటం, ఆ తర్వాత ఇద్దరూ కలిసి ఎక్కడికో వెళ్ళటం సుప్రియ గమనించింది. అంతే... ఆ తర్వాత మంజరి సుప్రియతో లంచ్ చెయ్యటం మానేసింది. ఇంటికి కూడా ఒక్కత్తే వెళ్ళిపోతోంది. సాయంత్రాలు వాళ్ళిద్దరూ కలుసుకుంటున్నట్లు సుప్రియకి అర్థమైపోయింది.

సుప్రియకి వాళ్ళ విషయం అర్థం కాగానే ఉక్రోషం పొంగి రావటం మొదలుపెట్టింది.

నిజానికి సుప్రియ మంజరికన్నా బాగుంటుంది. తను అందంగా ఉన్నా తనను కాదని మధు మంజరితో మాట్లాడటం అవమానంగా ఉంది.

మంజరి సంగతి సుప్రియకి తెలుసు. మంజరి తండ్రి తాగుబోతు. ఆమెకి పెళ్లి చెయ్యాలన్న ఆలోచన అతనికి ఏమాత్రం లేదు. అన్నదమ్ములు ఎవరికి వారే. మంజరి తన భర్తని తాను వెతుక్కోవలసిందేగానీ వేరే విధంగా పెళ్ళయ్యే మార్గంలేదు. అందుకని మధుని పట్టుకుందన్నమాట.

సుప్రియ మనసులో ఉక్రోషంతో మంజరితో మాట్లాడటం పూర్తిగా తగ్గించింది. పుల్లవిరుపు మాటలు మొదలుపెట్టింది.

"మాది చాలా పరువుగల కుటుంబం. మొగవాళ్లతో తిరిగితే మా ఇంట్లో అయితే చెప్పు తీసుకుని తంతారు. అసలు కాల్చిచంపేస్తారు కూడా. నీకు సిగ్గూశరంలేవు. అతనితో బరితెగించి తిరుగుతున్నావు'' అని కోపంగా అంది.

మంజరి తెల్లబోయింది. ఇన్నాళ్లూ ప్రేమగా ఉన్న సుప్రియ ఎందుకిలా మాట్లాడ్తోందో ఆమెకర్థం కాలేదు.

"ప్రియా. నువ్వనేది నాకర్థంకావటంలేదు'' అంది.

"ఇంకేం అర్థం కావాలి. నిన్ను గురించి అంతా చెడుగా చెప్పుకుంటున్నారు. ఆఫీసంతా కోడై కూస్తోంది. నిన్ను పూర్తిగా చెడిపోయిన మనిషిగా అనుకుంటున్నారు. నా




స్నేహితురాలి గురించి ఎవరన్నా అనుకుంటే నాకెంత బాధగా ఉంటుందో చెప్పు. అందుకే ఇట్లా మాట్లాడాను'' అంది ప్రియ గొంతు అనునయంగా మార్చి.

"ప్రియా... మధు సంగతేనా''

"అవును''

"అతను నాతో స్నేహంగా ఉంటున్నమాట నిజమే. కానీ మేం హద్దుమీరలేదు ప్రియా. నన్ను నమ్ము'' అంది మంజరి బేలగా.

"అసలు అతనితో ఎందుకు స్నేహంగా ఉండాలి. స్నేహంగా ఉండబట్టేకదా నలుగురూ నాలుగు మాట్లాడుత్తున్నారు. ఏ బంధమూ లేనప్పుడు అతనితో మాట్లాడటం మానేస్తే మంచిది'' అంది ప్రియ.

"ప్రియా... అతన్ని నేను ప్రేమిస్తున్నమాట నిజమే. కానీ..."

"సరే మరి అతను నిన్ను ప్రేమిస్తున్నాడా?"

"తెలీదు... ఆడదాన్ని కాబట్టి నా ప్రేమను ముందు నేనే బయటపెట్టటానికి భయంగా ఉంది''

"భయం దేనికీ. ప్రేమించటం తప్పుకాదే''

"నిజమే... కానీ నాకూ అతనికీ ఆకాశానికీ నేలకూ ఉన్నంత భేదం ఉంది. అతనేమనుకుంటాడో... ఏదో స్నేహంగా మాట్లాడినంత మాత్రాన ప్రేమా గీమా అని వెంటపడితే నన్ను చులకనగా చూస్తాడేమో'' అంది మంజరి సందేహంగా.

ప్రియ తెలివిగా సంభాషణని తనకి కావలసిన మార్గంలోకి రప్పిస్తున్న సంగతి మంజరికి తెలీదు. అమాయకంగా ప్రియని నమ్మి, ఆమె తన శ్రేయోభిలాషి అనుకుని నిష్కల్మషంగా ప్రవర్తించింది మంజరి.

"మంజూ... నేను నీ స్నేహితురాలిని, నీ సుఖమే నా సుఖం. ఇట్లా ఎన్నాళ్లు గడిచినా నువ్వు అతన్ని అడగలేవు. నిజానికి మొగవాళ్లతో మాట్లాడినా, చనువుగా ఉన్నా మా ఇంట్లో చంపేస్తారు. అందుకే అవసరానికిమించి ఎవరితో మాట్లాడను'' అంది ప్రియ మంజరి మొహంవైపు చూస్తూ.

మంజరి అవునన్నట్లు తల ఊపింది.

"కానీ నీ కోసం నేను త్యాగం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. ఒకపని చెయ్యి. మధుని నాకు పరిచయం చెయ్యి. నేను అతనితో మాట్లాడి అతని ఉద్దేశం ఏంటో గ్రహిస్తాను. నీ గురించి కదుపుతాను. అతను అనుకూలంగానే మాట్లాడ్తాడని నా నమ్మకం. లేకుంటే ఎందుకింత చనువుగా ఉంటాడు. కాకపోతే నీలాగే మొహమాట పడుతున్నట్లున్నాడు. ఒక్కసారి నేను గనక మీ ఇద్దరి మధ్యా తెరలు తీసేశానంటే ఇద్దరూ కలసిపోతారు. సంకోచాలన్నీ వదిలిపోతాయి'' అంది ప్రియ.

మంజరి సంతోషంగా చూసింది.

"నిజంగానా ప్రియా... ఈ ఉపకారం చేసిపెట్టావంటే నీ మేలు మర్చిపోలేను'' అంది.

"పిచ్చిదానా. ఇదేమంత ఉపకారం... సరే ఎప్పుడు పరిచయం చేస్తావు మధుని''

"ఆఫీసులో వద్దు. అతన్ని సాయంత్రం రెస్టారెంట్‌కి రమ్మని చెప్తాను. ఆఫీసునుంచి అక్కడికే వెళ్దాం మనం. మీ ఇంట్లో తెలిస్తే కోపగిస్తారేమో... నా గురించి చిక్కుల్లో పడకు. బాగా ఆలోచించుకో'

"ఏం పర్వాలేదు. నీ కోసం భరిస్తాను'' నవ్వింది ప్రియ.

★ ★ ★

"ప్రియా, ఇవాళ సెలవు పెడతావా?" ప్రియ తల్లి పార్వతమ్మ అడిగింది.

"దేనికి'' ప్రియ మొఖం చిట్లించింది.

"పెళ్లిచూపులు''

"ఎవరికి?"

"ఎవరికేంటి? నీకే'

"నాకు ముందే చెప్పాల్సింది. అయినా నీకెన్నోసార్లు చూచాయగా చెప్తూనేవచ్చాను. మీరు తెచ్చే సంబంధాలు నాకు నచ్చవని'' అంది ప్రియ.

"మరి ఇంకెవరు కావాలి నీకు? ఈ అబ్బాయికేం? నిక్షేపంలా బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు. బాధ్యతలు లేవు. పిల్లాడు బాగుంటాడట"

"అమ్మా నాకు వీళ్లెవరూ నచ్చరు. వృధాప్రయాస పడక హాయిగా కూర్చో. లేదా పెళ్లి మీరే చెయ్యాలంటే వినండి. అబ్బాయి ఆస్థిపరుడై వుండాలి. చాలా పెద్ద ఉద్యోగం చేస్తూ దర్జాగా, దర్పంగా ఉండాలి. కారూ, ఫోనూ బంగళా ఉండాలి. అప్పుడే నేను ఒప్పుకుంటాను'' అంది ప్రియ నిష్కర్షగా.

"అన్నీ ఉన్నవాడు అవన్నీ ఉన్నవాళ్ళనే కోరుకుంటాడు. కానీ మన దగ్గర కెందుకొస్తాడు?"

"ఎందుకు రాడు? కొందరు ఆదర్శవాదులుంటారు. వాళ్లని వెతికి పట్టుకో'

"అయితే ఏమంటావిప్పుడు?"

"అనేందుకేం లేదు. వాళ్ళని పెళ్లిచూపులకి పిలవండని నేను చెప్పలేదు. పిల్చినవాళ్లు మీరే కాబట్టి మీరే వాళ్ళని రాకుండా చూసుకోండి. ఇంకెప్పుడూ ఇట్లాంటి సంబంధాలు చూడకండి'' ఖండింతంగా అంది ప్రియ.

అద్దంముందు కూర్చుని లిప్‌స్టిక్ దిద్దుకోవటం మొదలుపెట్టిన కూతుర్ని చిరాగ్గా, కోపంగా చూస్తూ అక్కడే నిలబడింది పార్వతమ్మ. ప్రియ అదేం పట్టించుకోనట్లు తాపీగా మేకప్ ముగించుకుని సెంట్ పూసుకుని, డ్రెస్ చేసుకుని బ్యాగ్ తీసుకుని బయల్దేరింది.

ఏం చెయ్యలేక పార్వతమ్మ ఊరుకుంది. ఏమన్నా అంటే ప్రియ పులిలా విజృంభిస్తుంది. రాక్షసిలా అరుస్తుంది.

"అసలు పెళ్లి చెయ్యలేనివాళ్లు పిల్లల్నెందుకు కనాలి. పిల్లని కనేముందే వాళ్లకి రాజకుమారుడిలాంటి భర్తని తేగలమా లేదా అని ఆలోచించుకుని మరీ కనాలి'' అని అరిచేస్తుంది నిర్మొహమాటంగా.

సంపాదనలో పైసా కూడా తల్లిదండ్రులకి ఇవ్వదు. అంతా సొంతానికి ఖర్చు పెట్టుకుంటుంది. మేకప్ సామాగ్రికీ, బట్టలకీ, చెప్పులకీ, సినిమాలకీ, షికార్లకీ. అసలు ఉద్యోగం చెయ్యనని భీష్మించుకుని కూర్చుంది. కానీ కుదరలేదు. తండ్రి గోవిందరావు బలవంతంచేసి చేర్పించాడు. అందులో ఆయనకి స్వార్థం లేదు. ఉద్యోగం చేస్తున్న పిల్లయితే సంబంధాలు తొందరగా కుదిరిపోతాయన్న ఆశ తప్ప జీతంలో పైసా కూడా ఇవ్వకపోయినా తల్లిదండ్రులు ఏమీ అనుకోరు. పెళ్లికి ఒప్పుకుంటే చాలనే స్థితిలో వాళ్లున్నారు.

★ ★ ★

రెస్టారెంట్‌లో కూర్చుని ఉన్నారు మంజరీ, ప్రియా, మధు.

"నా క్లోజ్ ఫ్రెండ్ ప్రియ" పరిచయం చేసింది మంజరి. మధు "హలో' అని నవ్వాడు.

ప్రియ కూడా అందంగా నవ్వింది.

మధు మంజరితో ఏవో కబుర్లు చెపుతున్నాడు. కానీ అతని చూపులు ప్రియ చుట్టూ తిరుగుతున్నాయి.

ప్రియ అతని వాలకాన్ని కనిపెట్టి తృప్తిగా నవ్వుకుంది.

"మీకేం కావాలి?" అని అడిగి తెప్పించాడు మధు.

బిల్ అతనే పే చేశాడు.

ప్రియ హాబీలు అడిగి తెలుసుకున్నాడు.

"ఏం చదివారు?" అని అడిగాడు. ఆమె సీట్లో పని ఏంటో అడిగాడు. మధు పరిధిలోనిది కాదు ప్రియ పనిచేస్తున్న సెక్షన్.

"నాకు పనుంది... ఆటోలో వెళ్లిపోతాను'' అంది మంజరి, ముగ్గురూ బయటకు వచ్చాక.

"అరే...! పాపం మీ ఫ్రెండ్ ఒక్కరే" అన్నాడు మధు.

"పర్వాలేదు. కాస్సేపు నిలబడితే వాళ్ళ బస్ వచ్చేస్తుంది'' అంది మంజరి, ఆటో ఎక్కుతూ. ఆమె ఉద్దేశం ఏకాంతం కల్పిస్తే ప్రియ మధుతో తమ సంగతి కదుపుతుందేమోనని. ఆమె ఉద్దేశం ప్రియకి అర్థమైంది కూడా.




ఇద్దరూ బస్‌స్టాప్‌లో నిలబడ్డారు.

ప్రియ మధుతో క్లోజ్‌గా మాట్లాడుతోంది. అట్లా మాట్లాడుతూనే అతని అభిప్రాయాన్ని మనసులోని మర్మాన్నీ గ్రహించేసింది. మధు కి మంజరిమీద ప్రేమ లేదు. ఏదో సరదాకి మాట్లాడ్తున్నాడు. అంతే.

ప్రియకి పట్టలేనంత ఆనందం కలిగింది. పైగా మళ్ళీ కలుస్తానని మాట ఇచ్చిందాకా మధు ఊరుకోలేదు. నిజానికి ప్రియకి కావ ల్సింది అదే. కానీ కాస్త అమాయకత్వం, కాస్త అతనిపట్ల ఆసక్తి లేకపోయినట్లూ నటించింది.

మర్నాడు పొద్దున్న ఆఫీసుకి వెళ్లగానే మంజరి వచ్చేసింది.

"మధు ఏమన్నాడు? నాకైతే రాత్రంతా నిద్రపట్టలేదు'' అంది ఆదుర్దాగా.

"అప్పుడే అడిగేస్తే ఏం బాగుంటుంది. అసలు నువ్వు వెళ్లగానే నా బస్ వచ్చేసింది. ఇంకా నిలబడితే అతనేమన్నా అనుకుంటాడని ఊరుకున్నాను. ఇవాళో రేపో అడుగుతాను. పరిచయం అయిందిగా. ఇక స్వేచ్ఛగా మాట్లా డవచ్చు'' అంది ప్రియ.

"నిజమేలే' అంది మంజరి.

ఆరోజు ప్రియ, మంజరి కలిసి లంచ్‌చేశా రు, చాలా రోజుల తర్వాత.

ఇద్దరూ తింటుండగా మధు వచ్చాడు.

"సారీ, డిస్టర్బ్ చేస్తున్నానా?" నవ్వాడు.

"లేదు... అసలు మీ రాక మాకు ఆనందదా యకం. రండి... కూర్చోండి'' అంది ప్రియ.

మంజరి కుర్చీ తెచ్చి వేసింది అతనికి. సినిమాల గురించీ, ఇంగ్లీషు భాష గురించీ, అమెరికా గురించీ చాలా చాలా మాట్లాడాడు మధు. ప్రియ, మంజరి శ్రోతలు అయ్యారు.

ప్రియ బాక్స్‌లో స్పూన్ వేసుకుని వచ్చింది కాబట్టి స్పూన్‌తోనే తింది. మంజరి స్పూన్‌తో తినలేదు కాబట్టి చెయ్యి కడుక్కోవలసి వచ్చింది.

"చెయ్యి కడుక్కుందాం వస్తావా?" అంది మంజరి.

"నువ్వు పోయిరా... నేను కూర్చుని మాట్లా డ్తుంటాను'' అంది ప్రియ.

ఆమె కనుమరుగు కాగానే మధు ప్రియ వైపు తిరిగాడు. ఒకసారి చుట్టూ చూశాడు. ఎవరూ లేరు. అంతా లంచ్ చెయ్యడానికి బయటికి వెళ్లసాగారు.

"ప్రియా... నాకు రాత్రి నిద్రపట్టలేదు'' అన్నాడు.

"ఎందుకని?" ప్రియ కొంటెగా నవ్వింది.

"ఎందుకంటే... మీరు చాలా అందంగా ఉన్నారు కనుక"

"బాగుంది... నేను అందంగా ఉంటే మధ్యలో మీకు నిద్రపట్టకపోవటం ఏమిటి?" ప్రియ పడీపడీ నవ్వింది.

"నా హృదయాన్ని అడగండి''

"ఎక్కడుంది మీ హృదయం... చెప్పండి అడుగుతాను''

"మీరు చూస్తానంటే చీల్చి చూపిస్తాను''

"అక్కర్లేదులెండి... మీ మాట నమ్ముతా ను''

"థాంక్యూ... అయితే సాయంత్రం మీరు నాతో రావాలి''

"ఎక్కడికి?"

"బ్యూటీ రెస్టారెంట్‌కి. అక్కడ ఐస్‌క్రీమ్ చాలా బాగుంటుంది. మీతో కలిసి ఆ అను భవం పంచుకోవాలని... అదే... చల్లటి ఎయిర్ కండిషన్డ్ గదిలో... ఇంకా చల్లటి తియ్యటి ఐస్‌క్రీమ్ తినటం... ఎంత అంద మైన అనుభవం అనుకున్నారు... ప్లీజ్... కాదనకండి''

"అలాగే!" అంది ప్రియ.

"థాంక్యూ వెరీమచ్' అతను సంతోషంగా చూశాడు. ఇంతలో మంజరి వస్తూ ఉండటం కనిపించింది.

ఇద్దరూ గప్‌చుప్‌మని ఉండిపోయారు.

మంజరితో కాసేపు అవీ యివీ మాట్లాడి వెళ్లిపోయాడు మధు.

"అడిగావా...?" ఆశగా అడిగింది మంజరి.

"లేదు... అయినా యిక్కడ ఎలా అడుగుతాం? ఎవరో ఒకరు వస్తూ పోతూ వుంటారు. బాగుండదు''

"అవును..."

★ ★ ★

బ్యూటీ రెస్టారెంట్‌లో ఐస్‌క్రీమ్ తిన్నాక మధు-ప్రియల స్నేహం గట్టిపడింది.

అతను ఆమె ఇంటివిషయాలు అడిగి తెలుసుకున్నాడు. తనగురించి చెప్పాడు.

తన కార్లో ప్రియను వాళ్ల ఇంటికి కాస్త దూరంగా దింపాడు.

అక్కడినుంచి సినిమాయో, షికారో లేని రోజులేదు. ఇద్దరూ చెయ్యీచెయ్యీ పట్టుకుని హాయిగా తిరుగుతున్నారు.

మధు ప్రియకి అందమైన డ్రెస్‌లు ప్రెజెంట్ చేశాడు. గోళ్లరంగులూ, పౌడర్లూ, లిప్‌స్టిక్‌లూ సరేసరి. కార్లోనూ, మోటార్ సైకిల్‌మీదా షికార్లు ప్రియకి చాలా ఆనందం కలిగిస్తున్నాయి.

ప్రియకి మధు మంజరితో మాట్లాడటం ఇష్టంలేదు. తన బండారం బయటపడుతుందని భయం... పెళ్లి విషయం కదుపుతానన్న తను ఇన్ని రోజులు గడిచినా చూచాయగా కూడా అతన్ని మంజరిమీద అతని అభిప్రాయం ఏమిటని అడగలేదు. కాబట్టి ఒకవేళ మంజరి గనక అతనికి తనని పరిచయం చేసిన అసలు ఉద్దేశ్యం ఇదీ అని మధుకి చెప్పేస్తే... అతనికి తనమీద మంచి అభిప్రాయం ఉండదు. ఏంచెయ్యాలా అని ఆలోచిస్తోంది.

మధు ప్రియ అభిప్రాయం గమనించినట్లుగా నెమ్మది నెమ్మదిగా మంజరితో స్నేహం తగ్గించి పదిహేనురోజుల్లో ప్రియతో పూర్తి స్నేహం ఏర్పరచుకుని మంజరితో అసలు మాట్లాడటమే మానేశాడు.

మంజరికి వాళ్లిద్దరి సంగతీ తెలిసిపోయింది. అందరూ చెప్పుకుంటుండగా విన్నది. కానీ నిజంకాదేమో అనుకుంది. ప్రియని అడుగుదాం అనుకుంది. కానీ ప్రియ ఆమెని పూర్తిగా తప్పించుకుని తిరగటం మొదలుపెట్టింది.

ప్రియ, మధూ కలిసి ప్రేమికుల్లా తిరుగుతున్న సంగతి ప్రతివాళ్లూ చర్చించుకుంటున్నారు.

మంజరికి మతిపోయినట్లు అవుతోంది.

'ఏమైనాకానీ, ఈరోజు ఏ సంగతీ తేల్చేస్తాను' అనుకుంది గట్టిగా.

కానీ అదే తేలిపోయింది అనుకోకుండా రోజంతా ప్రియ మంజరికి ఏమాత్రం మాట్లాడే అవకాశం ఇవ్వలేదు. సాయంత్రం కాగానే ప్రియ మాయమైపోయింది.

చేసేదిలేక ఇంటికి వెళ్లిపోవటానికి నిశ్చయించుకుంది మంజరి. తన కాలనీకి వెళ్లే బస్ ఎక్కింది.

బస్‌లో వెళ్తుండగా ఆమెకి కనబడింది... ప్రియ, మధు మోటార్‌బైక్‌మీద వెళ్తున్నారు. మధు హుషారుగా ఏదో చెప్తున్నాడు. ప్రియ పగలబడి నవ్వుతూ వింటోంది. ఆమె చెయ్యి అతని నడుంచుట్టూ పాములా చుట్టుకుని ఉంది. పూర్తిగా అతనిమీద వాలిపోయివుంది.

మంజరి హతాశురాలయిపోయింది. ఏం చేస్తున్నదో, ఎక్కడ ఉన్నదో కూడా తెలియని అయోమయ స్థితి ఆమెని ఆవరించింది.

ఆ తర్వాత...

అంతులేని కోపం... కసి కలిగాయి. అమాంతం బస్సులోంచి దూకి వాళ్ల చెంపలు వాయించాలన్నంత కోపం... అతి కష్టాన తన నిగ్రహాన్ని కంట్రోల్ చేసుకుంది.

ఇంటికి ఎట్లా వెళ్లిందో కూడా తెలియదు. రాత్రంతా ఏడుస్తూ ఉండిపోయింది. ప్రాణస్నేహితురాలనుకున్న ప్రియ ఎంత మోసంచేసింది?

మధుతో పరిచయం చేసుకోవటానికి తన




# రచయితలకు మనవి 



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పివంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

**చతుర**

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షల కు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**మార్చి చతుర నవల తప్పు**

.......................................................

**సమీక్షకుని పేరు :** .......................................................

**చిరునామా :** .......................................................

.......................................................

.......................................................

.......................................................

నొక పావుగా వాడుకుందన్నమాట. తనకేదో ఉపకారం చేస్తున్నట్లు నటించి... ఛీ... తడిగుడ్డతో గొంతుకోసేరకం ప్రియ... ఇన్నాళ్లూ స్నేహం చేసినా తను ఆ సంగతి కనిపెట్టలేక పోయింది.

తను పిచ్చిది కాకపోతే ఇన్నాళ్లయినా వాళ్ల గురించి ప్రతివాళ్లు చెప్తూనేవున్నా ఇంకా సందిగ్ధంలో ఉండిపోయింది. తను ఒక శతాబ్దం ముందు పుట్టాల్సిన మనిషి. ప్రియ ఒక శతాబ్దం తరువాత పుట్టాల్సిన మనిషి. ఇద్దరికీ మధ్య రెండు శతాబ్దాల తేడా వుంది, ఆంతర్యంలో, డాషింగ్‌నెస్‌లో... అయినా తను మూర్ఖురాలు కాకుంటే తన ప్రేమగొడవేదో తనే చూసుకోక మూడోమనిషి సాయంకోరటం దేనికీ... తనే నేరుగా మధుని అడిగి వుంటే ఎంత బాగుండేది? ఏం జరిగేది... అయితే 'యస్'... కాకుంటే 'నో...' అని ఉండేవాడు. ఏదయినా తనకి ఇంత క్షోభ ఉండేది కాదు. ఇప్పుడు ప్రేమికుణ్ని కోల్పోయిన బాధకి తోడు నమ్మినవాళ్లే మోసం చేశారే అన్న బాధ మరొకటి...

కన్నీటితో తలగడా బరువెక్కింది. పొద్దున్న లేవగానే గబగబా పనులు ముగించుకుని ఆఫీసుకి వెళ్లిపోయింది.

ప్రియ ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూడాలి కాబోలు అనుకుంది. కానీ ప్రియ అప్పటికే వచ్చేసినట్లు ఆమె బాగ్ తెలిపింది.

టాయిలెట్‌కి వెళ్లిందేమోనని అక్కడికి వెళ్లింది. ప్రియ అక్కడ కనబడలేదు.

"ప్రియకోసమా...?" ప్యూన్ అడిగాడు, ఆమె ప్రియ సీటువైపు రావటం గమనించి.

"అవును..."

"ఆవిడ మధుగారి రూమ్‌లోకెళ్ళింది" వంకరగా నవ్వుతూ చెప్పాడు అతను.

మంజరి ఉండబట్టలేకపోయింది. తననుతాను సంబాళించుకోలేకపోయింది... కోపం... ద్వేషం... ఏడుపు... ఆమెని నిలవనివ్వలేదు.

గబగబా మధు రూమ్‌వైపు నడిచింది. కర్టెన్ పూర్తిగా ఉంది కాబట్టి లోపల ఉన్నవాళ్లు బయటకు కనబడరు.

మధు రూమ్‌లోకి ఎవరు వెళ్లాలన్నా ముందు కూర్చున్న ప్యూన్ అనుమతి తీసుకునిగానీ వెళ్లటానికి వీల్లేదు.

కానీ కోపంలో ఉన్నవాళ్లు అవన్నీ గమనించరు. మంజరి చటాలున కర్టెన్ తీసి లోపలకు వెళ్లిపోయింది.

లోపల మధు, ప్రియ... ఇద్దరూ మంజరిని చూసి ఉలిక్కిపడి దూరంగా జరిగారు.

మంజరికి ఏడుపు ఆగలేదు. కళ్లల్లోంచి కారుతున్న కన్నీటిని తుడుచుకుంటూ వెనక్కి తిరిగి సరాసరి టాయిలెట్‌లోకి పరుగుతీసింది. చాలాసేపు ఏడ్చిఏడ్చి తనను తానే ఓదార్చుకుని, నెమ్మదించి మొహం చన్నీళ్లతో కడుక్కుని సెక్షన్‌లోకి వెళ్లింది.

ప్రియ తన సెక్షన్లో కూర్చుని పని చేసుకుంటోంది. ఇక కథ అంతా అర్థం అయ్యాక, తనవరకూ అంతా అయిపోయాక అడిగీ ఏం ప్రయోజనం అనిపించింది మంజరికి. కానీ లంచ్‌టైమ్ దగ్గరవుతున్నకొద్దీ ఊరుకోలేకపోయింది.

లంచ్‌లో మధు రాలేదు. ప్రియ సెక్షన్లో ఎవరూలేరు. మంజరి ప్రియదగ్గరికి వెళ్లింది.

ప్రియ ఒకసారి ఆమెవంక చూసి నిర్లక్ష్యంగా తల తిప్పేసుకుంది.

"ఎందుకింత ద్రోహంచేశావ్?" అంది మంజరి.

"నోర్మూయ్... ఏంటి ద్రోహం?"

"మరేంటి...? మధుతో నాగురించి మాట్లాడ్తానని చెప్పి పరిచయం చేయించుకుని ఇదా నువ్వు చేసేది?"

"షటప్... బోడి పరిచయం... నువ్వు చెయ్యకపోతే ఇంకోలాగ పరిచయం చేసుకునేదాన్ని... ముష్టి ఇందులో నువ్వు చేసిందేముంది?"

"సరే... అది వదిలెయ్యి... నా సంగతి

అడుగుతానని ఇట్లా చెయ్యటం ద్రోహంకాదా?"

"ఏం అడగమంటావ్?... అతనికి నిన్ను చూస్తేనే ఎలర్జీ. ఇంక పెళ్లి చేసుకుంటాడని ఎట్లా అనుకున్నావ్? అసలు అతను నీతో ఎందుకు మాట్లాడాడో తెలుసా...? కేవలం నా ఫ్రెండ్‌వి కాబట్టి. నీతో మాట్లాడితే నీ ఫ్రెండ్‌ని కాబట్టి నేనూ పరిచయం అవుతానని మాట్లాడాడట. తొలిచూపులోనే అతను నన్ను గాఢంగా ప్రేమించాడట" జంకూగొంకూ లేకుండా చెప్పింది ప్రియ.

మంజరి మతిపోయినట్లు చూసింది. అది చూసి ప్రియ మరీ విజృంభించింది.

"మధు నన్ను గాఢంగా ప్రేమిస్తున్నాడు. తొలిచూపులోనే ప్రేమ మాది. త్వరలోనే మా పెళ్లి జరిగిపోతుంది. నువ్వేమనుకున్నా ఒక మాట... నేను నీగురించి మా పరిచయం అయిన మర్నాడే అడిగాను. అతను పెద్దగా నవ్వి నీ గురించి చాలా తక్కువగా మాట్లాడాడు. నువ్వు బాధపడతావని చెప్పలేదు'' అంది.

మంజరి కాసేపు మాటా పలుకూ లేకుండా నిలబడింది.

"ఇంక వెళ్లు. సెక్షన్‌లో వాళ్లు వస్తున్నారు. నవ్వుకుంటారు'' అని తరిమేసింది ప్రియ.

మంజరి పిచ్చిదానిలా నడుచుకుంటూ వెళ్లిపోయింది. పదిరోజులకి సెలవు రాసి ఆఫీసరుకి ఇచ్చింది. సెక్షన్లో కూర్చుని పని చెయ్యబుద్ధి కాలేదు ఆమెకి. ప్రియ మొహం చూడాలంటేనే కంపరంగా ఉంది. ఏం చెయ్యాలో తోచటంలేదు. ఆ ఆఫీసులో ఇక పనిచేయలేనని అనిపించింది. ప్రియనీ, మధునీ చూస్తూ వాళ్ల ముందు ఫూల్‌లా తిరగాలా అని బాధ కలిగింది. పిరికిదానిలా పదిరోజుల సెలవు పెట్టి వెళ్లిపోయింది.

ప్రియ చాలా ఆనందంగా వుంది. ప్రేమ యుద్ధంలో ప్రత్యర్థి మంజరిని ఓడించినందుకు, మధులాంటివాడిని పెళ్లి చేసుకోబోతున్నందుకు...

మధు ఆరోజు హుషారుగా ఉన్నాడు ఎందుకో.

"ఏమిటి చాలా హాపీగా వున్నారు?" అంది కార్లో కూర్చుంటూ. ఇద్దరూ లంచ్‌టైమ్‌లో బయటికి వచ్చారు.

"నువ్వు చూస్తావుగా''

"ఏమిటి?"

"మా ఇల్లు''

"ఏంటి... ఇప్పుడు మీ ఇంటికి వెళ్తున్నామా?"

"అవును''

ప్రియకి చాలా సంతోషంగా అనిపించింది. మధు తనని అతని తల్లిదండ్రులకి చూపించటానికి తీసుకెళ్తున్నట్లున్నాడు. అంటే... త్వరలోనే పెళ్లి...

ఇంటిముందు కారాగింది. అది చాలా అందమైన బంగళా. లోపల కూడా చాలా అందంగా ఉంది. మధు గది ఎయిర్ కండిషన్డ్‌ది. హాయిగా ఉంది.

ఇంట్లో ఎవరూలేరు. ఒక వంటవాడు వంట గదిలో కూర్చుని పని చేసుకుంటున్నాడు.

"మమ్మీ, డాడీ ఊరికెళ్లారు'' అన్నాడు మధు.

"మరి వాళ్లు లేకపోతే నన్నెందుకు తీసుకొచ్చారు?" అంది ప్రియ చిరుకోపంగా.

"వాళ్లు లేరు కాబట్టే!" నవ్వాడు మధు.

ప్రియ కోపంగా చూసింది.

అతను కొన్ని జోక్స్ చెప్పి నవ్వించి ఆమె కోపం పోగొట్టాడు.

మాటలతోనే మురిపిస్తూ అతను ఆమెను పూర్తిగా లొంగదీసుకున్నాడు.

"పెళ్లికి ముందే వద్దు'' అంది ప్రియ.

"పెళ్లిదేముంది... ఎప్పుడు ముహూర్తం ఉంటే అప్పుడు చేసుకోవచ్చు'' అన్నాడు మధు.

"వద్దు... ఏమన్నా ప్రాబ్లమ్స్ వస్తే..."




"నన్ను నమ్ము. నీకు నేనున్నాను. ఏ ప్రాబ్లమ్స్ రావు!" అన్నాడు మధు.

అతని మాటలకు కరిగిపోయిన ప్రియ ఇంక అభ్యంతరం చెప్పలేదు.

ఆ తర్వాత మరికొన్నిసార్లు...

ప్రతిసారీ 'వద్దు వద్దు' అనుకుంటూనే ప్రియ అతనికి 'ఓ.కే.' చెప్తోంది.

మూడు నెలలు గడిచేసరికి తను నెలతప్పిన విషయం తెలిసింది ఆమెకి.

గుండె గుభేలుమంది. తల్లికీ, తండ్రికీ తెలిస్తే నరికి పోగులుపెడతారు. ఏంచెయ్యాలి...? మధుని అడిగి వెంటనే పెళ్లికి ఏర్పాట్లు చేయించమనాలి.

మధురూమ్‌లోకి వెళ్లింది. "నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి"

"మాట్లాడు"

"ఇక్కడ కాదు"

"సరే... మధ్యాహ్నం బస్‌స్టాప్‌లో నిలబడు. నేను వచ్చి పికప్ చేసుకుంటాను..." అన్నాడు మధు.

"సరే..." అంది ప్రియ.

మధుతో మధ్యాహ్నం మోటార్‌బైక్‌మీద వెళ్తూ ఉండగా ఒకరిద్దరు ఆఫీసువాళ్లు ఎదురై నవ్వుకుంటూ వెళ్లారు.

ఇదివరకైతే ప్రియ కేర్‌చేసేదే కాదు. కానీ ఇవాళ ఎందుకో తెలియని భయం... ఏమిటో గానీ ఒళ్లు కూడా వణుకుతోంది. పడిపోకుండా గట్టిగా పట్టుకుంది.

ఇద్దరూ ఒక హొటల్లో కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పు... ఏం జరిగింది?" అన్నాడు మధు.

"నేను... ప్రెగ్నెంట్‌ని..." మాటలు కూడదీసుకుంటూ బలవంతాన చెప్పింది ప్రియ.

అతను కలవరపడతాడనుకుంది. కానీ అతను హాయిగా కూర్చున్నాడు. మొహంలో ఏ మార్పూలేదు.

"మధూ... నువ్వు నాకున్నానన్నావు. తొందరగా మన పెళ్లి ఏర్పాట్లు చెయ్యి. లేకపోతే మా ఇంట్లో నన్ను చంపేస్తారు"

మధు తాపీగా కూర్చున్నాడు.

"మాట్లాడవేం మధూ! రేపో ఎల్లుండో మంచి ముహూర్తం ఉంది" అంది ప్రియ.

"ఒక వారం తర్వాత చాలా మంచి ముహూర్తం ఉంది"

"నిజమా... అయితే తొందరగా ఏర్పాట్లుచెయ్యి"

"ఏర్పాట్లు జరుగుతున్నాయి. కానీ పెళ్లి నీకూ నాకూ కాదు. నాకూ రీతూకి" నింపాదిగా చెప్పాడు అతను.

నెత్తిన పిడుగు పడ్డట్లయింది ప్రియకి.

"ఏమిటి నువ్వనేది. నిన్ను నమ్ముకుని సర్వస్వం అర్పించుకున్నానే... నన్నింత మోసంచేస్తావా?" అంది.

"ప్రియా... డోంట్ బి సిల్లీ... నిన్ను ఒక గర్ల్‌ఫ్రెండ్‌గా భావించానేగానీ భార్యగా ఎప్పుడూ ఊహించలేదు"

"అబద్ధాలాడకు. నీకు నేనున్నాను అని చెప్పలేదూ... పెళ్లి ఎప్పుడన్నా చేసుకోవచ్చు అని అనలేదూ...?"

"చేసుకోవచ్చు అన్నాను. చేసుకో. నన్నుకాదు, నీకు దొరికినవాడిని. ఇంక, నీకు నేనున్నాను అంటే దాని అర్థం ఇట్లాంటి ప్రాబ్లమ్స్ ఏమన్నా వస్తే హెల్ప్ చేస్తానని. అంతేగానీ పెళ్లి చేసుకుంటానని కాదు"

"ఏమిటి నువ్వు చేసే హెల్ప్"

"నాకు తెలిసిన డాక్టర్ దగ్గర అబార్షన్ చేయిస్తాను. గప్‌చుప్‌గా జరిగిపోతుంది. ఖర్చు నేనే భరిస్తాను"

అతన్ని కత్తితో ముక్కలుగా నరకాలన్నంత కోపం వచ్చింది ప్రియకి. కానీ ఏమీ చెయ్యలేకపోయింది.

"ప్రియా, కూల్‌గా ఆలోచించు. నాకు నిన్ను చేసుకునే ఉద్దేశం లేదు. నువ్వు ఒక మధ్యతరగతి మనిషివి. తిరగబడి పోరాడలేవు. నీకా

కెపాసిటీలేదు. అందుకని రాజీపడటం ఉత్తమమైన పని. మూడో కంటికి తెలియకుండా నీకు అబార్షన్ చేయిస్తాను. నీకు నచ్చివాడిని, తగిన వాడిని చేసుకుని గుట్టుగా కాపరం చేసుకో. నీ మేలు కోరి చెపుతున్నాను''

"నువ్వు నన్ను మోసం చేశావు''

"లేదు... నీకెప్పుడూ నేను మాట యివ్వలేదు''

"నీ పెళ్లి జరగనివ్వను. నీ భార్యకి మన కథంతా చెపుతాను''

"చెప్పు నాక్కాబోయే మొగుడు గొప్ప మగాడు అని మురిసిపోతుంది. నాకు నీతో ఫ్రెండ్‌షిప్ ఒక స్టేటస్ సింబల్ అవుతుంది. ఆహా యితన్ని చూసి ఆడాళ్లు పడిపోతున్నారు అని గొప్పగా చెప్పుకుంటారు''

"నాకు అన్యాయం జరుగుతోంది. నేను చూస్తూ ఊరుకోను''

"మరేం చేస్తావు. ఏమీ చెయ్యలేవు. చెయ్యగలిగే మనుషులు ముక్కుకి సూటిగా పోయేరకాలు. నువ్వు వక్రమార్గంలో అడ్డదారిన ఒడ్డు చేరాలనుకునే రకం. నీకు సాయపడేవాళ్లు ఎవరూ ఉండరు. మంజరిని నువ్వెలా మోసం చేశావో అందరికీ తెలుసు'' మధు చిన్నగా నవ్వాడు.

"నన్ను పూర్తిగా దోచుకుని యిదా నువ్వు చెప్పేది'' అంది ప్రియ.

"నువ్వు బాగానే ఎంజాయ్ చేశావని మర్చిపోకు'' మధు నవ్వుతున్నాడు.

ప్రియకి ఏడుపు వచ్చింది.

చేతుల్లో మొహం దాచుకుంది.

మధు ఓదార్చే ప్రయత్నం చెయ్యలేదు.

ప్రియ కాసేపు ఏడ్చి ఊరుకుని, ఆలోచించటం మొదలుపెట్టింది.

మధు మాటల్లో నిజాయితీ లేకపోయినా నిజం ఉంది. మంజరిని పక్కకు తోసి తాను మధుకి చేరువైన విషయం అందరికీ తెలుసు. ఆఫీసులో తనను వెక్కిరించే వాళ్లే తప్ప ఓదార్చేవాళ్లు లేరు. తన పరిస్థితి తెలిస్తే యింకా చులకన అయిపోవటమే తప్ప మరేం జరగదు.

ఇంట్లో ఈ సంగతి తెలిస్తే చంపేస్తారు. అజ్ఞానులకో, అమాయకులకో మోసం జరిగితే ఎవరన్నా సాయం చేస్తారేమో. కానీ తనకెవరు చేస్తారు. నిజానికి ఎవరన్నా సాయం చేస్తామన్నా పెద్ద గొడవ జరిపి మధుని పెళ్లి చేసుకోవాలంటే యింట్లో ఒప్పుకుంటారా. మధ్యతరగతి మనస్తత్వం... తండ్రి ఊరుకోడు. తల్లి తిట్టిపోస్తుంది. చెల్లెలు ఏడుస్తుంది. యింతా జరిగినా మధుని పెళ్లికి ఒప్పించటం జరుగుతుందో లేదో... జరిగినా గుర్రాన్ని నీటిదాకా తీసుకెళ్లగలం కానీ నీళ్లు తాగించలేం కదా! బలవంతంగా పెళ్లి చేయించగలరేమో గానీ, బలవంతంగా సంసారం చేయించలేరు.

మధు ప్రియలో చెలరేగుతున్న ఆలోచనలు గుర్తించి సంతృప్తిగా నవ్వుకున్నాడు.

అతను యింతకుముందు కొంతమంది అమ్మాయిలతో ఖుషీగా గడిపాడు. వాళ్లు కూడా ప్రియలాంటి మనస్తత్వం ఉన్నవాళ్లే. సిన్సియర్‌గా ఉండేవాళ్లూ, నిష్కల్మషంగా ప్రవర్తించేవాళ్ల జోలికి అతను పోడు. అట్లాంటి వాళ్లు తను యిట్లా చేస్తే భద్రకాళులై విజృంభిస్తారని అతనికి తెలుసు.

ఆ తర్వాత కథ మామూలే.

మధుకి తెలిసిన నర్సింగ్ హెూమ్‌లో అంతా గుట్టుగా జరిగిపోయింది.

మధు పెళ్లి జరిగిపోయింది మరో వారంలో.

మధు పెళ్లికి వద్దనుకుంటూనే వెళ్లింది ప్రియ.

ఆఫీసులో అందరితోపాటూ వెళ్లింది. అందరూ తనని చూసి నవ్వుకుంటున్నట్లు అనిపించింది.

దాచాలనుకున్నా కొన్ని దాగవు. ప్రియ నర్సింగ్‌హెూమ్‌లో చేరిన సంగతీ, ఎందుకు చేరిందీ కూడా అందరికీ తెలిసి పోయింది.




ఎలా తెలిసిందో ప్రియకి అర్థం కాలేదు. అక్కడ తను ఉన్నది కొద్ది గంటలే. అదీ చాలా రహస్యంగా. అయినా అందరికీ తెలిసిపోయింది. యింట్లో వాళ్లకి కూడా తెలిసిపోయిందేమోనని అనిపించింది ప్రియకి... వాళ్లు నేరుగా బయటపడకపోయినా మునుపటంత ఆప్యాయంగా లేరు. ఎట్లాగో ఒకలాగ తనకి పెళ్లి చేసి వదుల్చుకోవాలని అనుకుంటున్నట్లు ప్రియ కనిపెట్టింది. అడ్డు చెప్పకుండా ఊరుకుంది. తన సంగతి యింకా బాగా పొక్కిపోక ముందే ఎవరో ఒకరిని చేసేసుకుంటే చాలనిపించింది. పూర్వపు ఆంక్షలూ, పెళ్లికొడుక్కి కావాల్సిన అర్హతలూ గురించి మాట్లాడలేదు. ఏదో ఒక పెళ్లి కొడుకు చాలు అనుకుంది.

కానీ ఆ ఏదో ఒక పెళ్లి కొడుకు కూడా ఎవరూ రెడీగా లేరనీ, పెళ్లి కావటం చాలా కష్టమనీ పెళ్లిళ్ల మార్కెట్ స్టడీ చేశాక ప్రియకి తెలిసింది.

మగవాడిగా పుట్టటమే ఒక క్వాలిఫికేషన్. వాడికి ఏ అర్హతా లేకపోయినా చేసుకునే భార్యకి మాత్రం అన్నీ ఉండాలనుకుంటాడు ప్రతివాడూ. తన మొహం ఎట్లా ఉందీ గమనించడు. భార్య మాత్రం చాలా అందంగా ఉండాలనుకుంటాడు. మామూలుగా చూస్తే అందగత్తె అనిపించే అమ్మాయిని కూడా పెళ్లి చూపుల శల్యపరీక్షలో ఆ మామూలుగా ఉంది అంటారు. ప్రతివాడికీ బోలెడు ఆశ, భార్య లక్షలు తీసుకు రావాలని. తనక్కావాల్సిన వస్తువులన్నీ మామగారే యివ్వాలనుకుంటాడు.

తల తాకట్టు పెట్టయినా ప్రియకి పెళ్లి చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాడు తండ్రి గోవిందరావు.

ఒక సంబంధం తెచ్చాడు. అబ్బాయి ఒక మోస్తరుగా ఉన్నాడు. ఏదో ఆఫీసులో గుమాస్తాగా పని చేస్తున్నాడు. లక్ష రూపాయల కట్నం అడిగాడు. యిల్లు అమ్మేసి కట్నం యిద్దామనుకున్నాడు గోవిందరావు. వాళ్లడిగినవన్నీ సరేనన్నాడు.

ప్రియకి ఆ పెళ్లికొడుకూ, అతని చుట్టాలూ ఎవరూ నచ్చలేదు. కానీ యింతకన్నా సంబంధాలు రావని అప్పటికే గ్రహించి ఉండటం చేత విధిలేక సరేనంది. అతనికి మార్కెట్‌లో ఆ మాత్రం కట్నం వస్తుంది.

ఊరుకెళ్లాక ఉత్తరం రాస్తామన్నారు వాళ్లు. కానీ వెళ్లకుండానే ఆరోజే చెప్పేశారు.

ప్రియ గమనించలేదుగానీ పెళ్లి చూపులకి వచ్చిన చుట్టం ఒకడు ప్రియ అబార్షన్ చేయించుకున్న నర్సింగ్‌హోమ్‌లోనే పని చేస్తున్నాడు. ప్రియని అక్కడ చూశాడు అతను.

ఇంకా మంచివాళ్లు కాబట్టి అసలు సంగతి ప్రియ తల్లితండ్రులకి చెప్పలేదు వాళ్లు. పిల్ల నచ్చలేదని మాత్రం చెప్పారు.

ఇంకో సంబంధం వచ్చింది. కానీ వాళ్లకి కూడా ఎవరో ప్రియ సంగతి చెప్పారు. అదీ తప్పిపోయింది.

మధుని పెళ్లి చేసుకుంటాడో లేదో అడగకుండా అంత చనువుగా తిరగటం ఎంత పొరపాటో ప్రియకి ఇప్పుడు అర్థమైంది.

ఒకరిని ఒకరు కౌగిలించుకుని పార్కుల్లో షికార్లు చేశారు. పొదల మాటున చిరుచిరు అల్లరులు చేశారు. ఒకరిమీద ఒకరు ఒరిగిపోతూ సినిమాలు చూశారు. బండిమీద షికార్లు కొట్టారు.

ఊళ్లో సగం మంది ఈ వింత చూసి ఆనందించారు. అనవసరంగా పుకార్లు చెలరేగితే సమర్థించుకోవచ్చు. కానీ ప్రతిచోటా ప్రత్యక్షంగా చూసినవాళ్లు ప్రశ్నిస్తే ఏం సమాధానం చెప్పుకోవాలి. ఎట్లా యిప్పుడు పాతకథ చెరిపివేసుకోవటం.

సంబంధాలు వెనక్కుపోతున్న కొద్దీ తల్లితండ్రుల్లో భయం పెరిగిపోతోంది. యింట్లో అదోమాదిరి వాతావరణం అలుముకుంటోంది. ప్రియ సంగతి వాళ్లకి చూచాయగా తెలిసింది కూడా. ఆమెని అదుపు చెయ్యలేకపోయినందుకు బాధపడ్తూ ప్రియ చెల్లెలు లత మీద పూర్తి ఆంక్షలు విధించి ఆమెనొక ఖైదీలా

మార్చారు.

ఇంకొక సంబంధం వచ్చింది. అబ్బాయి ఏదో ప్రైవేట్ కంపెనీలో క్లర్కు. పెళ్లిచూపులకి వచ్చాడు.

ఇక్కడ సాక్షాత్తూ పెళ్లికొడుకే ప్రియని మధుతో చూశాడు. ఇందిరా పార్కులో... పొదలమాటున.

వచ్చిన దగ్గర్నుంచీ వెకిలిగా నవ్వటం మొదలుపెట్టాడు. ఎందుకు నవ్వుతున్నాడో తెలుసు కాబట్టి తండ్రి ఏం మాట్లాడలేదు.

ఆ సంబంధం కూడా తప్పిపోయింది. ప్రియకి ఇక తనకి పెళ్లికాదని అర్ధమైపోయింది.

ప్రియ తండ్రి గోవిందరావుకి కూడా మధు విషయం తెలిసిపోయింది. ఏం అనలేక గుండెల్లో దాచుకుని బాధపడ్డాడు.

★ ★ ★

రాజేష్ బస్‌స్టాండ్‌లో నిలబడి ఉన్నాడు. సుప్రియ అతనికి కొద్ది దూరంలో నిలబడి ఉంది.

నాలుగైదు రోజుల్నించీ అదే టైమ్‌కి ఆమెని చూస్తున్నాడు.

ముందు ఆమెని పట్టించుకోలేదు. కానీ యిప్పుడు యింక కోటీశ్వరులు, లక్షాధికారులు కాదు సరికదా మామూలు మనుషులు కూడా చేసుకోరని అర్ధమైపోయింది కాబట్టి ఎవరో ఒకరు సంపాదించి పెట్టే వాళ్లయితే చాలని అనుకుంటున్నాడు కాబట్టి, ఒకసారి ఆమెతో కూడా మాట్లాడి, పరిచయం పెంచుకుని కదిపి చూస్తే పోలే అనిపించింది.

వెంటనే ఆమె దగ్గరకు వెళ్లాడు.

"ఎక్స్‌క్యూజ్‌మి ప్లీజ్" అన్నాడు.

ఏమిటన్నట్లు చూసింది.

"టైమెంతయింది'' అన్నాడు.

"తొమ్మిదీ నలభై" చెప్పింది.

"బస్సీపాటికి రావాలే" అన్నాడు.

"అవును కానీ టైమ్‌కి ఎప్పుడూ రాదు'' అంది.

"అంతేనండీ... యిక్కడ బస్సులన్నీ యింతే. యిదే అమెరికాలో అయితేనా..." అంటూ అక్కడి బస్సు ప్రయాణం గురించి ఉపన్యాసం దంచాడు.

జీన్‌పాంట్‌లో మంచి షర్టు టక్ చేసి, బూట్లు బిగించి, స్టైల్‌గా మాట్లాడుతున్న రాజేష్ ప్రియని వెంటనే ఆకర్షించాడు.

"మీరు అమెరికా వెళ్లారా?" అంది ఆసక్తిగా.

"వెళ్లలేదు. కానీ ఫ్రెండ్స్, రిలేటివ్స్ ఉన్నారు. వాళ్లంతా నన్ను రమ్మని ఒకటే బతిమాలుతున్నారు. చూసి రావడానికైతే పోవచ్చేండీ. అక్కడే సెటిల్ అవటం అంటే బోర్‌గానీ విజిటింగ్‌కి వెళ్లటం బాగానే ఉంటుంది'' అన్నాడు రాజేష్.

ప్రియ విప్పారిన కళ్లతో చూస్తోంది.

అంటే అతను బాగా డబ్బున్న వాడన్న మాట అనుకుంది.

"మీరెక్కడ పని చేస్తున్నారు'' అడిగాడు.

చెప్పింది ప్రియ.

"మీరు స్టేట్స్‌కి వెళ్లటానికి ట్రై చెయ్యలేదా?" అన్నాడు.

"లేదండీ... అక్కడ నాకెవరూ తెల్సినవాళ్లు లేరు. వెళ్లినా అక్కడ ఏం చెయ్యాలి. ప్రొఫెషనల్ కోర్సెస్ చదివిన వాళ్లకైతే లాభంగానీ, నాలాంటి దానికేమి ఉద్యోగం దొరుకుతుంది. నాకు అసలు ఆ ఐడియా రాలేదు''

"బాగానే ఉంది. మీరు అసలు ఒకసారి వెళ్లి అక్కడ అవకాశాలు ఎట్లా ఉన్నాయో చూసి వస్తే బాగుండేది'' అన్నాడు.

అమెరికా వెళ్లి రావటం గురించి అవలీలగా మాట్లాడుతున్న రాజేష్ ప్రియ హృదయంలో తొలిచూపులోనే చెరగని ముద్ర వేశాడు. అతనొక గొప్పవ్యక్తిలా కనిపిస్తున్నాడు. "ఏంటోనండీ'' అంది దిగులుగా.

"ఇంతకీ మీరేం చేస్తున్నారో చెప్పారు కా




దేం"

"చెప్పటానికి గొప్పగా ఏం లేదండీ... బి.ఏ. అయిపోయింది. మా అమ్మగారు తప్ప నాకెవరూ లేరు. ఏదేశం అయినా పోయి రావచ్చు. కానీ ప్రాబ్లమ్ ఏమిటంటే మా అమ్మగారు నన్ను వదిలిపెట్టి ఉండలేరు. ఇద్దరం వెళ్దామంటే యిక్కడి ఆస్తి వ్యవహారాలు దెబ్బతింటాయి. పోనీ ఎవరికన్నా అప్పగించి పోదామన్నా మా మమ్మీ ఆరోగ్యం అంత బాగుండటంలేదు. యిక్కడ తప్ప మరే వాతావరణంలోనూ ఆవిడకి బాగుండదు'' గబగబా చెప్పేశాడు.

ప్రియకి అతను బాగా డబ్బున్న వాడని ఆ మాటలతో అర్థమైపోయింది.

"బస్సు యింకా రాలేదు. మీకు ఆలస్యం అయిపోవటంలేదూ. ఎందుకండీ... హాయిగా ఒక స్కూటర్ లాంటిది కొనేసుకుంటే పోయేదికదా'' అన్నాడు.

ప్రియ సమాధానం చెప్పలేదు.

"మాట్లాడరేం... నేనేమన్నా పొరపాటుగా మాట్లాడితే సారీ అండీ''

"అబ్బే మీరేం పొరపాటుగా అనలేదండీ. నేనే ఏదో ఆలోచిస్తూ సమాధానం చెప్పలేదు. ఈ ట్రాఫిక్ చూస్తే నాకు చచ్చే భయమండీ. నేను నడపలేను'' అంది.

"భయం ఉంటే నడపక పోవటమే మంచిదిలెండి. నేను దేనికీ భయపడను. స్కూటర్, కార్ ఏదైనా స్పీడ్‌గా నడిపి పారేస్తాను. కానీ మా అమ్మగారికి చాలా భయం, ఎక్కడ యాక్సిడెంట్ అవుతుందోనని. ఆవిడ కోసం నేను ఎప్పుడోగానీ బండి బయటకు తియ్యను... అదీ డ్రైవింగ్ చేద్దామనే మూడ్ వస్తేనే''

ప్రియ చెవులప్పగించి వింటోంది.

కళ్లప్పగించి చూస్తోంది.

అతనిమీద నిమిష నిమిషానికీ గొప్ప భావం పెరిగిపోతోంది. అది పెరిగి పెరిగి పెద్ద పర్వతం అంత అయిపోయేదే కానీ యింతలో బస్‌వచ్చింది.

అతను మళ్లీ కనిపిస్తాడో లేడోనని భయం వేసింది. ఆ బస్ ఎక్కకూడదనిపించింది.

"బై! మీ బస్ వచ్చేసింది. రేపు ఇదే టైమ్‌కి వస్తారుకదూ'' అన్న అతని మాటలవల్ల ధైర్యం వచ్చింది.

అతనికి బైబై చెప్పి బస్ ఎక్కింది.

ఆ రోజు ఆఫీసు పనిలో శ్రద్ధ చూపించలేక పోయింది.

రాజేష్ ఆమె కళ్లముందు నిలబడి నవ్వుతున్నాడు. అతని అందమైన మొహం... నవ్వుతున్నట్లుండే కళ్లు ఆమె కళ్లముందు కదులుతున్నాయి.

అతనితో తన పరిచయం పెరిగినట్లు, యిద్దరూ ప్రేమించుకుంటున్నట్లు... అతని తల్లి వద్దన్నా వినకుండా తనని పెళ్లి చేసుకున్నట్లు.

ఆ తరువాత... హనీమూన్‌కి అమెరికా, లండన్, జపాన్... ఎన్నెన్నో దేశాలు తిరిగినట్లు.

చీరెలు, నగలు, చెప్పులు షాపింగ్ చేసినట్లు, కారులో, బోట్‌లో, మోటార్ సైకిల్‌మీదా, విమానంలో... ఒకటేమిటి ప్రతిదానిమీదా ఎక్కి విహారాలు చేసినట్లు.

ఏవేవో కలలు... ఎన్నెన్నో ఊహలు. ఆ రోజంతా మర్నాడు ఎప్పుడొస్తుందా అని ఎదురు చూపులు.

మర్నాడు పొద్దున్నే లేచింది. శుభ్రంగా తలస్నానం చేసి బాగా ఆరబెట్టుకుని జుట్టుని పొడిపొడిగా తయారు చేసింది.

లేటెస్ట్ మోడల్‌లో దువ్వి జడవేసింది. చీర, జాకెట్టు చెప్పులు అన్నీ ప్రత్యేకంగా కనబడేట్లు తయారైంది.

బస్‌స్టాప్‌లో నిలబడి ఎదురు చూస్తోంది. అయిదు నిమిషాలు గడిచాక రాజేష్ వచ్చాడు.

నవ్వుతూ పలకరించింది. అతను కూడా నవ్వుతూ చాలాచాలా మాట్లాడాడు. ఆమె కులం ఏదో కనుక్కుని తనదీ అదే కులం



అన్నాడు.

ఆ తర్వాత మరో రెండు రోజులు గడిచేసరికి ఇద్దరూ మంచి స్నేహితులైపోయారు. స్నేహాన్నిమించి మరేదో ఉన్నట్లు కూడా తెలుసుకున్నట్లు ఒకరికి ఒకరు తెలుపుకున్నారు. పది రోజులు గడిచేసరికి...

"ఐ లవ్‌యూ'' అనేశాడు రాజేష్.

ప్రియ ఉలిక్కిపడింది. ఆమె గుండె భయంతో కొట్టుకుంది.

ఈ మాట...

సరిగ్గా ఇదే మాట కోసం తను ఎదురుచూస్తోంది. ఆ మాట నిజంగానే అన్నాడా రాజేష్. లేక తన చెవులే తనని మోసం చేస్తున్నాయా. ఆమె అనుమానాన్ని తొలగిస్తూ...

రాజేష్ మళ్ళీ మళ్ళీ చెప్పాడు.

"ఐ లవ్ యూ... ఐ లవ్ యూ''

ప్రియ మనసు ఆనందంతో గంతులు వేసింది.

"నేను ఇన్నిసార్లు అడుగుతున్నా మీరు బదులే ఇచ్చారు కాదు. నేనంటే మీకు ప్రేమ లేదా?" అన్నాడు రాజేష్.

"ఎంతమాట అన్నారు. మీరు తొలిచూపులోనే నా మనసు దోచుకున్నారు. మీకూ నాకూ మధ్య భూమికీ ఆకాశానికీ మధ్య ఉన్నంత దూరం ఉంది. అందుకే నా ప్రేమ బయటపెట్టలేకపోయాను'' అంది.

"ప్రేమకి అంతరాలు లేవు... బీదా గొప్పా తారతమ్యం లేదు. అసలు ఏ భేదాలూ లేవు. ప్రేమ చాలా గొప్పది'' అన్నాడు రాజేష్.

"నిజమే. ప్రేమకి ఏ అడ్డూలేదు. ఏ తేడాలు లేవు. ప్రేమ గుడ్డిదంటారు. ప్రేమని మించిన దైవం లేదంటారు. ప్రేమించినవాళ్ళకే ప్రేమ విలువ తెలుస్తుంది. మీ డబ్బూ, ఆస్తీ చూసికాదు నేను ప్రేమించింది. నేను ప్రేమించింది రాజేష్‌ని. నా స్నేహితుడు రాజేష్‌ని. అంతే..."





అంది ప్రియ.

"అంతే. అంతే... మన ప్రేమని ఎవరూ కాదనలేరు. ఎన్ని అవాంతరాలు ఎదురైనా, ఎందరేకమై ఎదిరించినా... మన ప్రేమని అడ్డుకోలేరు'' అన్నాడు రాజేష్ ఆవేశంగా.

ప్రియకి కూడా వెర్రి ఆవేశం వచ్చేసింది.

"అంతే. మన ప్రేమని ఎవరూ ఆపలేరు'' అంది.

ఇద్దరూ ఆరోజు హెూటల్‌కి వెళ్ళి టిఫిన్ తిని సినిమా చూశారు. ఒకళ్ళని విడిచి ఒకళ్లు ఉండటం కష్టమని నిర్ణయించుకున్నారు.

"మన పెళ్లి వీలైనంత త్వరలో జరిగిపోవాలి. నిన్ను విడిచిపెట్టి ఒక్కక్షణం కూడా ఉండలేను'' అన్నాడు రాజేష్.

"నేనూ అంతే రాజేష్. నువ్వే తేదీ ఫిక్స్ చెయ్యి. నావైపునుంచి ఎంత వ్యతిరేకత ఎదురైనా నేను మాత్రం వెనుదిరగను'' అంది.

పెళ్ళి వీలైనంత త్వరగా జరిగిపోవాలి.

ఇద్దరి హృదయంలో ఉన్న గాఢమైన కోరిక.

పెళ్ళి వీలైనంత త్వరగా జరిగిపోవాలి.

ఆమె భయాలు ఆమెవి... ఆలస్యమైతే తన సంగతీ, తను మధుతో తిరిగిన సంగతీ బయటపడిపోతాయి. లోకంలో మంచి జరుగుతుంటే చూసి ఆనందించే వాళ్ళకన్నా ఏడ్చేవాళ్ళ సంఖ్య చాలా ఎక్కువ. తనకి ఇట్లాంటి మనిషి దొరుకుతున్నాడంటే చూసి కళ్లల్లో నిప్పులు పోసుకుంటారు. అతనికి అన్నీ చెప్పేస్తారు. అప్పుడు అతను చచ్చినా ఒప్పుకోడు. ఏదో ఒకటిచేసి, ఎట్లాగో ఒకలాగా వీలైనంత తొందరగా పెళ్ళి చేసేసుకుంటే ఇంక పెళ్ళయ్యాక ఎవరు మాత్రం ఏంచేయగలరు? పెళ్ళయిపోతే చాలు.

అతని భయాలు... ప్రియకి అసలు సంగతి తెలిసిపోతే... తన గుట్టు బయటపడితే చచ్చినా చేసుకోదు. ఛీ పొమ్మంటుంది. అసలు నిజం తెలియకముందే మసిబూసిన మారేడు కాయ... మసి చెరిగిపోకముందే పెళ్ళి జరిగిపోవాలి.

ఒకసారి పెళ్ళంటూ జరిగాక ఇంకేం చేస్తుంది దాని బొంద. చచ్చినట్లు పడుంటుంది. ఏమన్నా అంటే చావచితకగొడితేసరి. నోర్మూసుకుని కూర్చుంటుంది. ఆ తర్వాత ఒకళ్లో ఇద్దరో పిల్లలు పుడితే ఇంక తనకి ఎదురేలేదు. పిల్లలు ఆడదానికి సంకెళ్ళు. సంఘానికీ, ఆచారానికీ, దేనికీ చలించని ఆడవాళ్లు పిల్లల్ని తలుచుకుని చచ్చినట్లు నోర్మూసుకుని కూర్చుంటారు. తనకి భర్తఅఖ్కర్లేదని అనుకున్నా తమ పిల్లలకి తండ్రి కావాలి కాబట్టి తలవంచక తప్పదు.

పెళ్ళి జరిగిపోవాలి.

ఇద్దరూ తమ తమ ఆలోచనల్లోనే ఉన్నారు తప్ప మనసువిప్పి మాట్లాడుకోలేదు. ఎంతసేపూ ఎదుటివాడిని బాగా మోసం చేస్తున్నాం లెమ్మని ఆత్మతృప్తి పొందారుకానీ తామెంత మోసపోతున్నాం అని ఆలోచించలేదు.

"వచ్చే ఆదివారమే పెళ్ళి చేసేసుకుందాం" అన్నాడు రాజేష్.

"కానీ..."

"ఏం చెప్పకు ఇంక. ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. వెంటనే పెళ్ళి జరిగిపోవాలి. మా మమ్మీకి ఏమాత్రం తెలిసినా ప్రమాదం. ఆవిడ చూస్తున్న సంబంధాలు ఎలాంటివో తెలుసా? వాళ్ళంతా పింగాణీ బొమ్మలు. వాళ్ళు చదివింది కూడా ఇక్కడ కాదు అమెరికాలో. అట్లాంటి వాళ్ళని సెటిల్ చేద్దామని చూస్తున్న ఆవిడ నేను నిన్ను చేసుకుంటానంటే ఊరుకుంటుందనుకున్నావా? పట్టుకెళ్ళి ఎవరో వాళ్ళల్లో ఒకమ్మాయికి ఇచ్చి బలవంతంగా పెళ్ళి చేసేస్తుంది. ఏమన్నా అంటే చచ్చిపోతానని బెదిరిస్తుంది. ఒకసారి మన పెళ్ళి గనక జరిగిపోతే... ఇంకేం అనదు. సర్దుకుపోతుంది'' అన్నాడు రాజేష్.

నిజమేననిపించింది.

"అంతంత గొప్పవాళ్ళని వదులుకుని నిన్ను చేసుకుంటున్నాను. ఇందులో నా స్వార్థం లేకపోలేదు. వాళ్ళు చాలా ఫాస్ట్‌గా ఉంటారు. అంతా పాశ్చాత్య నాగరికత. నాకది ఇష్టం ఉండదు. నాకు మన సంస్కృతి, సంప్రదాయాలంటే ఎంతో గౌరవం. మనలా పెళ్ళయిందాకా మడిగట్టుకుని కూర్చోరు అక్కడ. అట్లాంటి వాతావరణంలో పెరిగినవాళ్ళు నాకు ఇష్టంలేదు. నాకు చక్కగా చీర కట్టుకుని, పూలు పెట్టుకుని, నిండుగా బొట్టూ, గాజులతో కళకళలాడే మనవాళ్లే నచ్చుతారు. మా అమ్మగారు చూసేవాళ్ళల్లో ఒక్కళ్లూ చీరె కట్టుకోరు. తెల్సా..." అన్నాడు.

ప్రియకి భయం ఎక్కువైంది ఆ మాటలతో. ఎంత డబ్బున్నా పాతకాలం మనిషిలా ఉన్నాడు. తన సంగతి ఏమాత్రం తెలిసినా ప్రేమాగీమా ఎగిరిపోతాయి. ఎట్లాగైనా వెంటనే పెళ్ళి చేసేసుకోవాలి.

ఒక్క నిమిషం తనమీద తనకే కోపం వచ్చింది.

మధుతో మూర్ఖంగా తిరిగెయ్యకుండా ఉంటే... ఈనాడు ఇంత తొందరపడే అవసరం ఉండేది కాదు. అతనిముందు దోషిలా నిలబడే అవకాశం ఉండేదికాదు. అసలు ఇతనితో పరిచయం అవుతుందని ఏమాత్రం తెలిసినా తను అతనితో మాట్లాడేది కాదు... ఏమిటో... ఏమనుకుని ఏం లాభం.

అంతటితో ఆ ఆలోచనలు కట్టిపెట్టి ప్రస్తుతంలోకి వచ్చింది.

"పెళ్లి ఇక్కడ వద్దు'' అన్నాడు రాజేష్.

"మరి..."

"ఎక్కడికైనా వెళ్ళిపోదాం... అక్కడ చేసుకోవచ్చు''

"ఎక్కడికి?"

"ఏ ఊరైనా సరే... నాకు తెలిసున్నవాళ్లు చాలామంది ఉన్నారుగానీ వాళ్ళంతా మా మమ్మీకి చెప్పేస్తారని నాకు భయం. అందువల్ల నీ తరఫునుంచి హెల్ప్ చేసేవాళ్లు నీ ఫ్రెండ్స్ ఎవరైనా ఉన్నారా? మనకి నాలుగురోజులు ఆశ్రయం ఇచ్చి గుట్టుచప్పుడు కాకుండా

పెళ్ళిచేసి పారేసేవాళ్లు'' అడిగాడు రాజేష్.

ప్రియ ఆలోచించింది.

రత్నమాల జ్ఞాపకం వచ్చింది.

ఇంటర్‌లో ఇద్దరూ కలిసి చదివారు. తర్వాత పెళ్లయి వెళ్లిపోయింది రత్న. వాళ్ళాయన బెంగుళూరులో ఏదో పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. బాగా డబ్బుంది. రత్న అడ్రసు ప్రియ దగ్గర ఉంది. ఎప్పుడైనా గ్రీటింగ్స్ పంపటంలాంటివి చేస్తుంటుంది.

"మా ఫ్రెండ్ ఉంది బెంగుళూర్‌లో. కానీ మరి ఇంత బాధ్యత తీసుకుంటుందో లేదోనని భయంగా ఉంది'' అంది.

"ఫర్వాలేదు. వెళ్ళిపోదాం. అంతగా ఆవిడ కాదూ కూడదూ అంటే అక్కడ్నుంచి వెళ్ళి ఏదో హోటల్లో మకాం పెట్టి గుళ్లో పెళ్లి చేసుకుంటే సరి''

"అట్లాగే'' అంది.

పెళ్లవుతుందని తల్చుకుంటే సిగ్గు, పరవశం కలుగుతున్నాయి. ఏదోగా ఉంది... ఎన్నెన్నో ఊహలు.

తనూ రాజేష్ ఆనందంగా తిరుగుతున్నట్లు... అదీగాక అందరూ ఎంత నవ్వుకున్నారు. కొందరు మొహాన్నే నవ్వారు కూడా. ఇంకతనకి పెళ్ళే కాదనే చెప్పుకున్నారు. ఒక్కొక్క సంబంధం తప్పిపోతుంటే ఒక్కొక్కళ్ళ మొహంలో ఎంత హేళన... ఎంత వెటకారం చూపించారు. వీళ్ళందరికీ పెళ్లి చేసుకుని చూపించాలి.

ఆ తర్వాత కార్యక్రమం చకచకా నిర్ణయం అయిపోయింది.

ఎట్లాగో అయిదువేలు తెచ్చేట్లు, వాటితో రాజేష్ మంచి బట్టలు, బూట్లు వగైరా కొనుక్కుని, ఆమెకి కూడా కొత్త చీరెకొని, టిక్కెట్లు వగైరా ఖర్చులకి మిగిలిన డబ్బు ఉంచేట్లు నిర్ణయించాడు.

ఎక్కడా ప్రియకి అనుమానం కలగకుండా మాట్లాడాడు.

"నేనే ఎంత డబ్బయినా తేగలను. కానీ మమ్మీ ఏమాత్రం పసిగట్టినా అసలుకే మోసం వస్తుంది. అందుకని కట్టుబట్టలుగాక మరో డ్రెస్సు మాత్రం ఎట్లాగో తెచ్చుకుంటాను. ఖర్చంతా నీ చేతే పెట్టిస్తున్నానని నాకూ బాధగానే ఉంది. కానీ ఎన్నాళ్ళులే... పెళ్ళయిపోయిందంటే మనకి ఎదురేలేదు'' అన్నాడు.



విధి లిఖితమో... అపరాధభావంవల్ల ఏర్పడిన జంకో, డబ్బుమీది వెర్రి వ్యామోహమో... పెళ్లిమీద తీవ్రమైన కోరికో... లేక ఇవన్నీ కలిసోగానీ... ప్రియని అతని మాటలు అన్నీ నమ్మేట్లు చేశాయి.

బ్యాంక్‌లో దాచుకున్న సొమ్ము డ్రా చేసింది. అతనికి కొంత ఇచ్చి దాచి ప్రయాణానికి ఉంచమని చెప్పింది. తను ఒకచీరె కొనుక్కుంది. అతను డ్రెస్సులు కొనుక్కున్నాడు.

శుక్రవారం రాత్రికి ఇద్దరూ బెంగుళూరు వెళ్ళాలి అనుకున్నారు.

స్టేషన్లో కూర్చున్నదన్న మాటేగానీ ప్రియకి గుండెలు అదురుతున్నాయి.

ఇన్నాళ్లు ఎంతో గుట్టుగా ఉంచింది. తమ ప్రయాణం గురించి అత్యంత రహస్యంగా ఉంచింది. ఎవరికీ తెలిసే అవకాశం లేదు. కానీ మరి గ్రహపాటునో, పొరపాటునో ఎవరికన్నా తెలిసిపోయిందేమో... వాళ్లు రాజేష్‌ని కలిసి తన సంగతి చెప్పేశారేమో... అతను రాడేమో అనే భయం.

రాజేష్‌కీ అదే భయం.

ఎక్కడ తన గురించి తెలిసిపోయి జారిపో తుందోనని భయం.

భయపడుతూ భయపడుతూ ఇద్దరూ దాదాపు అయిదునిమిషాలు అటూ ఇటూగా స్టేషన్ చేరుకున్నారు. ఒకరినొకరు చూసి అమ్మయ్య అనుకున్నారు. చల్లగా బండి ఎక్కి ప్రయాణమయ్యారు.

రత్నమాల ఇద్దర్నీ చూసి ఆశ్చర్యపోయింది. ఆప్యాయంగా ఆహ్వానించింది.

రాజేష్‌ని డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చోబెట్టి, తను రత్నతో మాట్లాడింది ప్రియ. సంగతంతా చెప్పింది. ఇద్దరం ప్రేమించుకున్నామనీ. పెద్దవాళ్లు ఒప్పుకోరేమోనన్న భయంతో ఇక్కడికి వచ్చామనీ చెప్పింది.

"నువ్వే మా పెళ్లి చెయ్యాలి రత్నా. నీ మేలు జన్మజన్మలకీ మర్చిపోలేను'' అంది.

"తప్పకుండా చేస్తాను ప్రియా. కానీ నువ్వు అనవసరంగా భయపడ్తున్నావు. అతనివైపువాళ్లు ఒప్పుకోరేమోగానీ, మీవాళ్లు ఎందుకు ఒప్పుకోరంటావు? పైగా మీ కులాలు కూడా ఒకటే అంటున్నావు. పెద్దవాళ్లు ఇంకేం అభ్యంతరాలు చెప్తారు? వాళ్లు పాపం, నువ్వు ఏమైపోయావోనని ఎంత భయపడ్తున్నారో... నీకోసం వెతుక్కోరూ... కనీసం వాళ్లకైనా చెప్పాల్సింది. నీ పెళ్లి కళ్లారా చూడాలని వాళ్లకు మాత్రం ఉండదా?" అన్నది.

"ఉంటే ఉందిలే. ఒకళ్ళకి తెలుస్తే పదిమందికి తెలుస్తుంది. అందుకే అసలు ఎవరికీ చెప్పలేదు. అదీగాక అతని తల్లిని నిర్లక్ష్యం చేసినట్లు అనుకోదా ఆవిడ... మా వాళ్ళకు చెప్పి ఆవిడకి మాత్రం చెప్పకుండా మోసం చేశానని అనుకోదూ. అందుకే ఎవళ్ళకీ చెప్పకుండా ఊరుకున్నాము'' అంది ప్రియ.

"అయినా..."

"ఏం పర్వాలేదు. నాకు లేని బాధ నీకెందుకు? అయినా ఇంకా ఎన్నాళ్లు. రేపే మా పెళ్ళి జరిపించావంటే వెంటనే ఫోన్‌చేసి చెపుతాం"

"అతను మంచివాడేనా... అన్నీ ఉన్నవాడు అంటున్నావు... ఎందుకింత తొందర? పోనీ అతనికంటూ విడిగా ఆస్తి ఉందా? ఉద్యోగం కూడా లేదుకదా. రేప్పొద్దున్న వాళ్ళమ్మకి కోపం వచ్చి ఆస్థి ఇవ్వనంటే ఎట్లా మరి..."

"ఏడిసింది. ఇవ్వకేం చేస్తుంది. ఒకసారి పెళ్ళంటూ అయ్యాక ఇంకేం చేస్తుంది? అసలు ఇదంతా వాళ్ళ తాతగారి స్వార్జితంట. ఆయన అంతా ఈయనకే ఇవ్వాలని రాసిచ్చేశాడట. దానికేం ఢోకాలేదు. ఏమన్నా పిచ్చివేషాలు వేసిందంటేనా... నా తడాఖా చూపిస్తాను'' దర్పంగా అంది.

పెళ్ళి జరిగిపోతుందని ధీమా ఏర్పడ్డాక ఎక్కడలేని ధైర్యం వచ్చింది ప్రియకి. ఎవరినన్నా తన్నగల శక్తికూడా వచ్చింది.

"అన్నీ చూసుకున్నావా? బాగా ఆలోచించుకున్నావా? నన్ను పెళ్ళి చేయమంటున్నావు కాబట్టి అడుగుతున్నాను. ఏమీ అనుకోకు. నువ్వు మళ్ళీ ట్రబుల్స్‌లో ఇరుక్కోకూడదని నా బాధ. వాళ్ళ వాళ్ళని ఎదిరించగల ధైర్యం అతనికి ఉందా?"

"ఉంది కాబట్టే ఇక్కడిదాకా వచ్చాడు'' రత్న ఇంకేం అడగలేదు.

ప్రియ ఉద్యోగం చేస్తోంది. వయసు కూడా పాతిక దాటింది. చిన్నపిల్లకాదు. అన్నీ నిర్ణయించుకుని అన్నీ తెలుసుకుని అప్పుడు తన దగ్గరకి వచ్చింది. యింకా పసిపిల్లని అడిగినట్లు అడగడం అనవసరం. చేతనైన సాయం చెయ్యాలి అంతే అనుకుంది.

గుడికి వెళ్లి పురోహితుడిని అడిగి వచ్చింది. మర్నాడు పొద్దున్న పది గంటలకి ముహూర్తం ఉంది అన్నాడాయన.

పెళ్లి ఏర్పాట్లకి తనే డబ్బు యిచ్చింది రత్న. పూలదండలు, మంగళసూత్రాలు వగైరా ఏర్పాట్లు చేసింది. కొత్త చీర కొన్నది. అంతా

తనే ఖర్చుపెడుతుంటే ప్రియ చూస్తూ ఊరుకుంది కానీ తన దగ్గరున్న డబ్బు బయటకి తియ్యలేదు.

రాజేష్ చాలా చురుకైన వాడు. అతని బుద్ధి దొంగబుద్ధి. దొంగని దొంగే కనిపెట్టగలడన్నట్లు ప్రియ బుద్ధి అక్కడే, ఆ రోజే కనిపెట్టేశాడు అతను.

ప్రియది ఊరికే వస్తే ఏదైనా పుచ్చుకునే బుద్ధి. తన దగ్గర డబ్బున్నా, భవిష్యత్తులో యింకా బోలెడంత డబ్బుకి తను వారసురాలు కాబోతోందని తెలిసినా కూడా తన ఖర్చు వేరేవాళ్లచేత పెట్టిస్తున్నదీ అంటే చాలా తెలివైంది అయుండాలి.

అతనికి రత్నమాల మీద జాలి కలిగింది. పొద్దున్నే లేపి తలంటిపోసింది రత్న. తర్వాత పూలజడ వేసి పెళ్లికూతురి ముస్తాబు చేసింది. రాజేష్ తనకితానే ముస్తాబు చేసేసుకుని బుగ్గన చుక్కతో సహా పెళ్లికొడుకు వేషంలో అందంగా తయారైపోయాడు.

కార్లో గుడికి తీసుకువెళ్లింది రత్న.

ఫొటోలు తీశారు. పెళ్లి యధావిధిగా జరిగింది. మంగళసూత్ర ధారణ జరగగానే అమ్మయ్య అని నిట్టూర్చారు వధూవరులు.

ఇద్దర్నీ యింటికి తీసుకువచ్చింది రత్న. భోజనాలయ్యాక కాసేపు పడుకున్నారు.

తొలిరాత్రి తన యింట్లోనే ఏర్పాటు చేసింది రత్నమాల.

విరిసిన పువ్వుల మాల జడనిండా పెట్టింది. చక్కగా అలంకరించింది.

అంతటితో ప్రియ జీవితంలో మొదటి అధ్యాయం ముగిసి, రెండో అధ్యాయం మొదలైంది.

పెళ్లికొడుకూ పెళ్లికూతురూ యిదే తమకి తొలి అనుభవం అయినట్లు అమోఘంగా నటించి సన్నివేశాన్ని రక్తి కట్టించారు.

  







"మీ ఫ్రెండ్ పాపం మనకోసం చాలా కష్టపడుతోంది" అన్నాడు రాజేష్.

ఇద్దరూ రత్న యింటికి వచ్చి అప్పటికి నాలుగు రోజులైంది. రకరకాల వంటలు చెయ్యలేక హైరానా పడుతోంది రత్న. ప్రియ ఆమెకి ఏమాత్రం సాయం చెయ్యటంలేదు.

పొద్దున్నే లేవటం కాఫీతాగి కబుర్లు చెప్పుకుని స్నానం, భోజనం అయాక కాసేపు పడుకోవటం, మళ్లీ లేచి టిఫిన్ తిని టీ తాగి ఊరు చూడాలని వెళ్లి రాత్రి ఏ పది గంటలకో యిల్లు చేరటం... ఇదీ వాళ్ల కార్యక్రమం. కాఫీలు పెట్టటం, టిఫిన్లు చెయ్యటం, భోజనం ఏర్పాట్లు చూడటం వీటికే టైమంతా సరిపోతోంది రత్నకి. వంటమనిషి కొన్నాళ్ల క్రితమే మానేసింది. కొత్త మనిషి దొరకక అవస్థ పడుతోంది. అలవాటులేని పని కావటంవల్ల బాగా కష్టంగా ఉంది.

ప్రియ తేలిగ్గా చప్పరించేసింది.

"ఏముంది వంటేగా. ఎట్లాగూ వాళ్లకోసమని వండుకుంటారుగా. మనకోసం స్పెషల్‌గా ఏం చేస్తుంది. ఆ వండేదే ఇంకాస్త వండుతుంది. అంతే" అని తీసిపారేసింది.

"పోనీ ఖర్చు... యిద్దరు మనుషుల ఖర్చు. అదీగాక మన పెళ్లికి ఎంత ఖర్చుపెట్టిందో మూడు రోజులు తిరగకుండానే మర్చిపోయావా"

"ఏం పెడితే... అసలు ఒక పెళ్లి చేస్తే బోలెడు పుణ్యమట తెలుసా! మరి పుణ్యం ఊరికే వస్తుందా!"

ఆ మాటలతో రాజేష్‌కి ప్రియ తత్వం అర్థమైపోయింది.

ఏరు దాటాక తెప్ప తగలేసే రకంలా ఉంది అనుకున్నాడు.

అక్కడితో అతని మనసు మూలలో ఎక్కడో, ఏ దూరతీరానో, ఏ అణుమాత్రమో

ప్రియని మోసం చేశానేమో అనే అపరాధ భావన ఉంటే అది తొలగిపోయింది.

పర్వాలేదు... తెలివి గలదే, అని సంతోషించాడు.

"ఆవిడకి మనం వెళ్లేముందు ఏదన్నా ట్టుచీర కొనిద్దామంటావా?" అన్నాడు.

"అఖ్ఖర్లేదు... అంతగా అయితే తర్వాత చూద్దాం" అంది ప్రియ.

తను వెళ్లి ఒక చీర తెచ్చుకుంది.

తిరుగు ప్రయాణానికి సిద్ధం అయారు.

మర్నాడు పొద్దన్నకల్లా ఇద్దరూ హైదరాబాద్ చేరుకున్నారు.

"ముందు మీ ఇంటికే వెళ్దాం" అన్నాడు రాజేష్.

"అట్లాగే'' అంది.

ఇద్దరూ ఇంటిముందు ఆటో దిగారు. మెళ్లో పసుపు తాడుతో చేతినిండా గాజులతో పెళ్లికళతో పక్కన రాజేష్‌తో దిగిన ప్రియని చూడగానే యింట్లో వాళ్లకి అంతా అర్ధమైపోయింది.

ఇన్నాళ్లూ వాళ్లు ప్రియని గురించి చాలా భయపడ్తున్నారు. మొదటి రోజూ, రెండో రోజూ కూడా ఎవరన్నా ఫ్రెండ్ యింటికి వెళ్లిందేమోనని అందరి ఇళ్లకీ వెళ్లి అడిగారు. ఎక్కడా లేకపోయేసరికి చాలా భయపడ్డారు. పోలీస్‌రిపోర్ట్ యివ్వాలంటే మళ్లీ జంకు. ప్రియ తనంతతానే ఎక్కడికన్నా వెళ్లి ఉండాలి తప్ప మరోటి జరిగి ఉండదని గట్టి నమ్మకం. ఎక్కడికి వెళ్లిపోయిందో ఎవరితో వెళ్లిందో, వాళ్లేం మోసం చేస్తున్నారోనని దడ. వాళ్లు నిజంగా ఆ మూడు రోజులూ నరకం అనుభవించారు. మూడో రోజున ప్రియ ఆఫీసుకి ఫోన్ చేసింది. తను మరో మూడు రోజుల్లో వస్తున్నట్లూ, ఆ తర్వాత సెలవు చీటీ ఇచ్చేటట్లూ ఫోన్‌లో చెప్పింది. కనీసం తన తల్లితండ్రులకి తెలియబరచమని ఎవరికన్నా చెప్పాలన్న బుద్ధి కూడా పుట్టలేదు ఆమెకి. ఆఫీసువాళ్లే గోవిందరావు బాధ చూడలేక ఫోన్ రాగానే ఇంటికి వెళ్లి చెప్పారు.

ఎంతైనా కన్నకూతురు. కడుపు తీపి. ఏమైపోయిందో, ఏ మోసగాడి వలలోనో చిక్కి, ఎక్కడకి చేరిందో... వాడేమన్నా చేశాడేమో... తన మోజు తీరగానే ఏ వ్యభిచార గృహానికో అమ్మిపారేసి తన దారిన తాను చక్కా పోతే... ఏం చెయ్యాలి దేవుడా, అని దేవుణ్ణి ప్రార్థించుకుంటూ గడుపుతున్నారు తల్లితండ్రులు. వాళ్లకి ఆ క్షణంలో ప్రియ తమ కళ్ల ఎదురుగా ఉంటే అంతే చాలనిపించింది. ఏ ఉద్యోగం లేకపోయినా పోనీ, పెళ్లీ గిళ్లీ కాకపోతే మాననీ, నలుగురూ నవ్వితే నవ్వనీగాక... ఏది జరిగినా ఫర్వాలేదుగానీ ప్రియని క్షేమంగా చూస్తే అంతే చాలనుకున్నారు.

అందువల్ల వాళ్లకి ప్రియనీ, రాజేష్‌నీ చూసి ప్రాణం లేచి వచ్చినట్లయింది.

ప్రియ ఏ జంకూగొంకూ లేకుండా లోపలకి నడిచింది.

"నాన్నా, మీ అల్లుడుగారు'' అని పరిచయం చేసింది, తండ్రికి.

గోవిందరావు నిజానికి చాలా సంతోషించాడు. ప్రియ తిరిగి రావటమేకాక పెళ్లి చేసుకుని కూడా వచ్చింది. ఆమెకి యింక పెళ్లి చెయ్యలేమేమోనని భయపడ్డాడు యిన్నాళ్లూ. యిప్పుడు కాస్త ధైర్యంగా ఉంది.

రాజేష్ నమస్కరించాడు.

గోవిందరావు నిండు మనసుతో ఆశీర్వదించాడు.

"ప్రయాణం చేసి బడలికగా ఉండి ఉంటుంది. ముందు స్నానం చేసి టిఫిన్ తిని కాఫీ తాగండి'' అన్నాడు.

"అట్లాగే''

"ఆఫీసుకి వెళ్లి లీవ్ అప్లికేషన్ యిచ్చిరా'' అన్నాడు రాజేష్.

"సరే' అంది ప్రియ.

అతను స్నానం చేస్తుండగా ప్రియ తండ్రితో అన్నీ చెప్పింది.




"వాళ్లు చాలా గొప్పవాళ్లు నాన్నా. వాళ్ల మమ్మీ ఒప్పుకోరని పారిపోయి పెళ్లి చేసుకున్నాం" అంది గర్వంగా.

"ఒక్క మాట చెపితే పోయేదిగా తల్లీ. అనవసరంగా ఎంత టెన్షన్ అనుభవించాం చెప్పు'' అన్నాడు గోవిందరావు.

"లీక్ చెయ్యటం యిష్టం లేకపోయింది''

"అతనెవరో... ఏమిటో... ఏం పరిచయం ఉందని నువ్వింత తొందరపడ్డావు''

"తొందర పడలేదు. అతను నాకు దాదాపు నెల రోజుల్నుంచీ తెలుసు. మన కులమే. నీకేం అభ్యంతరం"

"యిప్పుడు నేను ఆలోచిస్తున్నది కులమతాల గురించికాదు. మంచితనం గురించి. కాస్త మాకొక్కమాట చెప్తే మంచీ చెడూ విచారించే వాళ్లంకదా''

"ఈలోపల యింకోళ్లు వచ్చి అతన్ని తన్నుకు పోయి ఉండేవాళ్లు. నాన్నా మీరేం బాధపడకండి. రిస్కు తీసుకోంది లాభంలేదు. నేను రిస్క్ తీసుకునే ఈ పని చేశాను. మంచో చెడో నేనే అనుభవిస్తాను. మీరేం భయపడకండి''

"చెడంటే... ఏముంటుందనుకుంటున్నావు''

"ఏముందీ... వాళ్లమ్మ మమ్మల్ని యింట్లోకి రానివ్వక పోవటమో... కొన్నాళ్లు నన్ను కోడలిగా అంగీకరించకపోవటమో చేస్తుంది. ఏం ఫర్వాలేదు. యిట్లాంటి బాధలేమైనా వస్తాయనే ఆయన యిప్పుడే ఉద్యోగానికి నన్ను రాజీనామా చెయ్యొద్దన్నారు. లేకుంటేనా... మాకున్న ఆస్తికి ఈ బోడి ఉద్యోగం ఎప్పుడో రిజైన్ చేసి పారేసుండేదాన్ని... కొన్నాళ్లు కానీ... అన్నీ సద్దుమణిగాక హాయిగా రిజైన్ చేస్తాను'' అంది ప్రియ.

గోవిందరావు యింకేం మాట్లాడలేదు. ప్రియకి ఉద్యోగం ఉంది. ఈ రోజుల్లో ఒక్క జీతం మీద బతుకుతున్న వాళ్లెందరు లేరు. వాళ్లల్లాగే వీళ్లూ సరిపెట్టుకోగలరు. అతని తల్లి ఆస్తి ఇవ్వకపోయినా ఫర్వాలేదు అనుకుని ఊరుకున్నాడు.

ప్రియ కొత్తగా కొన్న చీర తీసి కట్టింది. దర్జాగా తయారై రాజేష్‌తో సహా ఆఫీసుకి వెళ్లింది.

అందంగా, హుందాగా ఉన్న రాజేష్‌ని ఆఫీస్‌లో అందరికీ చూపించింది గర్వంగా.

అతనికి ఉన్న ఆస్తిపాస్తులన్నీ ఏకరువు పెట్టింది. అతనికి చాలా డబ్బుందనీ, అమెరికాకి కూడా వెళ్లి వద్దామని చూస్తున్నాడనీ, గొప్పగొప్ప సంబంధాల్ని కాదని, ప్రియని ప్రేమించి పెళ్లి చేసుకున్నాడనీ తెలిసి అందరికీ మొహాలు కాస్త వన్నె తగ్గాయి. అది గమనించి ప్రియ ఆనందంగా నవ్వుకుంది.

"ఎందుకీ ఉద్యోగం యింక హాయిగా రిజైన్ చేసి పారెయ్యక" అన్నారు కొందరు.

"పారేస్తాను కానీ కొన్నాళ్ల తర్వాత" నవ్వింది ప్రియ.

"పార్టీ ఎప్పుడు''

"మీరెప్పుడంటే అప్పుడు'' అంది ప్రియ.

"ఇవాళ సాయంత్రం యివ్వరాదూ'' అన్నారు. ప్రియ రాజేష్ వైపు చూసింది.

"ఇవాళ కుదరదు. మాకు వేరే ఎంగేజ్‌మెంట్ ఉంది'' అన్నాడతను.

"మరెప్పుడు''

"ఇప్పుడు కాస్త బిజీగా ఉన్నాను. బోల్డన్ని వ్యవహారాలు చూసుకోవాలి. దాదాపు వారంనుంచి ఊళ్లో లేనుకదా! అన్నీ పెండింగ్ ఉండిపోయాయి. ఇప్పుడైనా చూడకపోతే మా మమ్మీకి కోపం వస్తుంది. ఏం అనుకోకండి. కాస్త వీలు చూసుకుని గ్రాండ్‌గా పార్టీ అరేంజ్ చేస్తాం" అన్నాడు రాజేష్.

"సరేలెండి'' అన్నారు వాళ్లు.

ఆరోజు వరకు సెలవు ఇచ్చి, మర్నాటి నుంచీ ఆఫీసుకి వచ్చేట్లు చెప్పి, యిద్దరూ తిరిగి వచ్చారు.

అక్కడ్నుంచి వచ్చేస్తుంటే ప్రియ అడిగింది.

"పార్టీ ఎప్పుడండీ. తొందరగా ఇస్తే బావుంటుంది. నాకైతే చాలా గొప్పగా ఫంక్షన్ చేసి అందర్నీ ఆ ఫంక్షన్‌కి పిలిచి, పెద్ద పట్టుచీర కట్టుకుని మంచి నగలు పెట్టుకుని ఆ పార్టీలో అందర్నీ చూసి చూశారా మావారెంత గొప్పవారో అని చూపిద్దామని ఉంది"

"ఏడిసినట్లుంది. మనకున్నది మనం ఎంజాయ్ చెయ్యటానికిగానీ ఒకళ్లకి చూపించి గొప్పలుకొట్టుకోడానికా. నాకీ పార్టీలు అవీ యిష్టం ఉండదు. వీలైనంత సింపుల్‌గా ఉండటమే నాకిష్టం"

"అంతేలెండి" అంది ప్రియ.

రాజేష్ మౌనంగా నడుస్తున్నాడు.

"మీ ఇంటికి ఎప్పుడు వెళ్దాం" అంది ప్రియ.

"దేనికీ"

"మీ మమ్మీ ఆశీస్సులు తీసుకోవటానికి"

"ఏం నాకు లేని తొందర నీకెందుకు" కొద్దిగా కోపంగా అడిగాడు.

ప్రియకి అతనికి కోపం వచ్చినందుకు ఆశ్చర్యం కలిగింది.

"ఆవిడచేత తిట్లు పడలేదని నీకు బాధగా ఉందా" నవ్వుతూ అడిగాడు రాజేష్.

"లేదండీ... పెద్దవాళ్ల ఆశీస్సులు తీసుకోవటం మంచిదికదా అందుకని"

ప్రియ అసలు ప్రేమ దేనిమీదో రాజేష్‌కి అర్థం అయింది.

నిజానికి పెద్దలన్నా, అసలెవరన్నా ప్రియకి ఎట్లాంటి సెంటిమెంట్స్ లేవని అతను ఈ వారంలో గ్రహించాడు. ఇప్పుడు తన తల్లి దగ్గరకు తీసుకువెళ్తే అక్కడ ఉండే మేడా, నగలూ, కారూ అన్నీ వాడుకుని ఆనందించాలన్న తొందర తప్ప ప్రియలో మరొకటిలేదు.

"వెళ్దాంలే. కాస్త నిలదొక్కుకోనీ ముందు"

"అంటే"

"ఏముందీ... ఒక ఇల్లు తీసుకుందాం. కావల్సిన సామాన్లు కొనుక్కుందాం. కాపురం పెట్టామనుకో. అప్పుడు ఆవిడ యింకేం మాట్లాడలేదు. ఎట్లాగూ విడిగా ఉండటానికి అలవాటుపడ్డాడుకాబట్టి నా దగ్గర ఉండటానికి వీల్లేదు అని బెదిరించి లాభం లేదని తెలుసుకుంటుంది. హాయిగా యింత యిల్లు ఉండగా అక్కడెందుకురా ఉండటం అని బతిమాలి ఉంచేస్తుంది" అన్నాడు రాజేష్.

ఎప్పుడెప్పుడు వెళ్లి ఆ పెద్ద బంగళాలో నివసిద్దామా, కార్లో తిరుగుదామా అని ఉంది. అతను ఇట్లా వాయిదా వెయ్యటం యిష్టంలేకపోయినా వాదిస్తే ఏమనుకుంటాడోనని ఊరుకుంది.

★ ★ ★

ప్రియకి పెళ్లి జరిగినందుకు పార్వతమ్మకి చాలా హాయిగా ఉంది. ఇన్నాళ్లూ 'అయ్యో 'దీనికి పెళ్లి కాలేదే' అన్న బాధ, ఇక కాదేమోననే భయం, మ్మన తర్వాత దీని గతేంటి, ఎప్పుడేం జరుగుతుందో అనే ఆందోళన ఉండేవి. ఎవరన్నా 'మీ అమ్మాయి పెళ్లి ఎప్పుడూ' అని అడిగితే సిగ్గుగా అనిపించేది. ఇప్పుడు ఆ బాధలేదుకదా, అనుకుంది.

సాధారణంగా పెళ్లిని ఒక ముఖ్యవిషయంగా, జీవితంలో జరిగిపోవల్సిన ఘట్టంగా అనుకుంటారు. పెళ్లి జరగటమే ఒక పెద్ద సమస్యగా భావించటం జరుగుతుంది. పెళ్లి జరగగానే అమ్మయ్య అన్ని సమస్యలూ తీరిపోయాయి అనుకుంటారు. కానీ నిజానికి సమస్య అనేది వివాహంతోనే మొదలవుతుందేమో అని ఎవరూ ఆలోచించరు.

మానవుడు ఆశావాది కావటం ఇందుకు కారణం కావచ్చు. ఏ పనైనా కాలేదని బాధపడటం సహజం. అది అయ్యాక అయిపోయిందికదా అని ఆనందించటం అంతే సహజం. అంతేగానీ, ఏం జరుగుతుందో, ఏం కొంపమునుగుతుందో అని ఒక శుభకార్యం




జరిగాక ఎవరూ అనుకోరు.

పార్వతమ్మ కూడా అట్లాగే ఆనందించింది. ఇంటికోసం వెతకటం మొదలుపెట్టింది ప్రియ.

ఎక్కడ చూసినా బోలెడు అడ్వాన్సు అడుగుతున్నారు.

"ఎట్లాగూకట్నం ఇవ్వలేదు. ఇంటికి కావల్సినవి కొని, అడ్వాన్సు ఇచ్చి మనమే గృహప్రవేశం చేయిద్దాం. ఒక పదివేలు దానిపేర బాంక్‌లో వేస్తే సరి. ఏదన్నా అవసరానికి వాడుకుంటారు'' అన్నది పార్వతమ్మ.

గోవిందరావు సరేనన్నాడు. చివరికి ఒక ఇల్లు దొరికింది. అడ్వాన్సు ఇచ్చి, మంచాలూ కంచాలూ వగైరా కొని ఆ ఇంట్లో దిగారు.

అన్నీ సర్ది, ఏవి ఎట్లా వాడాలో నేర్పించింది పార్వతమ్మ. సాంబారు పొడీ, చారుపొడీ, కారంపొడీలాంటివన్నీ డబ్బాల్లో పోసింది.

మొదటి రెండురోజులూ తనే వంటచేసి పంపించింది పార్వతమ్మ. మూడోరోజునుంచీ వాళ్లే వండుకుంటారులెమ్మని ఊరుకుంది. అక్కడినుండీ ప్రియపాట్లు మొదలయ్యాయి.

ప్రియకి వంటరాదు. కనీసం కాఫీ పెట్టడం కూడా రాదు ఇంతవరకూ.

రాత్రి పదింటికి ముసుగు బిగించి పడుకుంటే మళ్లీ మర్నాడు ఏడున్నరకి లేవటం... లేచాక తల్లి కలిపి ఇచ్చిన కాఫీ తాగి, ఆవిడ వేడినీళ్లు పెడితే స్నానంచేసి, అప్పటినుంచీ మేకప్ మొదలుపెట్టి తీరిగ్గా జడ వేసుకుని, స్టైల్‌గా చీరె కట్టుకుని, అమ్మ పెట్టిన భోజనం విసుక్కుంటూ తిని, తల్లి టిఫిన్ బాక్స్ అందిస్తే విసురుగా లాక్కుని ఆఫీసుకి పోవటం...

ఆఫీసునుంచి వచ్చాక తీరిగ్గా టీతాగి, రాత్రికి తాపీగా భోజనం చేసి ముసుగు బిగించటం... ఇదీ... ఇంతవరకూ సుప్రియ జీవితంలో జరిగిన రోజులు...

ఇప్పుడు హఠాత్తుగా కాలం మారిపోయింది. ఇంతవరకూ స్నానం వెచ్చగా వేడినీళ్లతో చేసి పారెయ్యటమేగానీ అవి ఎక్కడ్నుంచి వస్తాయి అని ఆలోచించింది లేదు. కాఫీలు తాగటం, టిఫిన్లు తినటం, భోజనం చేసెయ్యటం అవి బాగా లేకుంటే అరవటం, అలగటం... ఒక్కోసారి మూడ్ బాగాలేకపోతే అన్నీ బాగున్నా అరిచి గోలచెయ్యటం, ఇవి తప్ప అవి తయారుచేయటం ఎట్లాగ అని బుర్ర ఉపయోగించాల్సి వచ్చింది ఇప్పుడుమాత్రమే. వంట ఎట్లా చెయ్యాలని ఆలోచించటం మొదలుపెట్టింది.

అలవాటులేని పని కావటంవల్ల చేతగాక కాఫీ ఏడిసినట్లు తయారయింది.

రాజేష్ అది తాగి కోపంగా అరిచాడు.

ప్రియకి ఏంచెయ్యాలో తోచలేదు. అక్కడితో కాలేదుకదా! ఇంక అసలుపని భోజనం తయారుచెయ్యటం.

అన్నం మాడింది.

కూర ఉడకలేదు.

ఎట్లాగో పచ్చడి వేసుకునిఅన్నం తిన్నామనిపించారు. ఒకటొకటే సర్దుకునేసరికి టైమ్ అయిపోయింది.

ఇన్నాళ్లూ తల్లివల్ల ఎంత సుఖ పడిందో అర్థమైంది. రెండురోజులకి ఇక సుప్రియ చేసిన వంట తినటం తనవల్ల కాదని డిక్లేర్ చేశాడు రాజేష్.

"మరేం చెయ్యాలి'' అంది ప్రియ.

"హొటల్‌నుంచి కారియర్ తెచ్చుకుందాం" అన్నాడు రాజేష్.

ప్రియ ప్రాణం లేచి వచ్చినట్లయింది. నిజానికి తనవంట తినటం తనవల్ల కూడా కావటంలేదు. హొటల్ భోజనం తల్చుకుని నోరు ఊరింది.

దగ్గర్లో వున్న హొటల్‌నుంచి ఫ్లాస్కులో కాఫీ, కారియర్‌తో భోజనం తెస్తున్నాడు రాజేష్.

"ఎన్నాళ్లీ కష్టాలు'' అంది ప్రియ.

"నువ్వు వంట సరిగా చేసేంత వరకు''

"అదిప్పుడప్పుడే రాదు. కొన్నాళ్లు గడిస్తే

గానీ ఎవరూ వంట సరిగ్గా చెయ్యలేరు'' అంది ప్రియ.

"అవును నిజమే. కానీ కొన్నాళ్లపాటు రెగ్యులర్‌గా చేస్తేగానీ వంటరాదు. వంటొచ్చేదాకా తినలేంకాబట్టి హొటల్‌నుంచి తెచ్చుకుంటూ ఉంటాం. దాంతో రెగ్యులర్‌గా చెయ్యలేం. వంట ఎప్పటికి బాగా వస్తుందో ఏమో!"

"అందుకే చెప్తున్నాను. మనం మీ ఇంటికి వెళ్లిపోతే సరిపోదా. వంటమనిషి చేసిపెడ్తూ ఉంటే హాయిగా తిని కూర్చోక ఎందుకీ కష్టాలు?"

"వెళ్లటానికి మా అమ్మగారు లేరు''

"ఎక్కడికి వెళ్ళారు?"

"తీర్థయాత్రలకి''

"ఎప్పుడొస్తారు?"

"ఏమో...?"

ప్రియ కాసేపు మౌనంగా ఉంది.

"అసలు మీ అమ్మగారితో కలిసి మాట్లాడారా?" అంది.

"మాట్లాడాను''

"ఎప్పుడు''

"మనం ఊరినుంచి రాగానే''

"నాకు చెప్పలేదేం మరి'' అంది ప్రియ.

"అన్నీ నీకు చెప్పాలని రూల్ ఉందా?" కరుగ్గా అడిగాడు.

"ఎందుకండీ కోపం తెచ్చుకుంటారు?"

"మరేం చెయ్యమంటావు? ఆవిడతో మన పెళ్లి సంగతి చెప్పాను. నామీద విరుచుకుపడి బి.పి. వచ్చి పడిపోయిందావిడ. సపర్యలు చేసి డాక్టర్ని పిలిచాను. బాగా రెస్ట్ తీసుకోవాలని చెప్పాడు. ఆవిడ వినకుండా నామీద కోపంతో శ్రమ అని తెలిసికూడా యాత్రలకి వెళ్లింది. పోనీ అక్కడన్నా శాంతిగా ఉండనీ'' అన్నాడు రాజేష్.

"అదికాదండీ... ఆవిడకి అంత కోపం ఎందుకూ? అయినా మరి ఆవిడ లేకుంటే ఇల్లెవరు చూసుకుంటారు? పోనీ, మనం అక్కడకు వెళ్లి ఉందామా...?"

"అక్కర్లేదు... మా మామయ్య ఉన్నాడు లే... అవన్నీ చూసుకునేందుకు. ఖర్మ... ఆయన కూడా నామీద కోపంగానే వున్నాడు. నిన్ను చేసుకుని నావాళ్లందరికీ దూరం అయ్యాను'' అన్నాడు కోపంగా రాజేష్.

ప్రియ బిత్తరపోయింది.

ఎందుకోగానీ అతనికి కోపం వచ్చిందంటే చాలా భయం వేసింది.

ప్రియ ఫ్రెండ్ హారిక అని ఉంది. ఆ అమ్మాయిది కూడా మధ్యతరగతి కుటుంబమే. బాగా డబ్బున్న ఒకబ్బాయిని ప్రేమించింది. యిద్దరూ పెళ్లిచేసుకున్నారు. కొన్నాళ్లు బాగానే ఉన్నారు. ఇంతలో ఆ అబ్బాయి తరపువాళ్ళు వచ్చి, అతన్ని ఎట్లా ఒప్పించారో, ఏం చెప్పారోగానీ అతను చెప్పా చెయ్యకుండా వాళ్లతో వెళ్లిపోయాడు. హారికని వాళ్లు బాగా బెదిరించి, భయపెట్టి విడాకులు తీసుకుని వెళ్లిపోయారు. హారిక ఒంటరిగా ఈ సమాజంలో మిగిలిపోయింది.

తన పరిస్థితి కూడా అంతేకాదు కదా.

ప్రియకి చాలా భయం వేసింది.

అసలే మధు సంఘటన, ఆ తర్వాత వరుసగా పెళ్ళికొడుకులందరూ సిరాకరించటం వీటితో యిప్పటికే తను కుంగిపోయి ఉంది. ఇంకో దెబ్బ భరించేశక్తి తనకి లేదు.

రాజేష్ దూరమైతే తను భరించలేదు. పోనీ, కొన్నాళ్ళు ఆశలు చంపుకుంటే సరి.

★ ★ ★

నెలరోజులు గడిచేసరికి బాంక్ బాలెన్స్ బాగా తగ్గిపోయింది.

రాజేష్ తన మిత్ర బృందంతో యథాప్రకారం తిరగటం మొదలుపెట్టాడు.

యిదివరకులాగానే సిగరెట్లు, సీసాలు అన్నీ మొదలయ్యాయి.




"పెళ్ళి చేసుకున్నావటగా. మాకు ఒక్క మాట అయినా చెప్పలేదేం" అన్నారు వాళ్ళు.

"చెప్పినప్పుడల్లా కాలేదు. అందుకే ఈసారి ఎవరికీ చెప్పకుండా చేశాను." అన్నాడు నవ్వుతూ.

"మంచిపని చేశావు. పోనీలే... సక్సెస్ అయింది కదా. ఎట్లా చేస్తే ఏం పోయింది. యింతకీ ఆవిడేం చేస్తున్నది'' అడిగాడు.

"ఉద్యోగం చేస్తున్నది. క్లర్కో, టైపిస్టో ఏదో చెప్పింది''

"ఏడిసినట్టుంది. కాస్త ఆగి ట్రై చేసుకుంటే ఏ లక్షాధికారి పిల్లో దొరికేది'' అన్నాడు ఒకడు.

"ఏమీ...అన్నీ అయ్యాకేగా ఈవిడ్ని చూసింది."

" అంతేలే... పోనీ ఏదో ఒకటి. సెటిల్ అయ్యావు చాలు. వెనకాల అసలు ఆస్థి ఏంటేదా''

"ఏంలేనట్లే. ఉంది."

"ఏదో సరిపెట్టుకో. ఏం చేస్తాం" నిట్టూర్చారు వాళ్ళు.

బాంక్‌లో వెయ్యి రూపాయలు ఉంటే అవి డ్రా చేసి వాళ్ళకి పార్టీ చేశాడు.

శుభ్రంగా తాగాడు వాళ్ళతో కలసి.

ఆ రాత్రికి వాళ్ళతో అక్కడే పడుకున్నాడు.

రాత్రి అతను ఇంటికి రాకపోయేసరికి ప్రియ బాగా గాభరా పడిపోయింది.

అతను యింటికి తిరిగివస్తే చాలనిపించింది.

హారిక భర్తలాగా వదిలిపెట్టి వెళ్ళిపోలేదు కదా! ఆమె గుండె ఆ ఆలోచనల్తో బరువెక్కిపోయింది.

మర్నాడు అతను రావటం చూసి ఆనందంతో పొంగిపోయింది.

"ఎక్కడికెళ్ళారండీ'' అంది ప్రేమగా.

ఆమెతో కాస్త కరుగ్గా ప్రవర్తిస్తే భయభక్తుల్లో ఉంటుందని అతనికి అర్థమైపోయింది కాబట్టి సీరియస్ పోజ్ పెట్టాడు.

"ఎక్కడికెళ్తే ఏంలే' అన్నాడు.

"అదేంటండీ... మీరు రాత్రికి రాకపోయేసరికి నేనెంత భయపడ్డానో తెల్సా'' అంది.

"ఎందుకూ భయపడ్డం. నేనేం చచ్చాననుకున్నావా'' అన్నాడు కోపంగా.

"ఎందుకండీ అట్లా అంటారు''

"అనకేం చెయ్యమంటావు. అక్కడ మామయ్యేమో అసలు యిది పెళ్ళేకాదు నిన్ను వదిలెయ్యమని గొడవ గొడవ చేస్తున్నాడు. అమ్మమ్మో తీర్థయాత్రలనుంచి తిరిగిరాకుండా భీష్మించుకు కూర్చుంది. చేతిలో డబ్బులేదు. నిన్ను వదిలేస్తే తప్ప వీల్లేదని మామయ్య అరిస్తే నాకు కోపం వచ్చి ఆయన్ని కొట్టాను. కిందపడి దెబ్బతగిలింది. పోన్లే పాపం ముసలాడు అని నాకే జాలేసి డాక్టర్ని పిలిపించి కట్టుకట్టించాను. డాక్టరు రాత్రంతా మేలుకుని మందులు వేస్తూ కనిపెట్టి ఉండమన్నాడు. ఉన్నాను. తప్పా. యిక్కడికి రాగానే ఏడుపు మోహంతో ఎదురయ్యి ఎక్కడికి వెళ్ళారండీ అని అడుగుతే నాకెంత కోపం వస్తుంది చెప్పు'' అన్నాడు రాజేష్.

"యిప్పుడు ఎట్లా ఉంది ఆయనకి'' అంది ప్రియ. మామూలుగా అయితే ఎవడికి ఏరోగం వచ్చినా క్షేమసమాచారాలు అడిగే అలవాటు లేదు ప్రియకి. కానీ యిప్పుడు వాళ్ళమామయ్య గురించి అడగకపోతే రాజేష్‌కి కోపం వస్తుందేమోనని అడిగింది.

"బాగానే ఉంది. లేచి మాట్లాడ్తున్నాడు. ఏదోలే. మంచివాడు కాబట్టి ఊరుకున్నాడు. మరోడైతే... పోలీస్ రిపోర్ట్ యిచ్చి నామీద కేసు బనాయించేవాడు. ఏదో అరుస్తాడు గానీ మామయ్య చాలా మంచివాడు. నేనంటే ఎంతో ఆపేక్ష. అట్లాంటి మామయ్యని కొట్టాను. నా చేతులు విరిగిపోనూ... యిదంతా నీ గురించే. నిన్ను తక్కువచేసి మాట్లాడేసరికి యిట్లా చేశాను..."

"మీకు నేనంటే ఎంత ప్రేమండీ. నాకోసం మీ మామయ్యని కొట్టారా..."

"అవును. నీకోసం మామయ్యనేం ఖర్మ. దేవుణ్నయినా ఎదిరిస్తాను'' అన్నాడు రాజేష్.

ప్రియ పొంగిపోయింది.

భోజనం చేసి యిద్దరూ బయటకి బయల్దేరారు.

రాజేష్ ఫ్రెండ్స్‌దగ్గరకు...

ప్రియ ఆఫీసుకి...

మరో మూడు వారాలు గడిచాయి.

జీతం మొదటివారంలోనే ఖర్చయిపోయింది.

బాంక్‌లో డబ్బు అయిపోయింది.

డబ్బు సమస్య వచ్చింది.

"మీ అమ్మనడిగి డబ్బు తీసుకురా'' అన్నాడు రాజేష్.

పార్వతమ్మ అయిదు వందలు యిచ్చింది.

అవి ఒక్కరోజులో ఖర్చుపెట్టేశాడు రాజేష్.




రాజేష్, ప్రియ బస్‌స్టాప్‌లో నిలబడితే మహేంద్ర చూశాడు.

గబగబా రాజేష్ దగ్గరకు వచ్చాడు.

"నీతో పర్సనల్‌గా మాట్లాడాలి. సాయంత్రం రాజ్‌కేఫ్‌కి రా'' అన్నాడు.

"ఓ.కే' అన్నాడు రాజేష్.

ఏం మాట్లాడాలి మహేంద్ర... రాజేష్‌కి అర్థంకాలేదు.

అన్నప్రకారం సాయంత్రం వెళ్ళాడు.

అప్పటికే అందరూ కూర్చుని ఉన్నారు.

రాజేష్ కోసమే ఎదురుచూస్తున్నట్లున్నాయి వాళ్ళ మొహాలు.

మహేంద్ర, సుధీర్, రాకేష్.

రాజేష్ రావటం చూసి అంతా 'హాయ్' అని అరిచారు.

"రాజేష్... కూర్చో'' అన్నాడు మహేంద్ర.

రాజేష్ కూర్చున్నాడు.

అందరివైపూ చూశాడు ఒకసారి.

అంతా అదోలా ఉన్నారు. ఎందుకో అర్థం కాలేదు.

"ఏంటి అలా ఉన్నారు...'' అన్నాడు రాజేష్.

మహేంద్ర గొంతు సవరించుకున్నాడు.

"రాజేష్... పెళ్లి చెప్పకుండా చేసుకున్నావు. బాగానే ఉంది. కానీ ఒక్కమాట. నువ్వు చెప్పి చేసుకుంటే బాగుండేది''

"నువ్వేమంటున్నావో అసలు అర్థం కావటంలేదు''

"చెపితే మాకు తెలిసిన సంగతి నీకు చెప్పేవాళ్ళంకదా''

"ఏమిటా సంగతి?"

"రాజేష్... నీకు మీ ఆవిడ చెప్పిందో లేదో... మాతో మాత్రం అనలేదు నువ్వు. చెపితే నీ పెళ్ళి ఆపివుండేవాళ్ళం. మీ ఆవిడ పెళ్ళికిముందు మధు అనే అతనితో శుభ్రంగా తిరిగింది'' అన్నాడు మహేంద్ర.

"షటప్'' అరిచాడు రాజేష్.

"రాజేష్... ప్లీజ్... శాంతంగా విను. నేను నీ ఫ్రెండ్‌ని, నువ్వు బాధపడటం నాకు ఇష్టమా చెప్పు. ఆవిడ్ని ఆ మధుతో నేను కళ్ళారా చూశాను. మామూలు స్నేహమే అని సరిపెట్టుకునే వాడినేమో. కానీ ఒకసారి నేను హెూటల్లో కూర్చుని వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్నవి విన్నాను. ఆవిడ నెల తప్పిందిట




ఏడుస్తూ చెపుతుంటే వాడు ఆబార్షన్ చేయిస్తానని ఓదారుస్తున్నాడు. నువ్వు పెళ్ళికిముందు మాతో మాటమాత్రం అంటే ఎంత బాగుండేది. ఎంతపని జరిగిందో చూడు'' అన్నాడు.

రాజేష్‌కి రక్తం మరిగిపోతోంది.

"దాన్ని నరికేస్తాను'' అని అరిచాడు.

"వద్దు. ఊరుకో..." అందరూ కలిసి ఓదార్చారు. ఏం చెయ్యాలి? ఎంత మోసం... రాజేష్ గుండె మండిపోవటం మొదలుపెట్టింది.

టీ, టిఫిన్ తెప్పించారు.

అంతా తిన్నాక కబుర్లు చెప్తూ కూర్చున్నారు.

ఇప్పుడు రాజేష్‌కి కోపం తగ్గలేదు. కానీ ఆవేశం తగ్గిపోయింది.

"అసలెందుకు చెప్పలేదు మాకు?" అడిగాడు సుధీర్ మెల్లగా.

"చెప్పానుగా. చెప్తే కలిసిరాదనుకున్నాను. అంతే. అందుకే ఎవరికీ చెప్పలేదు. మా అమ్మకి కూడా''

అంతా నిట్టూర్చారు.

"రాజేష్... మేము చెప్పింది మర్చిపో. ఏం చేస్తాం. సర్దుకుపోవాలి. నువ్వు ఏది జరిగినా మన మంచికే అనుకో. మీ ఆవిడకి ఇవాళ కాకపోతే రేపైనా నువ్వు ఏమీ లేనివాడవనీ, అంతా అబద్ధాలే చెప్పావనీ తెలిసిపోతుంది. అప్పుడు నిన్ను నిలదీసి అడిగితే నువ్వు ఈ విషయాన్ని జోకరు ముక్కలా ఉపయోగించు. అంతే. ఈ లోపల మాట తూలకు. నీ మంచికి చెప్తున్నా'' అన్నాడు మహేంద్ర.

నీరసంగా తల ఊపాడు రాజేష్.

కాసేపు కబుర్లు చెప్పి, ఏ సమస్య వచ్చినా తాము ఉన్నామని, మర్చిపోవద్దని భుజంతట్టి చెప్పి వెళ్ళిపోయారు అంతా.

నీరసంగా లేచి నిలబడ్డాడు రాజేష్.

ఇంటికి వెళ్ళి పడుకున్నాడు.

ప్రియని నమిలి మింగేద్దామన్నంత కోపంగా ఉంది. ఇందుకన్నమాట అంత తొందర పడింది.

నిలదీసి అడిగేస్తే...

లాభంలేదు.

అంతకన్నా మహేంద్ర చెప్పినట్లు సమయం వచ్చినప్పుడు అడిగితేనే సుఖం...

ఏమైనా సహించవచ్చుగాని, ఇట్లాంటి ఆడదాన్ని ఎవరు మాత్రం సహిస్తారు.

ఖర్మ... తను తీసుకున్న గోతిలో తనే పడ్డాడన్నమాట.

ఇంతకీ ఆ మధు ఇంకా ఇక్కడే ఉన్నాడా... వాడితో ఇంకా ఈవిడ లీలలు సాగిస్తూనే ఉందా...?

ఏం చెయ్యాలి... ఎవరికన్నా చెప్పినా నవ్వుతారు. తగిన శాస్తి జరిగింది పొమ్మంటారు.

ఏం చెయ్యలేడు తను.

సాయంత్రం అయింది.

ప్రియ వచ్చింది.

కాఫీ పెట్టి ఇస్తే ఏడిసినట్లుందని పారపోశాడు.

ఆమె మొహం చూస్తే అసహ్యం అనిపించింది.

అన్నం పెడితే పళ్లెం విసిరికొట్టాడు.

అతనికి ఇంతకోపం ఎందుకు వచ్చిందో అర్థంకాని ప్రియ బిత్తరబోయి దిగులుగా కూర్చుంది.

ప్రియ దిగులుగా ఉండటం చూసి అతనికి ఎందుకో సంతోషం కలిగింది.

★ ★ ★

తల్లి గురించి ప్రియ అడుగుతుంటే రాజేష్‌కి చప్పున ఒక ఆలోచన తోచింది.

వెంటనే దాన్ని అమలుపరిచాడు.

చంద్రయ్య మామ దగ్గరకు వెళ్ళి చెప్పాడు.

"మామా... నువ్వు పాతబట్టలు... అంటే, అసలు మనకున్నవన్నీ పాతవే అనుకో. అయినా ఉన్న బట్టల్లో కాస్త పాతవి కట్టుకుని మా ఇంటికి రా. మా ఆవిడ్ని నీకు పరిచయం చేస్తాను. మా నౌకరువని చెప్తాను. నువ్వు అట్లాగే నటించాలి. సరేనా. కాసిని కూరలూ పళ్లూ కొనుక్కురా. మన తోటలో కాసినవని చెపుదాం" అన్నాడు కొంత డబ్బు ఇచ్చి.

చంద్రయ్య సరేనన్నాడు.

"బాగా చెయ్యగలవా నీ పోర్షన్... రసాభాస అయ్యేట్లు ఉంటే పోనీ, ఇంకొకర్ని చూసుకుంటాను'' అన్నాడు.

"నువ్వే చూస్తావుగా. యమగా చేస్తానుండు'' అన్నాడు చంద్రయ్య.

మర్నాడు చంద్రయ్య పొద్దున్నే వచ్చేశాడు. పైకి కట్టిన పంచ, పాత చొక్కా, తలకి తువాలు చేతిసంచీలో కూరగాయలు, మెళ్ళో వేళ్ళాడుతున్న పొట్లకాయతో సిన్మాల్లో నౌకరు వంటవాడిలా ప్రత్యక్షమయ్యాడు.

"అబ్బాయిగారున్నారామ్మా'' అన్నాడు ప్రియని చూసి.

"ఎవరు... ఎవరు కావాలి?" అంది ప్రియ.

"రాజేష్ బాబుగారు''

"ఉన్నారు. లోపలకి రండి'' అంది ప్రియ.

రాజేష్ ప్రియ మాటలు వినబడి బయటకు వచ్చాడు.

"ఎవరూ... ఓహ్ నువ్వా. రారా... ఏంటిలా వచ్చావు?" అన్నాడు.

చంద్రయ్య కూరలు దింపి కాళ్లు కడుక్కుని వచ్చాడు.

"బాబూగారూ... ఈ ఊరు పనిమీద వచ్చాను. మిమ్మల్ని చూసి పోదామని..."

"అమ్మ ఎలా ఉంది?"

"మిమ్మల్ని తలుచుకుంటూ ఉన్నారు'' అన్నాడు చంద్రయ్య.

రాజేష్ నిట్టూర్చాడు.




ప్రియకి ఏదో తప్పు చేసినట్లు అనిపిస్తోంది.

"కాఫీ తెస్తాను'' అని వెళ్లింది.

ఇద్దరూ చిన్నగా ఏవో మాట్లాడుకోవటం వినిపిస్తోంది వంటింట్లోకి.

కాఫీ తీసుకుని వచ్చింది.

రాజేష్ దిగులుగా కూర్చుని ఉన్నాడు. ఎటో చూస్తూ కాఫీ తాగుతున్నాడు.

ప్రియ కాసేపు నిలబడి వెళ్ళిపోయింది.

ఆ తర్వాత చంద్రయ్య పదిరోజులకోసారి వస్తూనే ఉన్నాడు.

★ ★ ★

"చేతిలో డబ్బులేదు. ఆఫీస్‌లో లోన్ పెట్టు'' అన్నాడు రాజేష్.

"మొన్ననే తీసుకున్నాంకదా. ఏమన్నా అనుకుంటారు''

"ఏమనుకుంటారు వాళ్ళ మొహం"

"ఏమో... ఇప్పటికే నన్ను చూసి నవ్వుకుంటున్నారని నా అనుమానం. మంచి చీరెలూ, నగలూ లేవని. ఎంతలేనివాళ్ళయినా పెళ్ళయిన కొత్తల్లోనన్నా మంచి బట్టలు కట్టుకుంటారు. నాకు అదీ లేదు. అని చాటున చెవులు కొరుక్కుంటున్నట్లున్నారు''

"చావనీ వెధవల్ని. పట్టించుకోకూడదు ఎవర్నీ. వెళ్లు. ఎట్లాగైనా ప్రయత్నించి డబ్బు తీసుకురా. పో' అరిచాడు రాజేష్.

★ ★ ★

చేతిలో అస్సలు డబ్బు లేదు.

బ్యాంక్‌లో అంతకంటే లేదు.

"ప్రియా... మీ ఆఫీస్‌లో వాళ్లని ఎవరినన్నా అడిగి అయిదువందలు తీసుకోరాదూ'' అన్నాడు రాజేష్.

"ఎవరిని అడగాలి... బాగుండదు''

"నీపక్కన ఆవిడెవరో కూర్చుంటున్నది చూడు. ఆవిడ్ని అడగరాదూ..."

"బాగుండదు''

"ఎందుకు బాగుండదు..."

"ఉన్నాయో లేదో'

"ఆవిడ్ని అడుగు. ఆవిడే చెప్తుందికదా''

"నాకు సిగ్గుగా ఉంటుంది''

"అడుగు. డబ్బు కావాలి''

తప్పనిసరిగా అడిగింది ప్రియ.

రాజేశ్వరికి మొహమాటం ఎక్కువ.

'పాపం ఎంత అవసరంలో ఉందో... అడిగింది' అనుకుంది.

"ప్రియా. నా దగ్గర మూడువందలే ఉన్నాయి. ఎలా?" అంది.

"పర్వాలేదు. అవే ఇవ్వు. మిగిలింది ఎవరినన్నా అడుగుతాను'' అంది ప్రియ.

రాజేశ్వరి మూడువందలు తీసి ఇచ్చింది. రాజేష్‌కి ఆ డబ్బు ఇచ్చింది ప్రియ.

"మూడు వందలే దొరికాయి'' అంది.

"పర్వాలేదు..." అని ఆ డబ్బు జేబులో వేసుకున్నాడు రాజేష్.

"ఎట్లా... బోలెడు ఖర్చులున్నాయి. చాలుతుందా?" అంది.

"చాలదు. కానీ సరిపెట్టుకుంటాను''

"ఇంట్లోకి బోలెడు కావాలి. ఏవీ లేవు. పట్టుకురావాలి'' అంది.

"అట్లాగే'' అన్నాడు.

ప్రియ కావాల్సిన వస్తువులన్నీ లిస్టురాసి తీసుకొచ్చింది.

లిస్టు అందించింది.

రాజేష్ తీసుకోలేదు.

"నువ్వే తేవాలి'' అన్నాడు.

"అట్లాగే. ఆ డబ్బు ఇవ్వండి'' అంది ప్రియ.

"ఇవి నాకు కావాలి''

"మరెలా'' అంది ప్రియ.

"ఆ పక్కన ఒక షాప్ ఉంది. వాడి దగ్గర అన్ని సరుకులూ దొరుకుతాయి. అప్పు కూడా ఇస్తాడు. వాడికి ఈ లిస్ట్ ఇచ్చి డబ్బు ఫస్టుకి ఇస్తానని చెప్పు. ఇస్తాడు'' అన్నాడు రాజేష్.

"అదేదో మీరే అడగొచ్చుగా''

"నేను ఆడదాన్ని కాదుగా'' అన్నాడు రాజేష్ వెటకారంగా.

అతనేమన్నాడో ప్రియకి అర్థం కాలేదు.

"ఏమిటి?" అంది.

"ఏంలేదు. వాడు నాకివ్వడు. నేను ఉద్యోగం చెయ్యడం లేదుగా. నీకయితే ఉద్యోగం ఉంది. నమ్మి ఇస్తాడు'' అన్నాడు.

ప్రియ మరేం చెప్పకుండా లిస్ట్ తీసుకుని వెళ్ళింది.

షాప్‌లో ఓనర్ కూర్చుని ఉన్నాడు.

"ఏంకావాలి?" అన్నాడు.

మనిషి కొంచెం కరుకుగా ఉన్నట్టు అనిపిస్తున్నాడు. మాట అదోలా ఉంది. ప్రియని ఆపాదమస్తకం పరీక్షగా చూస్తున్నాడు.

"సరుకులు కావాలి. నేను జీతం వచ్చాక ఇస్తాను. మీ కిష్టమైతే... లేకపోతే మరీ అవసరం అయినవి కొని వెళ్ళిపోతాను'' అంది.

అతను లిస్ట్ పరీక్షిస్తున్నాడు.

"తీసుకోండి. మా దగ్గర అన్నీ దొరుకుతాయి. ప్రతినెలా మీరు కావల్సినవన్నీ నెల పొడవునా తీసుకుంటూ ఉండొచ్చు. జీతం రాగానే తీర్చేయండి'' అన్నాడు.

ఆనందంగా తల ఊపింది.

అతను అప్పు ఇస్తాననేసరికి ఆశ పుట్టింది.

షాంపూసీసా ఒకటి, కొత్తగా వచ్చిన ఫేస్ పౌడర్, క్రీమ్‌లాంటివి కూడా తీసుకుంది.

అతను మామూలుగా ఇచ్చే రేటుకన్నా బోలెడు ఎక్కువ ధర వేసుకుంటున్నాడని గమనించింది.

అయినా, మరి అప్పుకదా. సహించాలి. ఎట్లాగో ఒకలాగ మళ్ళీ జీతం వచ్చేదాకా కావల్సినవి అన్నీ ఏర్పడ్డాయి, అంతేచాలు.

ఒక పుస్తకంలో ప్రియపేరున ఎకౌంట్ తెరిచాడు అతను. అదిగాక ఇంకొక బిల్లులాంటిది తయారుచేశాడు. రెండింట్లో సంతకం చే

యించుకున్నాడు. ఆఫీసు అడ్రసూ, ఇంటిఅడ్ర సూ కూడా రాసుకున్నాడు.

రాజేష్ రాత్రి పొద్దుపోయాక ఎప్పుడో వచ్చాడు. అతని దగ్గర్నుంచి లిక్కర్ వాసన రావటం గమనించింది.

తను ఇంత కష్టపడి తెస్తే ఆ డబ్బు శుభ్రంగా ఎంజాయ్ చేశాడన్నమాట.

ఎందుకో చెప్పలేని భయం కలిగింది. తాగేవాళ్ళని చూసింది. మధుతో తిరిగేటప్పుడు అతను ఒక్కొక్కసారి బార్ అండ్ రెస్టారెంట్‌లకి తీసుకువెళ్ళేవాడు. అక్కడ ఏదన్నా తిని, తను కూల్‌డ్రింక్ తాగుతుంటే అతను బ్రాందీనో, మరొకటో తాగేవాడు. అది చూడటం తనకి ఆనందంగా ఉండేది కూడా.

మరి ఇప్పుడు రాజేష్ తాగితే ఎందుకు భయం వేస్తోంది. ప్రియకి సమాధానం దొరకలేదు.

రాజేష్ అన్నం తిననేలేదు. ఎంతో కష్టపడి అప్పుచేసి మరీ తెచ్చిన పదార్థాలన్నీ వృధాగా పారేయాల్సివచ్చింది మర్నాడు.

వంట రాకపోవటంవల్ల ఇబ్బందిగా ఉంది. పైపనులకి పనిమనిషిని పెట్టుకుంది.

ఇల్లు ఊడ్చి అంట్లుతోమి బట్టలు ఉతికిపోతుంది ఆ అమ్మాయి. కేవలం వంటపని ఒక్కటే ప్రియ చేసుకోవాలి.

ఇవన్నీ చెయ్యటానికి వందరూపాయలు అడిగింది. ఆ అమ్మాయి వందే అడిగింది కానీ వేరేవాళ్ళని పిల్చి అడిగితే రెండువందలు ఇమ్మన్నారు. ఈ పిల్లకి ఇంకా కొత్త కాబోలు తక్కువే అడిగింది. తనపని మాత్రమే చేసిపోతుంది.

"కూరలు తరిగి ఇవ్వు. ఆఫీసుకి టైమ్ అయిపోతోంది'' అంది ప్రియ ఒకరోజు.

"నేను చెయ్యను'' అంది ఆ పిల్ల పెడసరంగా.

"ఎందుకనీ... డబ్బు బాగానే తీసుకుంటావు. అన్నం కూరా మిగిల్తే పట్టుకెళ్తావు. టీలూ కాఫీలూ తాగుతుంటావు. నువ్వేం అడిగినా ఒప్పుకున్నవి కాకపోయినా నేను ఇవ్వటం లేదా? కూర తరిగి ఇవ్వటానికి ఏడుస్తావేం?" అరిచింది ప్రియ.

అసలే ఆలస్యం అయ్యింది. పనికాలేదు అని బాధపడుతున్నదేమో ఆ అమ్మాయి అంత నిష్కర్షగా చెప్పేసరికి ఒళ్ళుమండింది.

"నేను మా యింట్లోనే తరగను. నాకు కత్తిపీట అన్నా, కత్తన్నా భయం. నాకు నువ్వేం ఎక్కువ యివ్వటం లేదు. అందరూ ఈ మాత్రం ఇస్తూనే ఉన్నారు. పాత బట్టలూ, టిఫిన్లూ, టీలేకాక కొత్త చీరలు కూడా కొని ఇస్తున్నారు. నువ్వేం ఎక్కువ పెట్టటం లేదు... మాట్లాడకు'' అంది ఆ పిల్ల.

ప్రియకి ఒళ్ళు మండిపోయింది.

"అసలు నువ్వొద్దుపో'' అని జీతం లెఖ్ఖ కట్టింది. "రేపు వచ్చి తీసుకో "అని చెప్పింది.

ఆ అమ్మాయి భయపడి కాళ్లబేరానికి వస్తుందనుకున్నది కానీ ఆ అమ్మాయి నీ లెఖ్ఖేంటి అన్నట్లు చూసి వెళ్లిపోయింది.

"ఏంటి గొడవ" అన్నాడు రాజేష్.

"పనిమనిషి పెద్ద నీలుగుతోంది. తిట్టి పంపేశాను''

"బాగుంది... ఏదో సర్దుకుపోయి పని చేయించుకోవాలిగానీ యిదేంటి. ఇప్పుడు ఎవరికి నష్టం"

అతనేదో సమర్థిస్తాడనుకుంటే అట్లా మాట్లాడినందుకు ప్రియకి చిరాకేసింది.

"అంతే నాకిష్టం లేకపోతే అంతే. ఇష్టం లేని వ్యక్తులని నిమిషం కూడా భరించను'' అంది.

"ఇంకా జీతాలు రాలేదు. ఇప్పుడు ఉన్నట్లుండి దాన్ని మాన్పించేస్తే ఎట్లా. జీతం ఇచ్చి పంపాలంటే మన దగ్గర లేదుకదా. రేపొద్దున్నే వస్తుంది. ఏం చెప్తావ్'' అన్నాడు రాజేష్.

"ఎట్లాగో ఎక్కడ్నుంచో తెచ్చి యిస్తాను. అంతేగానీ దాన్ని భరించటం నావల్ల కాదు'' అంది ప్రియ.




"ఏంటో నీదంతా విచిత్రం. సరే... పనిమనిషి మానేసిందని పనిలో నన్ను హెల్ప్ చెయ్యమంటే మాత్రం నేను చెయ్యను'' ఖండితంగా చెప్పేసి వెళ్లిపోయాడు రాజేష్, నీపాట్లు నువ్వు పడమన్నట్లు.

ప్రియ ఎట్లాగో పని అయిందనిపించి ఆఫీసుకి చేరుకుంది. అరగంట ఆలస్యం అయింది.

"ఏమిటండీ... హెడ్డాఫీసునుంచి ఆర్డర్ వచ్చింది. లేట్‌గా వస్తే అర్ధపూట సెలవు కట్ చెయ్యాలన్నారు. ఇకనుంచీ తొందరగా రండి'' అన్నాడు ఆఫీసర్.

రోజూ ఆలస్యం అవుతుంటే అతను మాత్రం ఎంతకని సహిస్తాడు.

అందరూ అప్పటికే వచ్చేసి సీట్లలో సెటిల్ అయిపోయి, సీరియస్‌గా పని చేసుకుంటుంటే తను లేట్‌గా రావటం చిన్నతనంగా అనిపించింది ప్రియకి.

ఒక ఫైల్ తీసి చూడటం మొదలు పెట్టింది. పనిలో మనసు లగ్నం చెయ్యలేకపోయింది. ఏం చెయ్యాలి. రేపు ఆ పనిమనిషి వస్తే రాజేష్ అన్నట్లుగానే డబ్బు ఎక్కడిది. అది అరుస్తుందేమో. అనవసరంగా కోపం తెచ్చుకుంది తను. ఆఫీసులో ఇంకొకరి పని చూడమంటే తను చూస్తుందా. వంద పాయింట్లు తీసి మాట్లాడుతుంది. మరి అది మాత్రం అట్లాగే అనుకుని ఉండదూ. రూల్ అన్నాక అందరికీ ఒకటే ఉండాలి. ఇప్పుడేం దారి.

మర్నాడు పనిమనిషి వచ్చింది. ముందురోజు రాజేశ్వరి రాలేదు కాబట్టి ఆవిడని అడగలేదు. మగవాళ్లని అడగాలంటే సిగ్గుగా అనిపించింది.

"నిన్న డబ్బు ఇస్తానన్నారుగా ఇవ్వండి'' అంది పనిమనిషి. ఇంతలో రాజేష్ లోపల్నుంచి వచ్చాడు.

"నీకు ఇంకోచోట దొరికిందా పని'' అన్నాడు.

"లేదు'' అంది పనిమనిషి.

"మరి పంతాలకి పోయి పని మానుకుంటే ఎలాగ. పన్లోకిరా. నీకూ మా ఇల్లు అలవాటైపోయి ఉంటుంది. ఇద్దరే మనుషులం. చుట్టాలెవరూ రారు. హాయిగా చేసుకుపోక ఎందుకు పట్టుదల. నువ్వు ఒప్పుకున్న పనులే చెయ్యి. ఉన్న పాటున నిన్ను మాన్పించెయ్యటం నాకు ఇష్టంలేదు. నీకు పెళ్లి కుదిరితే ఎట్లాగూ మానేస్తావు'' అన్నాడు సరదాగా.

పనిమనిషి నవ్వుతూ సరేనంది.

ఏం జరగనట్లు పనిలోకి వచ్చేసింది. ప్రియ ప్రాణం కుదుట పడింది.

★ ★ ★

చంద్రయ్య రావటం తప్ప తల్లి మళ్లీ ఊరికి రాలేదని చెప్తూ వచ్చాడు రాజేష్.

ఎప్పుడూ డబ్బు సమస్యలతో బాధలు ఉండనే ఉన్నాయి. ప్రావిడెంట్ ఫండ్‌లో అప్పు... పండగ అడ్వాన్సు... చేబదుళ్లు...

"ఏంటండీ మీరు. ఎంతో డబ్బున్నదంటారు. అప్పులు మాత్రం మానరు'' అనేస్తున్నారు అప్పులవాళ్లు, సరదాగానే.

"ఏం చెయ్యమంటారండీ. మా అత్తగారికి మా పెళ్లి ఇష్టంలేదు. ఆవిడ మనసు కరిగేదాకా మాకీ బాధలు తప్పవు'' అంది ప్రియ.

"ఆవిడకి యిష్టంలేకపోతే పోనీండి. అసలు మీ వారేం చేస్తున్నారు. ఉద్యోగమా, వ్యాపారమా'' అన్నారు వాళ్లు.

"ఏదీ లేదండీ... ఫారిన్ వెళ్దామని చూస్తున్నారు'' అంది ప్రియ.

"ఏం చదివారన్నారు..."

"బి.ఏ"

"మరి యిక్కడ ఏదన్నా చూసుకోవచ్చుకదండీ. ఆ దేశాలన్నీ వెళ్లాలంటే..."

"ఏమోనండీ ఆయన ఫారిన్ వెళ్దామనే గట్టి పట్టుదల మీద ఉన్నారు. యిక్కడేమీ చెయ్యదల్చుకోలేదు'' అంది ప్రియ వాళ్లని యింక మాట్లాడొద్దు అన్నట్లు.

వాళ్లతో చెప్పిందిగానీ తనకి కూడా అని

పిస్తోంది. రాజేష్ ఏదన్నా ఉద్యోగం చూసు కుంటే బాగుండునని.

"ఉద్యోగం ఏదన్నా చూసుకోండి'' అంది ఆ రాత్రి.

"ఏమన్నావ్'' ఒక్క రంకె పెట్టాడు రాజేష్.

ప్రియ అదిరిపోయింది ఆ కేకకి.

"ఏం నేనన్నదాన్లో తప్పేముంది'' అంది.

"మరి? నేను ఒకడి దగ్గరకి వెళ్లి పని చేయాలా! నోర్మూయ్.. తంతాను జాగ్రత్త'' అరిచాడు.

ఆ రోజు మరింకేమీ మాట్లాడకుండా ఊరు కుంది. ఉద్యోగం చేస్తే తప్పేముంది. వేణ్ణీళ్లకి చన్నీళ్లుగా ఉంటుందికదా! అతనికంత కోపం వచ్చేందుకు ఏం ఉంది.

"ఏదన్నా వ్యాపారం చెయ్యండి, పోనీ'' అంది యింకో రోజు.

"నాకు ఏదీ చెయ్యాల్సిన ఖర్మ పట్టలేదు. నేను చెయ్యను పో'' అరిచేశాడు.

"ఖర్మేముంది. వ్యాపారం చేస్తూనే ఉన్నా నని అన్నారుగా. యిప్పుడు కొత్తగా ఖర్మ అంటున్నారేం"

"ఏం కూశావ్. నాకు ఎదురు సమాధానా లు చెప్పావంటే చంపి పారేస్తాను, జాగ్రత్త. తెలుసుకుని మాట్లాడు. ఏమనుకుంటున్నావో. నేను రాజాలా మా వ్యాపారం చూసుకున్నా ను. యిప్పుడు నువ్వు చెప్పావని ఎవడినో అడుక్కుంటూ బయల్దేరను. నువ్వు కూడా మానెయ్యిఅసలు. వెధవ గుమాస్తా ఉద్యోగాలు చేసుకునే వాళ్లంటే మాకిష్టం ఉండదసలు'' అన్నాడు.

"మానేస్తే కుదురుతుందా! నేను సంపా దించి తెచ్చి పోస్తుంటేనే చాలటంలేదు'' అంది ప్రియ.

"ఏడిశావ్, నువ్వు సంపాదించిన డబ్బు తోటే మన ఇల్లు నడుస్తుందనుకోకు. నేను తల్చుకుంటే ఇంతకి వెయ్యిరెట్ల భోగాలు అనుభవించేట్లు నడపగలను. ఊరుకుంటూ ఉంటే నీకింత అలుసైపోయింది'' ఇంట్లోంచి బయటకి వెళ్లిపోయాడు రాజేష్.

ప్రియ భయంగా కూర్చుండిపోయింది.

రాజేష్‌కి కోపం వచ్చింది. ఈ కోపంతో ఇట్లాగే వెళ్లిపోయి మళ్లీ రాకపోతే ఏం చె య్యాలి.

రాజేష్ ఆమె అనుకున్నట్లే ఆ రోజు రాలే దు.

అతను వస్తే చాలు, ఏమీ చెయ్యకపోయినా ఫర్వాలేదు అనిపించింది ప్రియకి. మర్నాడు అతను వస్తే ప్రాణం లేచి వచ్చింది.

ఇంటద్దె యివ్వమని రాజేష్‌కి డబ్బు యిచ్చింది. అతను యివ్వకుండా ఖర్చుపెట్టు కున్నాడు.

యింటాయన వచ్చి అడిగాడు.

"ఆయనకిచ్చానండీ యివ్వలేదా'' అంది ప్రియ.

"ఇస్తే నేనెందుకు వస్తానమ్మా'' అన్నాడా యన పుల్లవిరుపుగా. ప్రియ దగ్గర డబ్బులేదు. ఆయనకి యివ్వకపోతే వెళ్లేట్లు లేడు.

"సాయంత్రం యిస్తానండీ'' అంది.

"నేను ఆగనమ్మా. నాకిప్పుడే కావాలి'' అన్నాడు ఆయన నిష్కర్షగా.

ఆయన్ని కూర్చోబెట్టి ఎదురింటికి వెళ్లింది. ఎదురింట్లో ఉన్నవాళ్లు కొత్తగా వచ్చారు. వాళ్ల కి ప్రియ సంగతి తెలీదు.

"మా వారింట్లో లేరండీ. కాస్త అయిదు వందలుంటే యిస్తారా. సాయంత్రం యిస్తా ను'' అంది.

"దానికేం భాగ్యం... కూర్చోండి తెస్తాను'' అని ఆవిడ లోపలకు వెళ్లింది.

"ఏం చేస్తుంటారు ఆయన" అడిగిందావిడ డబ్బు యిస్తూ.

"ప్రస్తుతం ఏమీ చెయ్యటం లేదండీ'' అంది ప్రియ.

ఆవిడ ప్రశ్నార్థకంగా చూసింది, మరి ఎట్లా బతుకుతున్నావన్నట్లు.





"నేను ఉద్యోగం చేస్తున్నానండి. వారికి బోలెడు ప్రాపర్టీ ఉంది. ఫారిన్ వెళ్లాలని ట్రై చేస్తున్నారు. అందుకే యిక్కడ ఏ ఉద్యోగంలో చేరలేదు'' అంది.

ఆవిడ సంతోషంగా చూసింది.

"మా యింటికి రండి ఎప్పుడైనా'' అంది ప్రియ.

"వస్తాను... మీరూ వస్తుండండి'' అన్నదావిడ.

డబ్బు తీసుకొచ్చి యింటాయనకి ఇచ్చింది.

ఇకముందు ప్రతీనెలా మొదటి వారంలో ఇస్తేనే యింట్లో ఉండనిస్తాననీ, లేకపోతే ఖాళీ చెయ్యాలనీ చెప్పి వెళ్లిపోయాడాయన.

తర్వాత రాజేష్ ఏమీ ఎరగనట్లు యింట్లోకి వస్తుంటే ప్రియ కోపం పట్టలేకపోయింది.

"అద్దె యివ్వలేదటగా'' అంది విసురుగా.

"ఇవ్వలేదు'' అన్నాడు రాజేష్ తాపీగా.

"ఎందుకని..."

"కుదరలేదు''

"సరే ఆ డబ్బు ఇలా యివ్వండి'' అంది.

"లేదు... ఖర్చయిపోయింది''

"ఆ..." ప్రియకి నోటమాట రాలేదు. అంత డబ్బు ఒక్కరోజులో ఖర్చు చేశాడా! ఏం చేశాడు?

"మరి ఎట్లా... ఎదురింట్లో అప్పడిగి యింటాయనకి యిచ్చాను. యిస్తేగానీ పోనని కూర్చున్నాడాయన. సాయంత్రం డబ్బు తిరిగి యిచ్చేస్తానని చెప్పాను'' అంది.

"ఎవరినడిగి చెప్పావు''

"అంటే..."

"అంతే నన్నడిగితే నేనేదో సర్ది చెప్పేవాణ్ణి. గొప్పగా అప్పు తెచ్చిమరీ యిచ్చావుగా. యింకోచోట అప్పుతెచ్చి తీర్చుకో'' అన్నాడు.

"ఎవరిస్తారు''

"నీ బాబు నడుగు. హాయిగా కట్నంగిట్నం లేకుండా నిన్ను నాకంటగట్టాడు. బయట నాకు లక్షల్లో దొరికేది. ఈ సామాను చూడు. డొక్కు సామాను. వెధవ మొహం నువ్వూను. నిన్ను ఎట్లా చేసుకున్నానని అందరూ చచ్చేట్లు నవ్వుతున్నారు. మామూలుగానే నీకు బోలెడు కట్నం యివ్వాలి. యింకా నా అంత గొప్పవాడంటే యింకెంత యివ్వాలి'' అరిచాడు.

ప్రియకి కాళ్లూ చేతులూ వణకటం మొదలు పెట్టాయి అతని కేకలకి.

అసలే అతను చేసిన పనికి భయపడి చస్తుంటే పైపెచ్చు యింత అరవటంతో యింకా భయం వేసింది. నలుగురూ వింటారేమో... నవ్వుతారేమోనని భయం.

"చిన్నగా మాట్లాడండి... అందరూ వింటారు'' అంది.

"నీ ప్రెస్టీజ్ తక్కువవుతుందా వింటే'' యింకా గట్టిగా అరిచాడతను.

ప్రియ నోరుమూసుకుని కూర్చుంది. రాజేష్ ఆ అద్దె డబ్బు తనకి యివ్వడని అర్థమైంది.

చివరికి చచ్చినట్లు తల్లినే అడగాల్సి వచ్చింది. ఆవిడ యిచ్చిన డబ్బుతో ఎదురింటావిడ అప్పు తీర్చింది. పాలవాడు, పని మనిషి అందరితో యిదే విధంగా జరిగింది.

రాజేష్‌కి యిస్తే ఎవరికీ యివ్వడు.

తనే జాగ్రత్తగా ఉండాలి.

అందరికీ తనే యిస్తోంది ప్రియ. పక్కింట్లో, ఎదురింట్లో, వెనకింట్లో అన్నిచోట్లా అప్పులు.

పక్కసీట్లో పనిచేస్తున్న సాధన దగ్గర కూడా తీసుకుంటూ ఉంటుంది అప్పుడప్పుడూ.

సాధన చాలా స్టైల్‌గా ఉంటుంది. పంజాబీ డ్రెస్సులు, రకరకాల చీరలు ధరిస్తుంటుంది. మంచి మేకప్ వేసుకుని వస్తుంది.

"ఎందుకండీ... ఎప్పుడూ అవే చీరలూ, అప్పులూ... హాయిగా ఉండొచ్చుగా'' అంది.

"ఏదీ యింకా ఆయనకి స్థిరమైన ఆదాయం లేదుకదండీ'' అంది ప్రియ.

సాధన సమాధానం చెప్పలేదు.

"ఏంటో నా ఒక్కదాని సంపాదనమీద గడవాలి. అందుకే అప్పులవుతున్నాయి'' అంది ప్రియ.

"ఏమోనండీ.. ఒక్కళ్లు సంపాదిస్తూ చక్కగా నడుపుకొస్తున్న వాళ్లెంతమంది లేరు'' అంది సాధన.

"వాళ్లకి సమర్థత ఉన్నట్లుంది'' నవ్వింది ప్రియ. మామూలుగా అయితే ప్రియ యింత సహనంగా సమాధానాలు చెప్పదు. కానీ సాధన అడిగినప్పుడల్లా అప్పు యిస్తుంటుంది మరి.

"ప్రియగారూ... మీ ఆయనకి బాడ్ హాబిట్స్ ఉన్నాయేమోనని అనుమానంగా ఉంది'' అంది.

ప్రియ విని ఊరుకుంది.

"ఇట్లా అన్నానని మీరేం అనుకోకండి. మీకేం బాధ్యతలు లేవన్నారు. యిద్దరికి ఏం ఖర్చు అవుతుందండీ. వృధాగా ఖర్చులు పెడితే ఎంత డబ్బూ చాలదు'' అంది సాధన.

"నిజమేలెండి. కొత్త కాబట్టి మాకు ఏ ఖర్చు ముఖ్యమో ఏది కాదో తెలీటం లేదు'' అంది ప్రియ.

సాధన ఊరుకోలేదు.

"అదేంటండీ అట్లా అంటారు. మీరేం చిన్నపిల్లలు కాదుగా. లేట్ మారేజ్ అనాలి నిజానికి. ఏ ఖర్చు ముఖ్యమో ఏది కాదో మీకు తెలీదంటే అందరూ నవ్వుతారు. తెలీకపోతే యిప్పుడైనా తెలుసుకోండి'' అంది.

ప్రియకి తల కొట్టేసినట్లయింది.

ఇదే ఇంకో సమయంలో అయితే ఏదో ఒకటి అని ఆవిడ్ని కించపరిచేదే. కానీ సాధన తనకి ఋణదాత. ఒకళ్ల దగ్గర నుంచి ఏదన్నా తీసుకోవాలంటే వాళ్లనే మాటలు పడగలగాలని అనుభవంతో అర్థం అవుతోంది.




"ప్రియా... అతన్ని గట్టిగా అడుగు. అతను ఏదో దాస్తున్నాడని అనుమానం" అని తల్లి తండ్రులు కూడా ఈమధ్య అంటున్నారు.

లాభంలేదు. అతను వాళ్ల అమ్మకి నిజం చెప్పేసి కాళ్లమీదపడి ఆవిడ్ని మంచి చేసుకుని బతికితేగానీ యిక జీవితం కష్టం. అతని ఖర్చులు తను తట్టుకోలేదు.

ఎంతో గొప్పగా అందరిముందూ తిరగాల్సిందిపోయి యిట్లా తక్కువగా మాట్లాడుతుంటే చూసి సహించాల్సి వచ్చింది. సాధన తను చెప్పింది నమ్మలేదు. ఆ విషయాన్ని ఎంత కుండబద్దలు కొట్టినట్లు ఎట్లా చెప్పేసింది.

ఇంక రాజేష్ ఏమన్నా అనుకోనీ. అతన్ని గట్టిగా అడిగేయాలి.

రాజేష్ ఆ రోజు యింటికి రాలేదు. ఎప్పటిలాగే అసలు వస్తాడో రాడో అని భయపడ్తూ, వస్తే చాలు యింకేమీ అక్కర్లేదని అనుకుంటూ గడిపింది ప్రియ.

★ ★ ★

"అయిదువేలు కావాలి. వెంటనే తీసుకురా'' అన్నాడు రాజేష్.

"నా దగ్గర లేవు''

"మీ నాన్నని అడుగు''

"ఆయన దగ్గర కూడా లేవు'' అంది ప్రియ.

"నాకవన్నీ తెలీదు. ఆయన దగ్గర లేకపోతే మీ ఆఫీసులో ఎవర్నన్నా అడుగు'' అన్నాడు రాజేష్.

ఎవర్ని అడిగినా లాభం ఉండదని ప్రియకి తెలుసు. యాభై, వందా అడిగితేనే మళ్ళీ వస్తాయో రావో అన్నట్లు చూస్తారు. వేలు ఎవరు యిస్తారు.

"ఎవరూ యివ్వరు'' అంది.

"ఎందుకు యివ్వరు''

"ఏమో... యివ్వరు..."

"అయితే ఒక పని చెయ్యి. మీ ఆఫీసులో స్కూటర్ కొనుక్కుంటే అడ్వాన్స్ యిస్తారుగా'' అన్నాడు రాజేష్.

"యిస్తారు''

"అయితే అది అప్లై చెయ్యి'' అన్నాడు రాజేష్.

"స్కూటర్ కొంటారా... ఎందుకూ? మీకు ఉందన్నారుగా'' అంది ప్రియ.

"చెప్పింది చెయ్యి ముందు'' అన్నాడు రాజేష్.

స్కూటర్ కొనటమంటే ప్రియకి ఆనందంగానే ఉంది. యింతవరకూ బస్‌లో పోతూవస్తూ ఉంది. స్కూటర్ ఉంటే రాజేష్ రోజూ స్కూటర్‌మీద దింపుతాడు... అత్తగారికి కూడా తాము ఒకటొకటీ ఏర్పరచుకుంటుంటే కాస్త భయం కలుగుతుంది.

అడ్వాన్సుకి అప్లై చేసింది.

పది రోజుల్లో అడ్వాన్సు శాంక్షన్ అయి వచ్చేసింది. పదివేలు యిచ్చారు.

"ఎప్పుడు వెళ్ళి కొందాం" అంది ప్రియ.

"డబ్బు నాకివ్వు. నేను తెస్తాను'' అన్నాడు రాజేష్.

ప్రియ యిచ్చేసింది.

మరో మూడు రోజులు గడిచాయి.

"స్కూటర్ ఏదీ'' అంది ప్రియ.

"పదివేలకి ఏం వస్తుంది నీ మొహం" అన్నాడు రాజేష్.

"అంటే..."

"పదివేలకి రాదు. మరో పదివేలన్నా ఉండాలి. మీ నాన్ననడిగి తీసుకురా'' అన్నాడు.

"ఆయన యివ్వలేడని ముందే చెప్పాను గా''





"అందుకేగా. నేను ఆ డబ్బు ఖర్చుపెట్టుకున్నాను'' అన్నాడు రాజేష్.

ప్రియకి గుండెదడ మొదలైంది.

"ఎందుకండీ అట్లా చేశారు. యిప్పుడు నేను ఆఫీసులో ఏం సమాధానం చెప్పాలి. స్కూటర్ అడ్వాన్స్ తీసుకుంటే స్కూటర్ కొన్న రసీదు చూపించాలి. లేకుంటే ఆ డబ్బు తిరిగి కట్టెయ్యాలి. లేకపోతే ఊరుకోరు'' అంది.

"వాళ్ళ మొహం కాదూ. స్కూటర్ కొన్నట్లు ఏదో ఒక రసీదు నేను పుట్టిస్తానులే. నువ్వు భయపడకు. నాలుగు వేలు ఖర్చయ్యాయి. మిగతా ఆరువేలు భద్రంగా ఉన్నాయి. కావాలంటే ఆ ఆరువేలూ కట్టేయొచ్చు. ఆసలు ఒక ఫ్రెండ్ కావాలని బతిమాలితే ఆ నాలుగువేలూ యిచ్చానుగానీ లేకుంటే ఆ డబ్బు కూడా రెడీగా ఉండేది'' అన్నాడు.

ప్రియ వింటోంది.

"ప్రియా! నువ్వెట్లా చెపితే అట్లా చేద్దాం" అన్నాడు రాజేష్.

"మీ యిష్టం" అనేసి ఊరుకుంది ప్రియ.

"ఆరువేలతో ఏదన్నా కొనుక్కుందాం" అన్నది.

"సరే'

యిద్దరూ షాపింగ్‌కి వెళ్ళారు.

ఫ్రిజ్, టివి లాంటివన్నీ చూశారు.

"అవన్నీ మా యింట్లో ఉన్నాయిలే. ఎటూ నాలుగురోజులు పోగానే అక్కడికి పోతాం కదా. ఈ లోపల కొనటందేనికీ. యింట్లో అడ్డం. మోతబరువు'' అన్నాడు.

ప్రియకి నిజమేననిపించింది.

అతను ఒక బంగారు ఉంగరం కొనుక్కున్నాడు. రెండు డ్రెస్సులు తీసుకున్నాడు. బూట్లు కొన్నాడు.

ప్రియ ఒక చీర కొనుక్కుంది.

మంచి వాసన వచ్చే పౌడర్ ఒకటి, ఒక సెంట్ సీసా కొన్నారు.

హోటల్లో భోంచేశారు.

ఆటోలో తిరిగారు.

ప్రియకి ఆరోజు వంట చెయ్యకపోవటం చాలా సుఖంగా అనిపించింది. షాపింగ్ చేస్తూ, హొటల్లో భోంచేస్తూ మహదానందం అనుభవించింది.

"నాకు వంటంటే భలే బోర్? యిట్లా హాయిగా హొటల్లో తింటే ఎంత బాగుంటుంది'' అన్నది.

"యిప్పుడు డబ్బు సరిగా చాలకగానీ, లేకపోతేనా, నిన్ను కాలు కిందపెట్టనిస్తానా'' అన్నాడు రాజేష్.

ఆ డబ్బు కాస్తా ఖర్చయిపోయిందాకా ప్రియకి స్వర్గం చూపించాడు రాజేష్.

మరో నాలుగు రోజుల్లో ఆ డబ్బు మొత్తం అయిపోయింది. స్వర్గం మీదనుంచి మళ్ళీ భూమిమీదికి చేరారు.

జీతంలో యికమీద నెలకి నూటయాభైదాకా కట్‌అవుతుంది. ఎట్లా గడపాలో ప్రియకి అర్థంకాలేదు.

జీతం వచ్చింది. డబ్బు చాలలేదు.

సాధనా, హరి, ఎవరూ అప్పు యివ్వటంలేదు.

సాధన అయితే మరీ మొహంమీదే అనేసింది.

"ఏదో ఒకసారీ రెండుసార్లయితే యిస్తాను గానీ మాటిమాటికీ నేను యివ్వలేనండీ. నాకు చిరాకు'' అంది.

అంతేకాదు...

"స్కూటర్ కొన్నానన్నారు. ఏదీ ఎప్పుడూ ఎక్కి కనబడరేం" అంది.

ప్రియకి కారం రాసుకున్నట్లయింది.

"మావారు కారు తప్ప స్కూటర్ సరిగ్గా నడపలేరు. అందుకే బాగా నేర్చుకున్నదాకా ఎక్కకూడదని నిశ్చయించుకున్నాం" అంది.

సాధన నవ్వింది.

"కారు మెకానిక్ కాబోలు కదూ..." అంది.

ప్రియకి ఆ వ్యంగ్యం అర్థంకాలేదు.

"కారు యింట్లో ఉంటే మెకానిజం తెలీదుటండీ..." అన్నది.

సాధన ఒకసారి ప్రియ మొహంలోకి చూసింది. అందులో ఏం భయం, తడబాటూ లేదు.

అంటే... పాపం నిజంగానే ప్రియకి ఏం తెలీదన్నమాట.

"ప్రియా... ఒకసంగతి అడగనా... ఏమీ అనుకోవు కదూ'' అన్నది, అప్రయత్నంగా ఏకవచనంలోకి దిగుతూ.

"ఎందుకనుకుంటాను. చెప్పండి'' అన్నది ప్రియ.

"మీకు తెలిసే అబద్ధాలు చెప్తున్నారేమో అనుకున్నాను యిన్నాళ్ళూ. కానీ మేకేం తెలీదని తెలుస్తోంది. నిజంగా తెలీదా... మీవారు మెకానిక్కని'' అన్నది.

"ఏంటండీ... మీరేం మాట్లాడ్తున్నారో నాకు అర్థం కావటంలేదు'' అంది ప్రియ.

"ప్రియా... మీ ఆయన గొప్ప ఆస్తి పరుడనీ, యింకా ఏవేవో ఉన్నాయనీ అంటున్నావే. అవి ఏం లేవు ఆయనకి. ఆయన యింతకు ముందు ఒక మెకానిక్కు షెడ్డులో వర్కర్‌గా పనిచేశాడుట. యింతకుముందు చాలామంది అమ్మాయిలని పెళ్ళిచేసుకోవాలని అనుకుంటూ వెంటపడి వేధించాడట. చివరకి నువ్వు అతని వలలో పడ్డట్లున్నావు. అతను చదువూ సంధ్యా ఏమీ లేని మనిషి. నువ్వు మోసపోయావు ప్రియా. ఏది లేకపోయినా పర్వాలేదుగానీ అతని గుణం మంచిది కాదని నా బాధ. యిప్పటికైనా కళ్ళు తెరిచి అతని నిజస్వరూపం తెలుసుకో'' అన్నది.

ప్రియకి కళ్ళు చీకట్లుకమ్మాయి.

టేబుల్ మీదికి వాలిపోయింది.

"ప్రియా... ప్రియా... ఏమైంది..," సాధన గబగబా వెళ్ళి మంచినీళ్ళు తీసుకువచ్చింది.

అవి తాగి కొద్దిగా తెప్పరిల్లింది ప్రియ.

సాధన చెప్పింది నిజమేనా... అబద్ధం

చెప్పాల్సిన అవసరం సాధనకేముంది.

జాలిగా చూస్తోంది సాధన.

"ప్రియా... సారీ... నిజం ఎంత చేదుగా ఉన్నా భరించక తప్పదు. తెలుసుకోవాలి. తప్పదు. అందుకే నీకు చెప్పాను"

"ప్రియా! ఆఫీసులో అందరికీ దాదాపు ఈ సంగతి తెలిసిపోయింది. అతని మెకానిక్ షెడ్‌లో రిపేర్ చేయించుకున్నవాళ్ళు కూడా కొందరున్నారు. ఒకళ్ళకి ఒకళ్ళు చెప్పుకుని అందరూ ఈ విషయం తెలుసుకున్నారు. అందుకే నువ్వు అప్పు అడిగితే ఎవ్వరూ యివ్వటంలేదు. నువ్వు యిట్లాంటి పరిస్థితిలో చిక్కుకున్నందుకు అందరూ బాధపడుతున్నారు. భయపడకు. నీకేమన్నా సాయం కావలిస్తే అడుగు. చేస్తాం... నన్నడిగితే యిక జరిగిపోయినదానికి బాధపడటం అనవసరం. అతను ఏం చదివితేనేం, ఏం లేకపోతేనేం. నీ భర్త నువ్వు అన్నీ మర్చిపో. అతను ఏదో ఒక పని చేస్తే మీకు డబ్బు బాగానే సరిపోతుంది. హాయిగా ఉన్నంతలో పొదుపుగా ఖర్చుపెట్టుకుని హాయిగా బతకవచ్చు" అంది.

ప్రియ ఎటో చూస్తోంది.

సాధన కాసేపు అట్లాగే ఓదార్పు మాటలు చెప్పి తన సీట్ దగ్గరకి వెళ్ళిపోయింది.

ప్రియకి పని చేయబుద్ధికాలేదు. సగంపూట సెలవుపెట్టి యింటికి వెళ్ళిపోయింది.

రాజేష్ యింట్లోనే ఉన్నాడు.

"ఏం వచ్చావ్?" అన్నాడు.

"మీదేఊరు...?" అంది ప్రియ.

"ఎందుకూ?"

"ఏంలేదు. మీ పాలేరు ఈమధ్య రావటంలేదేం?"

"నీకేం నష్టం రాకపోతే?"

"మీ అమ్మగారిని చూద్దాంపదండి!"

"పదపదమంటే ఎట్లాగ. ఆవిడకి మనల్ని చూడాలని ఉండొద్దూ"

"ఏం... ఎందుకు చూడదు"

"నీలాంటిదాన్ని కోడలని చెప్పుకోవటం ఆవిడకి యిష్టం ఉండదు..."

"మరి ఎలాంటిది కావాలి. మెకానిక్ షెడ్డులో కార్లు తుడిచే అమ్మాయి కావాలా?"

"ఏంటి డొంక తిరుగుడుగా మాట్లాడుతున్నావ్"

"డొంక తిరుగుడు కాదు. నేరుగానే అడుగుతున్నాను. మీరు మెకానిక్ షెడ్డులో వర్కరటగా! మా ఆఫీసులో అందరూ అనుకుంటున్నారు. మిమ్మల్ని అక్కడ చూశారుట కూడా" అంది కోపంగా.

"అవును... అయితే ఏం?"

"ఏం అని తేలిగ్గా అడుగుతున్నారా. నన్నెందుకు మోసం చేశారు. సిగ్గులేదూ" విసురుగా అంది ప్రియ.

"ఎందుకు మోసం చేశానా? మరి నిజం చెప్తే నువ్వు చేసుకుంటావా? పెద్ద ఆస్తిపరుడ్నని చెప్పేసరికి ఎగురుకుంటూ చేసుకున్నావు"

"అబద్ధాలెందుకు... నిజం చెప్పి చూడాల్సింది ధైర్యం ఉంటే. యిది మోసం... కుట్ర" అంది.

"వెయ్యి అబద్ధాలాడైనా ఒక పెళ్ళి చెయ్యాలి అని చెప్పారు పెద్దలు. వేరే ఎవడి పెళ్ళి కోసమో వెయ్యి అబద్ధాలు ఆడినా తప్పు లేనప్పుడు ఆఫ్టరాల్ నా సొంత పెళ్ళికి, నేను, ఒకే ఒక అబద్ధం చెప్తే దానికింత ఏడ్చి చస్తావేం?" అన్నాడు. రాజేష్ నిర్లక్ష్యంగా.

అంటే సాధన చెప్పింది నిజమేనన్నమాట. ప్రియకి ఏడుపు పొర్లిపొర్లి వచ్చింది.

"మోసగాళ్ళంటే నాకు అసహ్యం" అంది ఏడుస్తూ.

"ఏంటే... నీ... తెగ నీలుగుతున్నావ్. నువ్వేమన్నా పత్తిత్తువా? మధుగాడితో శుభ్రంగా తిరిగి వాడు వద్దు పొమ్మన్నాక నన్ను చేసుకున్నావు. నీకు సిగ్గులేదూ? నాకు




పెళ్ళయ్యాక ఆ సంగతి తెలిసిందిగానీ, ముందే తెలిస్తే చచ్చినా చేసుకునేవాడిని కాను. కులటా... నీకు నాలాంటి అమాయకుడే దొరికాడా పెళ్ళిచేసుకోవటానికి. అంతా తెలిసినా నేను పోనీలే పెళ్ళయ్యాక యింకేం చేస్తాం అని సరిపెట్టుకుపోతున్నానా లేదా? నువ్వెందుకు యింత ఏడుస్తావు. నోరుమూసుకుని పడుండు'' అన్నాడు రాజేష్.

ప్రియ వెక్కివెక్కి ఏడుస్తోంది.

"నేను నీతో కాపరం చెయ్యను. ఫో... నా యింట్లోంచి'' అంది.

రాజేష్ చెయ్యి చురుగ్గా ఆమె చెంపని తాకించి.

ప్రియ నిర్ఘాంతపోయి చూస్తోంది.

"కాపరం చెయ్యవా? నీ తాతతో కూడా చేయించగలను. పోన్లెమ్మని ఊరుకుంటే మరీ విర్రవీగుతున్నావు. యిది శాంపిల్ మాత్రమే'' అన్నాడు.

ప్రియకి కసితో ఒళ్ళు తెలియలేదు.

"ఎంత ధైర్యం నీకు. నన్ను కొడతావా. చూస్తాను. నాతో ఎట్లా కాపరం చేయిస్తావో చూస్తాను'' కోపంగా అంటూ బట్టలు సర్దుకుంది.

"ఎక్కడికి పోతావ్'' అన్నాడు రాజేష్.

ప్రియ సమాధానం చెప్పలేదు.

వెంటనే వచ్చి ఆమె చేతిలో సూట్‌కేస్‌ని లాక్కుని విసిరేశాడు.

"జాగ్రత్త . ఎక్కడికి పోయినా తన్ని లాక్కురాగలను. మీయింటికి పోదామనుకుంటున్నావేమో. నా సంగతంతా తెలిసినా మీ నాన్న నిన్ను లోపలకి రానివ్వడు. కాపరం చేసుకోపొమ్మంటాడు'' అన్నాడు.

ప్రియ విని ఊరుకుంది.

అతనికి సమాధానం చెప్పలేదు. అతను అన్నది నిజమని తెలుసు. తండ్రి సంగతి అతనికన్నా తనకి బాగా తెలుసు. రాజేష్ అన్నట్లే చేస్తాడు. ఆయన దృష్టిలో యిదొక పెద్ద విషయం కాదు. ఎందుకంటే ఏమీలేనివాడైనా, ఏమీ చదువుకోకపోయినా సరే, తనకి పెళ్ళి అయితే చాలని యిన్నాళ్ళూ అనుకున్నారు. పెళ్ళయిపోయాక ఒకరి లోపాలు మరొకరు పట్టించుకోకూడదు అంటాడు.

కానీ, ఎందుకో రాజేష్‌ని చూస్తే భయం వేస్తోంది. అతనికి ఏమీ లేకపోయినా పర్వాలేదు. కానీ ఈ కపటం, మోసం అన్నవి లేకుండా ఉంటే బాగుండేది.

అతని ముందు తను ఎందుకూ పనికిరాదు.

యిట్లాంటి మోసగాడితో కాపరం చెయ్యటం కల్ల.

ప్రియ ఏం చెయ్యాలో ఆలోచించుకుంది.

ప్రియ స్నేహితురాలు రాజశ్రీ ఒక్కత్తే ఒక రూమ్ తీసుకుని ఉంటున్నది. ప్రియ మర్నాడు ఆఫీసుకి వెళ్ళేటప్పుడు కాస్త ముందే బయల్దేరి ఆమె రూమ్‌కి వెళ్ళింది.

రాజశ్రీ ఆఫీస్‌కి వెళ్ళేందుకు తయారౌతోంది.

"రా... రా... ఏమిటి విశేషం..." అంది.

ప్రియ క్లుప్తంగా తన విషయం వివరించింది.

"రాజీ... నేను అతనినుంచి విడాకులు తీసుకోవాలని అనుకుంటున్నాను'' అంది.

"అనవసరం... జరిగిందేదో జరిగింది. యింక అతన్ని ఏదో ఒక పనిచేసి డబ్బు సంపాదించమను. ఇద్దరూ హాయిగా బతకవచ్చు'' అంది రాజశ్రీ.

"ఎవరినడిగినా అదే చెప్తారు. కానీ నాకు యిష్టంలేదు. రాజీ... అతను నన్ను మోసం చేశాడు. కనీసం పెళ్ళి జరగగానే అయినా ఉన్నమాట చెప్పొచ్చుగా... అదీలేదు.. ఆ పైన నాతో ఏవేవో గొప్పలు చెప్పి డబ్బంతా అడిగి తీసుకుని అప్పులు చేయించాడు. ఆ డబ్బంతా తన సొంతానికి హాయిగా ఖర్చుపెట్టుకున్నాడు. నన్ను అన్నివిధాలా మోసం చేశాడు. అతని దగ్గర నాకు రక్షణ లేదు'' అంది.

"మీ అమ్మా నాన్నా ఒప్పుకుంటారా..."

"వాళ్ళెవరు మధ్య. అనుభవించాల్సింది నేను..."

"సరే నీ యిష్టం. కావలిస్తే నాతో ఉండు. నాకేం అభ్యంతరం లేదు'' అంది రాజశ్రీ.

"చాలు ఆ సాయం కోసమే వచ్చాను. మధ్యాహ్నం అతను లేకుండా చూసి నా సామాను, సూట్‌కేస్ సర్దుకుని తెచ్చేస్తాను'' అంది ప్రియ.

రాజశ్రీ రూమ్ తాళంచెవి యిచ్చింది.

ప్రియ అది తీసుకుని ఆఫీసుకి బయల్దేరింది.

సాధారణంగా రాజేష్ సాయంత్రం నాలుగయ్యేసరికి షోగ్గా తయారయి బయటకి వెళ్తాడని ప్రియకి తెలుసు.

రాజశ్రీ యిల్లు రాజేష్‌కి తెలీదు.

ప్రియ ఎందుకైనా మంచిదని మూడు రోజులు సెలవుపెట్టింది.

తన బట్టలు, ముఖ్యమైన సామాను తీసుకుని ఆటోలో బయల్దేరింది.

మూడురోజులు రాజేష్‌కి కనబడకపోతే సరి... చచ్చేట్లు భయపడతాడు. ఆఫ్టరాల్... ఏ చదువూ, డబ్బూ లేని వాడు తనని ఎట్లా భయపెడుతున్నాడు. తనేంటో తెలిసేట్లు చెయ్యాలి. కనీసం మూడురోజులు అజ్ఞాతంలో ఉండాలి అనుకుంది ప్రియ.

రాజేష్ అడిగితే డబ్బు యివ్వవద్దనీ, యిస్తే తన పూచీ లేదనీ, అతను ఎవరెవరిని అడిగే ఆస్కారం ఉందో వాళ్ళందరికీ చెప్పి బయల్దేరింది.

ప్రియ ఆఫీసునుంచి ఇంటికి రాకపోయేసరికి రాజేష్‌కి అనుమానం కలిగింది.

తాళం పక్కింట్లో ఇచ్చిందేమోనని అడిగాడు. వాళ్లు లేదన్నారు.

రాత్రి చాలా సేపు చూశాడు. ప్రియ రాలేదు.

గోవిందరావుకి ఫోన్ చేశాడు. ప్రియ అక్కడికి కూడా రాలేదని తెలిసింది. ఒకళ్ళిద్దరు చుట్టాల ఇంటికి కూడా ఫోన్ చేశాడు. అక్కడికీ రాలేదన్నారు.

తాళం బద్దలు కొట్టి లోపలకి వెళ్ళాడు. ప్రియ బట్టలు, ఇతర సామాన్లు కనిపించలేదు.

అంటే కావాలనే ఎక్కడికో పారిపోయిందన్నమాట.

ఎటుపోయి ఉంటుంది. ఒకవేళ ఎక్కడికి పోయినా రేపు ఆఫీసుకి రాకతప్పదుకదా.

మర్నాడు ఆఫీసుకి వెళ్ళాడు.

అందరూ అదోలా చూడటం గమనించాడు. ప్రియ చెప్పిందికదా, తన ఆఫీసులో అందరికీ తెలిసిపోయిందని... అందుకే కాబోలు ఇట్లా చూస్తున్నారు.

గోవిందరావు ఇంటికీ, ఇతర చుట్టాలు, స్నేహితుల ఇళ్లకీ వెళ్లిచూశాడు. ప్రియ లేదు.

అతనికి భయం వేసింది.

ఎక్కడికిపోయి ఉంటుంది.

ఎవరో అన్నారు. ప్రియ వేలువిడిచిన మేనమామ వైజాగ్‌లో ఉన్నాడని... అక్కడికిగానీ పోలేదుకదా

ప్రియ ఎక్కడికి వెళ్లినా తన్ని లాక్కురావాలి.

అంతే.



ప్రియ ఇంట్లో ఏమీ ఉంచకుండాపోయింది. ఏవో సత్తుగిన్నెలూ, కుండల్లాంటివి తప్ప




ఖరీదైనవి ఏవీలేవు. తాకట్టుపెట్టటానికి ఏమీ లేవు.

రైలుచార్జీలు, ప్రియ అక్కడ ఎక్కడ ఉందో వెతకటానికి డబ్బూ కావాలి. వందలు చాలవు, వెయ్యిరూపాయలన్నా ఉండాలి. ఒక్కడూ వె ళ్తే వస్తుందో రాదో. కనీసం మరొకడినన్నా తీసుకువెళ్ళాలి. అంటే మరి కాస్త ఖర్చు. ప్రియ ఏం చెప్పిందోమరి. ఒక్కడూ డబ్బు ఇవ్వటంలేదు.

గబగబా ఆలోచించాలి మార్గం. ఆలస్యమై తే అది తన ఏర్పాట్లు పటిష్టంగా చేసుకుని గట్టిపడుతుంది. ఎంత తొందరగా వెళ్ళి, చావ దన్ని తీసుకొస్తే అంత మంచిది.

అడుక్కతినయినా డబ్బు సంపాదించాలి.

నాలుగురోడ్ల కూడలిలో నిలబడ్డాడు.

ఒకాయన పోతున్నాడు.

"అయ్యా... నాలుగురోజులైంది భోంచేసి. అన్నం తింటాను. నిరుద్యోగిని చేతిలో చిల్లిగ వ్వలేదు. కాస్త అయిదు రూపాయలు ఇవ్వండి సార్" అన్నాడు.

"పో పోవయ్యా" అన్నాడతను.

ఇంకొకరిని అడిగాడు.

"అయ్యా... ఇంటర్వ్యూకి వెళ్ళాలి. కాస్త డబ్బు సాయం చెయ్యండి. మీ వంతుగా కనీసం ఒక్కరూపాయైనా ఇవ్వండి" అన్నా డు.

"వెళ్ళవయ్యా. వెధవగోల" అన్నాడతను విసుక్కుంటూ. అరగంట గడిచినా ఒక్కరూ పాయి కూడా సంపాదించలేకపోయాడు.

నీరసం వచ్చేసింది.

కళ్ళల్లోంచి నీళ్లు కారాయి. తన జీవితం అంతా ప్రియమీదే ఆధారపడిఉందని అప్పుడు అర్థమైంది. ప్రియ ఉద్యోగం చేస్తోంది. కాబట్టి ఎవరినన్నా అప్పు అడిగితే నమ్మి ఇస్తారు. తనకి పైసా సంపాదన లేదు. ఎవరూ తనని నమ్మి డబ్బు ఇవ్వరు. ప్రియ లేనిది తన బతుకులేదు. కష్టపడి సంపాదించటం తనవల్ల కాదు. అట్లాంటప్పుడు ప్రియని కాస్త ప్రేమగా చూసి, డబ్బుకోసం వేధించకుండా ఉంటే బాగుండేదేమో. ఆడది ప్రేమకి బానిస అవు తుంది తప్పకుండా. తిట్లతో తన్నులతో సాధించలేనిపని ముద్దుమాటలతో ముద్దులతో సాధించవచ్చు. తను ప్రియని ప్రేమలో ముంచెత్తి, మంచి మూడ్‌లో ఉన్నప్పుడు తనె వరో ఏమిటో చెప్పేస్తే ప్రియ తన ప్రేమకి లొంగి ఉండిపోయేది. తను అతిగా పోయాడు. గొప్పలు కొట్టుకుంటూ, అధికారం చెలాయించా లని చూస్తే ఎవరూ ఈ రోజుల్లో ఊరుకోరు. ఆఖరికి పెళ్లాం కూడా. పని సాధించుకోవటం ముఖ్యంగానీ, అధికారం చెలాయించటం కా దు కావల్సింది.

ఇప్పుడింకెలాగా? అదిపోయి ఎవర్నో పట్టు కుని విడాకులకి నోటీసు పారేస్తుందేమో.

మనిషి వణికాడు. జేబురుమాలుతో కళ్లు తుడుచుకుంటున్నాడు. ఇంతలో దారిన పోతు న్న ఒకాయన ఇది చూసి రాజేష్‌వైపు వచ్చా డు.

"ఏమయిందయ్యా...?" అడిగాడు సాను భూతిగా.

"నా పెళ్ళాం..." అప్రయత్నంగా భోరుమ న్నాడు రాజేష్.

"ఏమైందయ్యా. ఏదన్నా జబ్బు చే సిందా...?"

"లేదుసార్. నా పెళ్ళాం నాతో కాపరం చెయ్యనని వెళ్లిపోయింది సార్. నేను బీదవాడి నట, తన గొప్పకి చాలనట. వైజాగ్ వెళ్ళి ంది. అక్కడికి వెళ్ళాలంటే, ఇంట్లో డబ్బంతా ఎత్తుకుని పోయింది సార్..." అన్నా డు రాజేష్ ఏడుస్తూనే.

వింటున్న అతను రౌద్రంతో ఊగిపోయాడు.

"దాని దుంపతెగ. ఎక్కడికి పోతుంద య్యా. నాలుగు తన్ని లాక్కురా. పెళ్ళాం పారిపోతే చావగొట్టి జుట్టుపట్టుకుని ఈడ్చు కుని రావాలిగానీ ఏడుస్తూ కూర్చుంటారుట య్యా. మగజాతి పరువు తీసేట్లున్నావే" అన్నాడతను కోపంగా.



"చెప్పానుకదా సార్... డబ్బు..." అన్నాడు రాజేష్ దీనంగా.

"నా దగ్గర ఇరవైఉన్నాయి తీసుకో..." అతను ఇరవై రూపాయలు తీసి ఇచ్చాడు.

ఇద్దర్నీ చూస్తున్న మరికొందరు దగ్గరికి వచ్చి సంగతేంటని అడిగారు. అంతా మగవాళ్ళే.

రాజేష్ పెళ్ళాం వెళ్ళిపోయిందని తెలియగానే వాళ్ళంతా కూడా మొదటి వ్యక్తిలాగా గట్టిగా రియాక్ట్ అయ్యారు.

"ఈ ఆడవాళ్లు మరీ చెడిపోతున్నారు. సినిమాలూ నవలలూ చూసి హీరోలాంటి మొగుడు కావాలనుకుంటారు. వీళ్ళకి మామూలు మగవాళ్లు కళ్లకి ఆనరు. పిల్లాడు ముత్యంలా ఉన్నాడు. బీదవాడని వెళ్ళిపోయిందిట. దానికేమన్నా బుద్ధుందా?" అన్నాడో కాయన.

"అయినా నువ్విట్లా డీలా పడకూడదయ్యా... లే. కళ్లు తుడుచుకుని ఉద్యమించు. నడుం బిగించు. ముందు శుభ్రంగా తిను. తిండి తింటేగానీ పెళ్ళాన్ని బాగా అదుపు చెయ్యలేవు. దిగులు పడకుండా భోజనం చేసి రైలెక్కు. ఎక్కడున్నా గాలించి ఈడ్చిపెట్టి రెండు తన్ను. అదే బుద్ధిగా పడుంటుంది. ఇంద ఈ పాతికా ఉంచు'' అన్నాడొకాయన.

"ఈ పదీ ఉంచు. కాపరం నిలబెట్టటానికి ఏదో ఉడతా భక్తి''

నిమిషాలమీద బోలెడు డబ్బు వచ్చింది.

అప్పుడు అర్థమైంది రాజేష్‌కి. పురుషజాతికి భార్య అంటే బానిస అనే భావం ఉందని. ఇన్నాళ్ళూ తను ఒక్కడే ఇట్లాంటి భావాలు కలవాడని అనుకుంటున్నాడు. కానీ వీళ్ళందరికీ ఇవే భావాలు.

తను ఇందాక నాలుగు రోజుల్నుంచి అన్నం తినలేదు అన్నాడు, తల్లిదండ్రులు చావుబతుకుల్లో ఉన్నారనీ వాళ్ళ మందుకి డబ్బు కావాలని అడిగాడు. ఇంటర్వ్యూకి వెళ్ళాలి అన్నాడు. డబ్బుకోసం ఎన్నో అబద్దాలు ఆడాడు. లోకంలో ఉన్న కష్టాలన్నీ తనకే వచ్చినట్లు కథలు అతికినట్లు అల్లాడు.

అయినా ఒక్కరూ పైసా విదల్చలేదు. కానీ పెళ్ళాన్ని తన్నటానికి అనగానే ....

ఒక్కొక్కళ్లూ ఇంతింత డబ్బు ఇస్తున్నారు. అంటే మనిషికి అన్నం లేకపోయినా, చావుబతుకుల్లో ఉన్నా, ఉద్యోగం లేకపోయినా, ఏమీ లేకపోయినా ఫర్వాలేదు.

కానీ...

పెళ్ళాన్ని మాత్రం చెయ్యిదాటి పోనీయకూడదు. తిట్టి తన్ని అదుపులో పెట్టుకోవాలి.

అదన్నమాట సంగతి.

ఈ విషయం తెలిస్తే ఇంతసేపు అనవసరంగా ఏవేవో చెప్పి ఏడ్చే బదులు ముందే ఉన్నమాట చెప్పేసి ఉండేవాడు.

జేబులు నిండాక రాజేష్ అక్కడినుంచి కదిలాడు.

ఏంచెయ్యాలి? ప్రస్తుత కర్తవ్యం ఏమిటి? అతనికి మహేంద్ర సలహా తీసుకోవటం మంచిదన్పించింది. మహేంద్ర వైజాగ్‌కి తోడు వస్తే బాగుంటుంది. మహేంద్ర గూండాగిరీ బాగా చెయ్యగలడు. ప్రియ రానని మొరాయిస్తే నాలుగు తన్ని తీసుకురావటానికి, బెదిరించటానికి మహేంద్ర సాయం ఎంతైనా అవసరం.

మహేంద్ర ఇంటికి వెళ్ళాడు. అదృష్టంకొద్దీ అతను ఇంట్లోనే ఉన్నాడు.

"ఏంటి సంగతి'' అన్నాడు మహేంద్ర, దీనంగా ఉన్న రాజేష్ అవతారం చూసి.

రాజేష్ సంగతి చెప్పాడు.

అంతావిని మహేంద్ర మౌనంగా ఉన్నాడు.

"వైజాగ్‌కి నువ్వు తోడు రావాలి'' అన్నాడు రాజేష్.

"అక్కడ లేకపోతే..."

"ఇంకెక్కడ ఉంటుందో ఆలోచించి అక్కడకి వెళ్ళాలి'' మహేంద్ర ఏదో ఆలోచిస్తున్నాడు.




ఇంత చిన్నపనికి మహేంద్ర ఇంత ఆలోచించటం రాజేష్‌కి ఆశ్చర్యం కలిగించింది.

"నా కోసం రావాలి... తప్పదు ప్లీజ్" అన్నాడు.

"వస్తాను. కానీ రాజేష్... నువ్వు చేసింది బాగాలేదు. మనది అంతా కరెక్ట్‌గా ఉంటే మనల్నెవరూ ఏం చెయ్యలేరు. కానీ నువ్వు పోవటమే రాంగ్‌రూట్‌లో పోయావు. ఆడదాన్ని కంట్రోల్లో పెట్టటం కష్టం. అందులో ఉద్యోగం చేస్తున్నదాన్ని కంట్రోల్లో పెట్టటం ఇంకాస్త కష్టం. అందులో నీకు అసలు ఉద్యోగం లేక, పెళ్ళానికి మాత్రమే ఉంటే మరీ కష్టం. ఉద్యోగం లేక, సంపాదన లేక హోల్ మొత్తం ఆవిడమీదే ఆధారపడితే నిన్ను కుక్కలా చూస్తుంది. నువ్వు అది గ్రహిస్తే బాగుంటుంది" అన్నాడు.

"నిజమే. నాకు బుద్ధొచ్చింది. ఆవిడ్ని ఎట్లాగో ఒకలాగా తీసుకువస్తే కాళ్లూ గడ్డం పట్టుకుని బుద్ధిగా ఏదోక పనిచేస్తాను. అసలు ఆవిడ వస్తే చాలు. ఇంకేం అఖ్ఖర్లేదు. ఎంత కష్టమైనా పడతాను" అన్నాడు రాజేష్.

"సరే. పద పోదాం..." అన్నాడు మహేంద్ర.

"ఇప్పుడేనా?" అన్నాడు రాజేష్.

"ఊరికి కాదు. మా ఫ్రెండొకడున్నాడు. వాడికి చెప్తే అరగంటలో మీ ఆవిడ ఆచూకీ చెప్పేస్తాడు. ఎక్కడున్నదో ఖచ్చితంగా తెలుస్తే వెళ్ళి పట్టుకోవచ్చు" అన్నాడు మహేంద్ర.

ఇద్దరూ బయల్దేరారు, అతని ఇంటికి.

బస్ ఎక్కారు.

యధాలాపంగా ముందుకి చూసిన రాజేష్‌కి బస్సులో ముందుసీట్లో కూర్చుని ఉన్న రాజశ్రీ కనిపించింది.

ఆమె ప్రియ ఫ్రెండ్... ఒక్కత్తే రూమ్ తీసుకుని ఉంటున్నదని ప్రియ ఒకసారి చెప్పటం గుర్తుకొచ్చింది.

మెల్లగా చిన్నగొంతులో మహేంద్రకి చెప్పాడా సంగతి. "అట్లాగా. అయితే బహుశా ఈమె దగ్గరే ఉండిఉంటుంది మీ ఆవిడ. ఇంకేం మాట్లాడుకోవద్దు మనం. ఆవిడ మనల్ని గమనిస్తే కష్టం. ముందునుంచే దిగిపోతుంది. కాబట్టి మనల్ని చూడదు. ఇద్దరం ఆవిడ వెనకే మెల్లగా చప్పుడు చెయ్యకుండా దిగి, వెనకేవెళ్ళి ఇల్లు కనుక్కుందాం" అన్నాడు మహేంద్ర.

రాజేష్ తల ఊపాడు.

ఇద్దరూ మౌనంగా రాజశ్రీ ఎక్కడ దిగుతుందా అని చూస్తున్నారు.

తన స్టాప్ రాగానే రాజశ్రీ లేచింది.

ఇద్దరూ వెనక తలుపు దగ్గర చేరారు.

రాజశ్రీ దిగగానే బస్సు కదిలింది

ఆమెని కాస్త ముందుకి పోనిచ్చి ఇద్దరూ కదులుతున్న బస్సులోంచి దిగారు.

రాజశ్రీ గబగబా అడుగులు వేస్తోంది. వెనకే వాళ్ళిద్దరూ.

రాజశ్రీ నాలుగువీధులు దాటి, ఒక ఇంటి ముందు ఆగి గేట్ తెరిచింది.

గేట్ చప్పుడికి కాబోలు, పక్కగా ఉన్న గదిలోంచి ఒక ఆకారం వచ్చి తలుపు తీసింది.

ప్రియ...

"అది మా ఆవిడే" అన్నాడు రాజేష్.

"అయితే పద" ముందుకి అడుగేశాడు మహేంద్ర.

ఇద్దరూ గేటు తోసుకుని లోపలకి వెళ్ళారు.

ప్రియ వాళ్లని చూస్తూనే తలుపు వేసెయ్యబోయింది.

ఒక కాలు అడ్డం పెట్టి తలుపు వెయ్యనివ్వకుండా అడ్డుపడ్డాడు రాజేష్.

నెట్టుకుంటూ లోపలకి నడిచాడు.

"ఇంటికి పద" అన్నాడు.

"నేను రాను" అంది ప్రియ.

రాజశ్రీ ఇవేవీ ఇష్టం లేనట్లు మొహంపెట్టి చూస్తోంది. ఆమె ప్రియకి సాయంచేసే ఉద్దేశంలో లేదని ఆమె మొహం చూస్తూనే తెలిసిపోయింది రాజేష్‌కి.

"రావా... ఏం పుట్టింది'' అన్నాడు విసురుగా.

"ఏం పుట్టిందా. నాకేం పుట్టలేదు. నీకే మాయరోగం పుట్టి నన్ను మోసం చేశావు'' అంది ప్రియ.

"నీ సంగతి నాకు తెలుసు. డబ్బు కనబడితే చాలు ఎగబడి వెళ్లే మొహానివి. నాకు బాగా డబ్బుందని అనుకుని నన్ను పెళ్ళి చేసుకున్నావు. ఇప్పుడు డబ్బులేదని తెలిసేసరికి విదిలించి కొడుతున్నావు. నువ్వు ఉత్తి కుళ్లుబోతువి. ఎవరికీ పైసా పెట్టటం నీకు ఇష్టం ఉండదు. ఆఖరికి కట్టుకున్నవాడికి కూడా. నీ ఆటలు నేను సాగనియ్యను. నువ్వు చచ్చినట్లు వచ్చి కాపరం చెయ్యాల్సిందే'' అన్నాడు రాజేష్ కరుగ్గా.

ప్రియ వినబడనట్లు చూస్తోంది.

"వెర్రివేషాలు కట్టిబెట్టి ముందు పద" అరిచాడు రాజేష్.

ప్రియకి అతను వచ్చి ఇక్కడ అరుస్తూ మాట్లాడుతుంటే ఇబ్బందిగా ఉంది. రాజశ్రీ ఏమంటుందోనని భయం. చుట్టుపక్కలవాళ్లు ఏమనుకుంటారోనని ఇంకా భయం. భయపడుతూ, బెదురుతూ తలెత్తి చూసింది.

ప్రియ తనని చూసి బెదరటం రాజేష్‌కి సంతోషం కలిగించింది. ఇప్పుడే ఈ పట్టునే ఇంకాస్త గట్టిగా మాట్లాడితే ప్రియ బెదిరి వచ్చేస్తుందన్న నమ్మకం కలిగింది.

"నేను రాను..." అంది ప్రియ.

ఆ గొంతులో ఇందాకటి ధైర్యం లేదు.

"నువ్వు అట్లానే అంటావని నాకు తెలుసు. కానీ నువ్వు రావాలి. ఏం? ఎందుకు రావు'' అన్నాడు రాజేష్ అరుస్తూ.

"అవన్నీ నిన్ననే చెప్పానుగా'' అంది ప్రియ.

"చెప్పావులే. నేనూ కొన్ని చెప్పాలి. విన్నావా, నీకే మంచిది. లేకపోతే నీకే నష్టం" అన్నాడు రాజేష్ ఆమె పక్కన చేరి మెల్లగా.

ప్రియ మొహంలో బెదురు కనిపించింది.

"ఏం చెప్పాలి?" అంది.

"అటురా'' ఇంటిముందున్న కాంపౌండ్‌లోకి వెళ్ళాడు.

"ప్రియా... నువ్వు నన్ను కాదని ఇక్కడికి వచ్చేంత ధైర్యం నీకెలా వచ్చింది. ఆ ఉద్యోగాన్ని చూసుకునేకదూ''

ప్రియ అతనివైపు ఒకసారి అసహ్యంగా చూసి తల తిప్పేసుకుంది.

"ఆ ఉద్యోగం, నన్ను విడిచిపెడితే, ఒక్క క్షణం కూడా చెయ్యనివ్వను'' అన్నాడు రాజేష్.

"అంటే..."

"ఏముంది సింపుల్. నేను ఉద్యోగం చెయ్యటంలేదు. నేను ఎట్లా పోయినా ఎవడూ నన్ను అడగడు. కానీ నువ్వు ఉద్యోగం చేస్తున్నావు. బాధ్యతగా ప్రవర్తించాలి. మధుతో నీకున్న సంబంధం నాకు తెలుసు. దాన్ని రుజువు చేసే సాక్ష్యాలు నా దగ్గర ఉన్నాయి. వాటిని బయటపెడితే వెంటనే నీ ఉద్యోగం పోతుంది. ఒకవేళ ఉన్నా ఎవరూ నిన్ను గౌరవించరు. నేను రోజూ మీ ఆఫీసుకి వచ్చి బండబూతులు తిడుతుంటాను. ఇట్లా ప్రవర్తించాలి అన్న నియమావళి నాకు లేదుగా. ఏం చేసినా చేస్తాను. కానీ నీకు మీ ఆఫీసు రూల్స్‌కి, నియమాలకి విరుద్ధంగా ప్రవర్తించే హక్కులేదు. నేను నిన్ను ఏమైనా అనగలను. ఏ బూతులైనా తిట్టగలను. కానీ, నీ ప్రవర్తన నాలాంటి రోడ్డుమీద తిరిగేవాళ్ళతో సమంగా ఉండలేదు. ఉండకూడదు. నేనెంత అసభ్యంగా అయినా ప్రవర్తించి నీ బతుకు నరకం చేస్తాను. అంతేగానీ, నన్ను కాదని వెళ్లిపోయిన ఆడదాన్ని సహించలేను'' అన్నాడు రాజేష్.

ప్రియ మౌనంగా ఉంది.

"నీ సంగతి చెప్తే నీ ఫ్రెండ్ కూడా తరిమేస్తుంది. మధు విషయం డప్పుకొట్టుకుంటూ తిరుగుతాను. అంతా నీ మొహాన





# ఏరిన ముత్యాలు

☆ అబద్ధం గురించి కూడా నేను తప్పక నిజమే పలుకుతాను.

-టాగూర్

☆ గతం అనే వాహనం ఎక్కి ఎక్కడికీ ప్రయాణించలేము.

-గోర్కీ

☆ ఉన్న జ్ఞానానికన్నా ఊహ గొప్పది.

-ఐన్‌స్టీన్

☆ సంతృప్తి సహజ సంపద. ఆడంబరం కృత్రిమ దారిద్ర్యం.

-సోక్రటీస్

☆ జూదాలూ, వాదాలు వేదనను కలిగిస్తాయి.

-అవ్వయ్యార్

☆ తీసుకోవడమేకాదు. ఇవ్వడం కూడా నేర్చుకోవాలి.

-పరమహంస

☆ సామాజిక ఉత్పత్తికి తోడ్పడే శ్రమకు ఉపకరించే విధంగా విద్య ఉండాలి.

-లెనిన్

☆ అజ్ఞానం ఎప్పుడూ మార్పుకు భయపడుతూ వుంటుంది.

-పండిట్‌నెహ్రూ

☆ ప్రతికూల పరిస్థితులు స్నేహాన్ని అగ్నిపరీక్షకు గురిచేస్తాయి.

-మహాత్మాగాంధీ

☆ యుద్ధానికంటే పరిపాలనకు సరైన నడివడిక ఎక్కువ అవసరం.

-నెపోలియన్

☆ మర్యాదకంటే విలువైనది మనిషికి లేదు.

-టెరెన్స్

☆ ప్రభుత్వం అవినీతిమయం అయినకొద్దీ చట్టాలు ఎక్కువ అవుతాయి.

-టాసిటస్

☆ ప్రేమికుడిని ప్రపంచమంతా ప్రేమిస్తుంది.

-ఎమర్సన్

☆ న్యాయపాలన ప్రభుత్వానికి ఉక్కుస్తంభం వంటిది.

-జార్జి వాషింగ్టన్

☆ మాతృభాషలో పూర్తి పాండిత్యం సంపాదించలేని వ్యక్తి మరొక భాషలో నిష్ణాతుడు కాలేడు.

-జార్జి బెర్నార్డ్‌షా

☆ డబ్బు విషయంలో అందరిదీ ఒకటే మతం.

-వోల్టేర్

సేకరణ: **అజయ్‌బాబు**

ఉమ్మేస్తారు. నీ ఇష్టం. ఏం చేస్తావో ఆలోచించు. మంచిగా ఉంటే నేనూ మంచిగా ఉంటాను. ఎదురు తిరిగితే నా అంత దుర్మార్గుడు ఉండడు. తెలివిగల దానివి... ఆలోచించు. నువ్వు తిరిగి వస్తే నేనూ ఏదో ఒక ఉద్యోగం చూసుకుని బుద్ధిగా ఉంటాను'' అన్నాడు రాజేష్.

ప్రియ ఆలోచిస్తున్నట్లు కనిపించింది. ఆమె మొహంలో మారుతున్న రంగులు చూసి రాజేష్ నవ్వుకున్నాడు.

"ఆలోచించు... ఒక పావుగంటాగి వస్తాను. వచ్చేట్లయితే పెట్టె సర్దుకుని రెడీగా ఉండు. లేకపోతే కుక్కపాట్లు పడేందుకు సిద్ధంగా ఉండు'' అన్నాడు రాజేష్

"వస్తున్నాను'' అనేసి, ప్రియ లోపలకి వెళ్లి పది నిమిషాల్లో సూట్‌కేస్‌తో తిరిగి వచ్చింది.

★ ★ ★

ప్రియ ఒకసారి వెళ్లిపోయి తిరిగి వచ్చాక రాజేష్‌కి ఆమెని చూస్తే చాలా చులకనగా ఉంది.

మొదట్లో మూడు రోజులు బాగానే ఉన్నాడు. ఇక అప్పట్నుంచి ధుమధుమలూ, చిటపటలూ మొదలుపెట్టాడు. కొత్తగా సాధింపులు కూడా వాటికి చేర్చాడు.

"అవున్లే నీకేముంది... ఒకడితో శుభ్రంగా తిరిగి, ఇంకొకడిని చేసుకుని, ఏమీ జరగనట్లు హాయిగా కాపరం చెయ్యగలవు. నువ్వు పెళ్లికీ వివాహబంధానికీ విలువ ఇస్తావని అనుకోవటం నా బుద్ధి తక్కువ. నీకు మొగుడంటే లెఖ్ఖలేదు..."

"అందరూ నా మొహానే నవ్వుతున్నా ఏదో కట్టుకున్న నేరానికి నీతో కాపురం చేస్తున్నాను''

"అసలు నన్ను మోసం చేశావు. హాయిగా తిరుగుతున్న వాడిని పట్టుకుని ఉచ్చులో బిగించావు. నాతోటి వాళ్లందరికీ బోలెడు బోలెడు కట్నం, కానుకలు యిచ్చి పెళ్లి చేశారు. నాకేం ఉంది నా బొంద. ఖర్మ కాకపోతే నిన్ను చేసుకున్నందుకు నాకేం ముచ్చట జరిగింది. ఏదో పెళ్లి యిట్లా తేలిగ్గా జరిగిపోయిందికదా అని ఏమన్నా జ్ఞానం, కృతజ్ఞత ఉన్నాయా మీ బాబుకి. డబ్బు అడిగితే యివ్వటానికి ఏడుస్తాడేం'' అన్నాడు.

రోజూ ఏదో ఒకటి తిట్టి మూడ్ చెడగొడుతూనే ఉంటాడు.

"ఉద్యోగం చేస్తానన్నారుగా చెయ్యండి'' అంది ప్రియ ఒకసారి.

"ఇప్పించు... చేస్తాను'' అన్నాడు. ప్రియ బాబాయి ఒకాయన ఒక ప్రైవేట్ కంపెనీలో మానేజర్‌గా చేస్తున్నాడు.

ఆయన్ని అడిగింది. అర్హతలు దాచకుండా చెప్పింది.

"ఏం ఉద్యోగం వస్తుందమ్మా. ఎం.ఏలు చదివిన వాళ్లకే లేవు. పదోక్లాసు కూడా కానివాడికి ఏం వస్తుంది'' అన్నాడాయన.

'ఏదో ఒకటి బాబాయ్... ప్యూన్ ఉద్యోగం లాంటిది ఉండదా... ప్లీజ్... చూడండి'' అంది.

'ప్యూన్ ఉద్యోగం చేస్తాడా మరి'' అన్నాడాయన సాలోచనగా.

"చెయ్యకేం చేస్తాడు'' అంది ప్రియ.

"సరే రేపు రమ్మను'' అన్నాడు ఆయన.

ఆ సంగతి రాజేష్‌కి చెప్పింది.

రాజేష్ ఉగ్రంగా చూశాడు.

"ఏం ఉద్యోగం, ప్యూన్ ఉద్యోగమా, ఏమే... నీకెలా ఉంది. పళ్లు రాలగొడతాను జాగ్రత్త. పాడుముండా... విరగబడి పోతున్నావుకదే! నీకెంత ధైర్యం, నాకు ప్యూన్ ఉద్యోగం తీసుకురావటానికి. నువ్వేమో టక్కుటిక్కుమంటూ గొప్పగా కాలుమీద కాలేసుకుని ఫాన్ కింద, టేబుల్ ముందు దర్జాగా ఆఫీసులో ఉద్యోగం చేసేదానివీ, నేనేమో వాడికీ వీడికీ టీలు మోసుకుంటూ ఫ్లాస్కులు పట్టుకుని తిరిగే వాడినీనా... చంపుతాను జాగ్రత్త' అని అరిచాడు.

"మరి పదో క్లాసుకి యింకే ఉద్యోగం




వస్తుంది'' అంది ప్రియ.

"రాకపోతే పోనీ... యిప్పుడేం లోటు వచ్చింది. ఇట్లాగే ఉంటాను'' అన్నాడు రాజేష్.

"ఏంటండీ... మగవాళ్లు ఊరికేఉంటే ఏం బాగుంటుంది. అందరూ మిమ్మల్ని తక్కువ చేసి మాట్లాడితే మీకూ బాగుండదుకదా! పోనీ యండి. కొన్నాళ్లు చేసి చూడండి. బాగా లేకపోతే మానెయ్యండి'' అంది ప్రియ.

"నేను చెయ్యను'' అని భీష్మించుకుని కూర్చున్నాడు రాజేష్.

ఇంక ఎట్లా ఒప్పించాలో ప్రియకి అర్థం కాలేదు.

అతను ఉద్యోగం చేసి సొంతంగా సంపాదిస్తుంటే డబ్బు విలువ తెలిసి వస్తుందనీ, కష్టార్జితం అంటే దాన్ని తేలిగ్గా ఖర్చుపెట్టెయ్యలేడనీ అనుకుంది ప్రియ. అతను ఉద్యోగం చేస్తే తప్పకుండా మారతాడనీ ఉంది. చేస్తే బాగుండుననీ ఉంది. కొద్దిరోజులు పనిచేస్తే శ్రమ విలువ తెలిసి వస్తుందేమో.

తన ఆలోచనలకి తనకే నవ్వు వచ్చింది.

"ఎంత పెద్దరికం వచ్చింది తనకి. యిదివరకు తల్లి తిండి తినమని బతిమాలితేగానీ తినేది కాదు. ఎంతో రుచిగా ఉంటేగానీ నోట్లో పెట్టుకునేది కాదు. పని చేసేదికాదు. అన్నీ అమర్చి పెడుతుంటే తిని ఉద్యోగం చెయ్యటమే గొప్ప పనిగా ఉండేది. ఇప్పుడు యిట్లా అన్నీ తనే చేసుకుని తినటమేకాక, యింటి పనులన్నీ చేసుకుంటూ ఆ పైన భర్త ఉద్యోగం గురించీ, అతనికి బాధ్యతలు తెలియాలనీ అనుకుంటూ ఆలోచిస్తోంది. చిల్లరమల్లరగా చిన్న పిల్లలకన్నా అధ్వాన్నంగా ప్రవర్తించే తను ఇప్పుడు ఒకళ్లకి పెద్దరికం వహించాల్సిన సమయం వచ్చింది.

బతిమాలి, బుజ్జగించి, లాలించినా రాజేష్ ఒప్పుకోలేదు.

"నాకెంత చిన్నతనంగా ఉంటుంది. ఇట్లా ప్యూన్ ఉద్యోగం చెయ్యాలంటే చెయ్యనుగాక చెయ్యను'' అన్నాడు.

"పోనీ పాత పనే చెయ్యండి. ఆ మెకానిక్ షెడ్‌లో పనిచేసి బాగా అనుభవం వచ్చాక మీరే ఒక షెడ్ సొంతంగా పెట్టుకోవచ్చుగా'' అంది ప్రియ.

రాజేష్‌కి నవ్వు వచ్చింది.

ఆ షెడ్డు చుట్టుపక్కల కనిపించినా సరే, దాని యజమాని తనని చావగొడతానని హెచ్చరించాడు. ఇప్పుడు ఉద్యోగం కాదు సరికదా, దాని దరిదాపులకి కూడా వెళ్లే అవకాశం లేదు తనకి.

అవేవీ బయటపెట్టకుండా ప్రియని హడలగొట్టాడు.

"ఏడిశావ్... మెకానిక్ పని అంటే మాటలా బోలెడు చాకిరీ చెయ్యాలి. నావల్లకాదు. నేను ఏం చెయ్యాలో నేనే నిర్ణయించుకుంటాను. నువ్వు నాకు సలహాలు యివ్వఖర్లేదు'' అన్నాడు.

"ఏదో ఒకటి చెయ్యండి... పోనీ మీరన్నట్లే మీరే ఏదో ఒక నిర్ణయం చేసుకోండి'' అంది.



ప్రియకి ఆరోజు కళ్లు తిరిగినట్లనిపించింది. ఈమధ్య అన్నం సహించటంలేదు. ఏది తిందామన్నా అదోలా అనిపిస్తోంది.

"ఏంటోలా ఉంది సుమండీ. అన్నం తిన బుద్ధి కావటంలేదు'' అంది రాజేశ్వరితో

రాజేశ్వరి నవ్వింది.

"ఏదన్నా విశేషమా..." అంది.

ప్రియ ఉలిక్కిపడింది.

అవును తను ఆ విషయం గురించి ఆలోచించనే లేదు. ఏమో విశేషమేనేమో.

ఆరోజు సాయంత్రం డాక్టర్ దగ్గరకి వెళ్లింది. డాక్టర్ పరీక్ష చేసి, యూరిన్ ఎగ్జామినేషన్‌కి యివ్వమని చెప్పింది.

మర్నాడు రిపోర్ట్ వచ్చాక ఖరారు చేసింది ప్రియకి ఏమీ పాలుపోలేదు.

తనకే ఠికానా లేనట్లుంటే యింకా తనకి ఒక బిడ్డా.

వివాహబంధం చూస్తే తుమ్మితే ఊడిపోయే ముక్కు. రాజేష్‌ని భరించటం తనవల్ల కావటంలేదు. ఒక్కొక్కసారి వెర్రికోపం వచ్చి అతన్ని నాలుగు తందాం అనిపిస్తోంది కూడా అప్పుడప్పుడూ నిరాశతో చచ్చిపోవాలన్న కోరికకూడా కలుగుతోంది. తన పరిస్థితే యిట్లా ఏడిస్తే యింక పుట్టబోయే బిడ్డ గతేంటి. పిల్లలు పుట్టగానే సరిపోదు. వాళ్లకి ఎన్నో సమకూర్చాలి. ఖర్చులు పెరుగుతాయి. పని పెరుగుతుంది. రాబడి మాత్రం పెరగదు. రాజేష్ రోజురోజుకీ ఖర్చు పెంచటమే తప్ప తగ్గించటం లేదు. ఏమాత్రం వీలున్నా అతన్ని వదిలించుకుని పారిపోవాలి అనిపిస్తోంది. తిడుతుంటాడు, కొడుతుంటాడు. అప్పులు చేయిస్తుంటాడు. ఏంటి కర్తవ్యం. ఇట్లాంటప్పుడు పుట్టబోయే బిడ్డకి స్వాగతం చెప్పటం అంత తెలివైన పని కాదేమో... పోనీ అబార్షన్ చేయించేసుకుంటే

అంతలోనే ఏదో ఆశ...

ఏమో పిల్లలు పుడితే రాజేష్ మారతాడేమో. రావణాసురుడిలాంటి వాడు కూడా పిల్లలపట్ల మమకారం చంపుకోలేడు. ఎంత దుర్మార్గులకైనా పిల్లలమీద ప్రేమ ఉంటుంది. పిల్లలు పుడితే, వాళ్ల ముద్దుమాటలూ, ముద్దు చేష్టలూ రాజేష్‌ని అలరిస్తాయి. వాళ్లకోసం... వాళ్లని బాగు చెయ్యటం కోసం, వాళ్ల సౌఖ్యాల కోసం, తన చెడ్డ అలవాట్లు మానుకుని బాధ్యత తెలుసుకుని మసులుకుంటాడేమో.

బిడ్డని కనటానికే నిశ్చయించుకుంది ప్రియ.

రాజేష్‌కి చెప్పింది, తనకి నెల తప్పిందని.

"ఓహో" అని ఏ భావమూ ప్రకటించకుండా వెళ్లిపోయాడు.

తల్లికి ఉత్తరం రాశాడు.

ఆవిడ చంద్రయ్యని తీసుకుని మరో వారంలో వచ్చింది. చంద్రయ్య రాజేష్ మేనమామని తెలిశాక ప్రియకి ఏడుపూ, నవ్వూ కూడా వచ్చాయి.

చంద్రయ్య పాలేరు యాక్షన్ చేసిన సంగతి పూర్తిగా మర్చిపోయి యిప్పుడు దర్జాగా రాజేష్ మేనమామ హోదాలో మాట్లాడుతున్నాడు.

శుభ్రంగా తిని హాయిగా తిరుగుతాడు.

శాంతమ్మ మరో రెండు రోజులుమాత్రం ఉండి ఊరికి వెళ్లిపోయింది. చంద్రయ్య మకాం పూర్తిగా యిక్కడికే మార్చి పారేశాడు.

అత్తగారు వెళ్లిపోయినా, మమగారు లేకపోయినా ఆడబిడ్డలూ మరుదులూ లేకున్నా భర్త మేనమామల సేవమాత్రం తప్పలేదు ప్రియకి.

మేనమామ ముందు తన గొప్ప తెలియాలని రాజేష్ ప్రియమీద జులుం, అధికారం చెలాయిస్తున్నాడు.

ఒక్కపనికి సాయం ఉండడు. పైగా అది చెయ్యలేదు, యిది చెయ్యలేదని సాధింపులు.

ఇంటెడు చాకిరీ చెయ్యాలి. బజారులో పనులు కూడా తనే చక్కబెట్టాలి. షాపింగ్ లాంటివి ఉంటే తనే చెయ్యాలి. ఆరోగ్యం కూడా బాగుండటం లేదు. ప్రియకి నెలలు నిండుతున్న కొద్దీ తన ఖర్మకి ఏడుపు ఎక్కువవుతోంది. విశ్రాంతి లేదు. మంచి మందులు లేవు. మందుల సంగతి అటుంచితే అసలు తిండే సరిగాలేదు.

ఉన్నదంతా శుభ్రంగా తినేసి మిగిలిందే





ప్రియకి వదులుతారు వాళ్లు. ఎప్పుడూ తిండి మొహం కూడా ఎరగని వాళ్లల్లా ఎగబడి తినేస్తారు. మధ్యాహ్నంపూట టిఫిన్లు చేసుకు తింటారుగానీ ప్రియకి రుచికి కూడా ఒక్క ముక్క ఉంచరు.

తల్లితండ్రులు వచ్చి ప్రియకి పళ్లూ టానిక్‌లూ కొనిచ్చారు.

చంద్రయ్య కూడా వచ్చి చేరటంవల్ల అదనపు ఖర్చుతో డబ్బు అసలు చాలటంలేదు.

ఎదురింటావిడని అడిగి డబ్బు తెమ్మన్నాడు రాజేష్. మళ్లీ అయిదు వందలు అప్పు... ఆవిడ ఏమనుకుందోగానీ డబ్బు మాత్రం యిచ్చింది.

"మీవారు ఫారిన్ వెళ్తున్నారన్నారుగా. ఎంతవరకూ వచ్చాయి ప్రయత్నాలు'' అంది డబ్బిస్తూ.

"తొందర్లోనే వెళ్లొచ్చండీ'' అంది ప్రియ.

ఆవిడకి ఉన్నమాట చెప్పలేదు.

"మావాడికి ఫీజుకని తెచ్చాను ఈ డబ్బు. మళ్లీ ఎప్పుడిస్తారు'' అంది ఆవిడ.

"మూడు రోజుల్లో యిచ్చేస్తానండీ'' అంది ప్రియ.

ఇంటికి కావల్సిన బియ్యం, పప్పు అప్పు తీసుకుని వచ్చింది. సరుకులన్నీ బొత్తిగా నిండుకున్నాయి. దుకాణం వాడిలో ఇదివరకటి మర్యాద లోపించింది. అతని డబ్బు కూడా సరిగ్గా తీర్చకపోవటం వల్ల ఈ ప్రవర్తన అని ప్రియకి అర్థమైంది, కానీ ఏదీ గమనించనట్లే నటిస్తూ సరుకులు తెస్తోంది. ఎవరెంత చులకనగా మాట్లాడినా, ఎంత నిర్లక్ష్యంగా ప్రవర్తించినా తనే అప్పులు తెస్తోంది. దానికి కారణాలున్నాయి. రాజేష్‌ని పంపిస్తే ఎంత తెచ్చుకుని ఎంత ఖర్చుపెట్టేసుకుంటాడో తెలీదు. ఎన్ని వేలయినా నిమిషాలమీద ఖర్చుపెడతాడు. దుకాణంవాళ్లు వంద రూపాయల సరుకిచ్చి, రెండు వందలు రాసుకున్నాపట్టించుకోడు, చూడడు.

వారం గడిచినా డబ్బు యివ్వకపోయేసరికి ఎదురింటావిడ అడిగేసింది.

యధాప్రకారం రాజేష్ డబ్బుని ఖర్చుపెట్టేసుకున్నాడు. ఆవిడ అప్పు తీర్చే మార్గం తోచలేదు ప్రియకి.

ఆవిడ పిలిచి మరీ అడిగింది. పైగా మీ ఆయన ఏం చదువుకోలేదుట. ఉద్యోగం సద్యోగం లేదటగా అని అడిగింది.

ప్రియకి అవమానంతో, కోపంతో గుండె దహించుకుపోయింది.

ఆవిడ అక్కడితో ఊరుకోలేదు.

"మన పరిస్థితి తెలుసుకుని మసులుకుంటే ఎవళ్లూ ఏమీ అనరండీ. ఉన్న సంగతి చెప్పుకుంటే ఎవరూ నవ్వరు. కానీ లేని గొప్పలు చెపుతుంటే ఒకరోజు కాకపోతే యింకోరోజు నిజం తెలిసి చచ్చేట్లు నవ్వుతారు. పోనీ ఏదిఏమైనా ఫర్వాలేదుగానీ, యిన్ని గొప్పలు చెప్పి, అప్పులు అడిగితే మరీమరీ నవ్వుతారు'' అంది వెటకారంగా చూస్తూ.

ప్రియ ఏమీ చెప్పకుండా తిరిగి వచ్చేసింది. ఇంట్లోకి వస్తుంటే పక్కింటావిడ పిలిచింది.

గోడదగ్గరకి వెళ్లింది ప్రియ.

"ఏమిటండీ... ఏదో గొడవలా ఉంది'' అంది ఆసక్తిగా చూస్తూ.

"ఏం లేదండీ... ఎందుకులెండి... పాపం ఎంతైనా సాటి ఆడది... మనమూ జాలి చూపించాలి'' అంది ప్రియ.

"ఏం జరిగిందండీ అసలు''

"ఏమీలేదండీ...ఏదో స్నేహంగా ఉంటోంది. పోనీలే పాపం అని మంచీచెడ్డా మాట్లాడబోయాను. ఆవిడ యింటికి ఎవరెవరో మగాళ్లు వస్తుంటారు... మీరూ చూస్తూనే ఉన్నారనుకుంటాను'' ప్రియ ఆగింది.

"అవును... వాళ్ళ అన్నయ్యలని కాబోలు చెప్పింది''

"అన్నయ్యలూ కారు, తమ్ముళ్లూ కారు.



వాళ్ళంతా ఆవిడ కోసమే వస్తున్నారు డబ్బు తీసుకుని. సర్లెండి. అవన్నీ మానుకోమని చెప్తే కోపం తెచ్చుకుంది'' అంది ప్రియ.

పక్కింటావిడ ఆశ్చర్యపోయింది.

"నిజమా... ఇంత ఘోరమా? మరి మనిషి మంచిదానిలాగే కనిపిస్తోందే... భర్తా పిల్లలూ అందరూ ఉన్నారు. ఏంటీ పాడుబుద్ధి'' అంది.

"ఆశలెక్కువై, డబ్బుకోసం దిగజారి ఉంటుంది. అయినా మనకెందుకులెండి. ఏదో స్నేహంకదా అని మంచి చెప్పబోయాను. వినలేదు. పాపమో, పుణ్యమో ఆవిడే అనుభవిస్తుంది. మనం చాటున మాట్లాడుకోవటం బాగుండదు''. అనేసి ఇవతలకి వచ్చింది ప్రియ.

ఆమె మనసు అప్పటికి నెమ్మదించింది. ఎదురింటావిడమీద కసి చల్లారింది. తనేం చెయ్యలేదనుకుంది ఆవిడ. బాగా జరిగింది. పక్కింటావిడ ఏదన్నా విన్నదంటే చాలు, పదిమందికి ప్రచారం చేస్తుంది కనీసం. ఆ పదిమందీ మరో పదిమందికి. చివరికి ఈ అబద్ధమే నిజంలా రూపుదాల్చి ఆ ఎదురింటి దాన్ని అందరూ నీచంగా చూస్తారు.

చల్లారిన కోపంతో లోపలికి నడిచింది. రాజేష్ అంతా వింటూనే ఉన్నాడు.

డబ్బు తిరిగి ఇవ్వమని అడిగినందుకు ప్రియ ఆ ఎదురింటి ఆవిడమీద సునాయాసంగా ఇంత అభాండం వేసిపారేయటం అతనికి చాలా ఆశ్చర్యాన్నీ, కొద్దిగా భయాన్నీ కలిగించింది.

"బాగానే వత్తిపెట్టావే. ఇంక పెద్ద చిచ్చు రగలబోతోంది'' అన్నాడు నవ్వుతూ.

ప్రియ వినిపించుకోకుండా లోపలకు వెళ్ళింది. ఆవిడ డబ్బు తిరిగి ఎట్లా ఇవ్వాలో అర్థం కాలేదు.

"ఏంటి. ఆ డబ్బు తిరిగి ఎట్లా ఇవ్వాలనా?'' అన్నాడు రాజేష్.

"అవును''

"ఏవో ఒకటి తాకట్టు పెట్టో, ఇంకేదో చేసో తెద్దాంలే. ఏడవకు'' అన్నాడు రాజేష్.

ప్రామిసరీ నోటురాసి ఎనిమిదివేలు తెచ్చుకున్నాడు.

★ ★ ★

ప్రియకి ఆడపిల్ల పుట్టింది.

పాపకి మూడోనెల వచ్చాక ఇంటికి తిరిగి వచ్చింది.

ఈ మూడు నెలలూ చంద్రయ్యా, రాజేష్ కలసి వంట చేసుకుని తిన్నారు.

ఇప్పుడు రాజేష్ సంగతి ప్రియ ఇంట్లో కూడా తెలిసిపోయింది.

ఎవ్వరూ పెద్దగా బాధ పడలేదు.

"ఏదో సర్దుకుపోతుండాలి'' అన్నారు.

వాళ్ళతో ఏం చెప్పుకున్నా లాభం ఉండదని ప్రియ ముందే ఊహించింది.

"పాప కూడా పుట్టింది. ఇప్పుడైనా మీరు మారాలి. కాస్త బాధ్యత తెలుసుకుని ప్రవర్తించండి. ఏదో ఒకటి చెయ్యండి. ఎంత చిన్న వ్యాపారం అయినా ఫర్వాలేదు'' అంది ప్రియ.

"ఎంత చిన్నదైనా పదివేలన్నా ఉండాలి. ఎవరు ఇస్తారు'' అన్నాడు రాజేష్.

"మొన్న వచ్చిన ఎనిమిదివేలూ దాస్తే ఎంత బాగుండేది'' అంది ప్రియ.

"ఏం దాస్తాం. ఎప్పుడూ ఉండే దరిద్రమేగా, కాస్త డబ్బున్నప్పుడన్నా హాయిగా తిందామని కాస్త ఖర్చుపెట్టుకున్నాను. నువ్వా కుళ్ళుబోతు నంబర్‌వన్‌వి. మొగుడు తిన్న తిండికి కూడా ఏడ్చే రకానివి. నీలాంటిదాన్ని ఎక్కడా చూసిఉండరు ఎవరూ'' అన్నాడు రాజేష్ ఎప్పటిలాగే.

ఉంగరం, గొలుసులాంటివి ముందే తాకట్టు పెట్టుకున్నారు. ఇప్పుడు డబ్బు ఎట్లాగ మరి?

"ఒకపని చేద్దాం. నిరుద్యోగ యువకులకి అవేవో రుణాలు ఇస్తున్నారట. దానికోసం ప్రయత్నిస్తాను'' అన్నాడు.




అప్పటినుంచే రుణం కోసం తిరుగుతున్నా నంటూ బోలెడు డబ్బు తీసుకున్నాడు.

భర్త ఏదో ఒకపని చేస్తానన్నాడు. అంతే చాలన్న ఉత్సాహంలో ఎక్కడెక్కడినుంచో డబ్బు తీసుకొచ్చి ఇచ్చింది ప్రియ.

ఎటు తిరిగాడో, ఏం చేశాడోగానీ చివరకి రుణం మంజూరు చేయించుకొచ్చాడు. పదివేలు.

గ్యారంటీ కావాల్సివచ్చింది.

ప్రియ తనే గారంటీ సంతకం చేసింది.

తమ సంగతి తెలిసిపోయి ఎవరూ వంద రూపాయలు అప్పు అడిగితేనే ఇవ్వడంలేదు. ఇంక పదివేలకి గారంటీ అంటే చచ్చినా ఇవ్వరు.

తండ్రిని అడిగితే ఇస్తాడేమో అనిపించింది. కానీ ధైర్యం చాలలేదు.

తను చేసిన తప్పులవల్లో, తనలో ఉన్న లోపాలవల్లో, దేనికోగానీ తండ్రి ఎదుటపడి ధైర్యంగా మాట్లాడే శక్తిలేదు తనకి. అదీగాక ఆయనేమన్నా ప్రశ్నలడుగుతాడు. ఏవో సలహాలిస్తాడు. అవి పాటించకపోతే తిట్టిపోస్తాడు.

రుణం తెచ్చుకున్న నాలుగురోజులు టింగు రంగామని గడిపాడు రాజేష్. ప్రియకి కూడా రెండు చీరెలు కొన్నాడు. మంచి బట్టలు కుట్టించుకున్నాడు మళ్ళీ. ప్రియకి మాత్రం మామూలు, చీరెలు కొన్నాడు.

చేసే ఉద్యోగం లేకపోయినా దర్జాకి మాత్రం లోటు రానివ్వడు. రోజూ ఆఫీసుకి వెళ్లిరావల్సిన ప్రియ అతిసామాన్యమైన చీరెలతో మామూలుగా వెళ్తుంటే తను మాత్రం శుభ్రంగా టక్‌చేసి, బూట్లు వేసుకుని సెంట్ పూసుకుని బ్రహ్మాండంగా తిరుగుతుంటాడు.

ప్రియకి ఉన్న మంచి చీరెలన్నీ కూడా పాతబడి డొక్కు చీరెల్లా తయారయ్యాయి. జాకెట్లు చిరిగిపోతే మళ్ళీ కుట్టుకుని వేసుకుంటోంది. అతను ప్రియ గురించి ఆలోచించడు. ఎంతసేపూ తన షోకూ, తన దర్జా అంతే.

ప్రియకి అతను కిరాణాదుకాణం తెరుస్తున్నానని చెప్పాడు. నెలరోజులు గడిచినా దుకాణం ప్రసక్తి ఎత్తలేదు. ఈ లోపల ఆ రుణం డబ్బు కాస్తా ఖర్చయిపోతుందేమోనని ప్రియ బాధ.

మరోనెల గడిచేసరికి ఆ భయం కాస్తా నిజమైకూర్చుంది. అతను ఏ వ్యాపారమూ మొదలుపెట్టలేదు. డబ్బు మాత్రం ఖర్చయిపోయింది.

ఇంత డబ్బు ఏం చేస్తున్నాడా అన్న అనుమానం ప్రియకి వచ్చింది. ఆరాతీస్తే బయటపడ్డ నిజాలు ఆమెని వణికించిపారేశాయి.

రాజేష్ ఒక రూమ్ తీసుకుని కొందరు స్నేహితులతో గడుపుతున్నాడు. తాగుడు, పేకాట లాంటివి అక్కడ ఏ అడ్డూ లేకుండా హాయిగా జరిగిపోతుంటాయి.

ఇవే కాకుండా ఒక వేశ్యని తీసుకొచ్చి అక్కడ ఉంచారు.

రోజురోజుకీ పరిస్థితి దారుణమైపోతున్నదని ప్రియకి అర్థమైపోయింది.

రాజేష్ సోమరిపోతూ తాగుబోతే కాకుండా దుష్టుడు కూడా.

అతనికి తనలాంటి భార్య దొరకడం నిజంగా పూర్వజన్మ సుకృతం. ఇదే ఇంకో స్త్రీ అయితే అతన్ని తన్ని వెళ్ళగొట్టి ఉండేది. తనలో ఉన్న లోపాన్ని అతను మాటిమాటికీ ఎత్తిచూపుతూ ఉండబట్టి, తనలో లోపం ఉండబట్టి... అతను అధికారం చెలాయించగలుగుతున్నాడు. దొరికిన అదృష్టానికి అతను ఆనందించి ఊరుకోవటం లేదు. ఇంకాస్త అదృష్టంకోసం అర్రులు చాస్తున్నాడు. రోజుకొక రుచి కావాలి అతనికి. భార్యతో సుఖంచాలక ఇంకా వేరేస్త్రీలతో సంబంధం పెట్టుకుంటున్నాడు.

పెళ్లికిముందే అతనికి బోలెడుమంది స్త్రీలతో సంబంధం ఉందని కూడా ప్రియకి తెలిసిపోయింది.

ఆమె గుండె మండటం మొదలుపెట్టింది. ఇతను మాత్రం ఏమన్నా ఘోటక బ్రహ్మచారా...

ఇంకా తను లక్షరెట్లు నయం...

పెళ్ళి చేసుకుంటాడనే ఊహతోనే మధుతో అంత చనువు ఏర్పరచుకుంది.

కానీ... రాజేష్ కేవలం ఆనందంకోసం అంతమందితో తిరిగాడు. ఇప్పుడూ తిరుగుతున్నాడు.

రోజూ మధు సంగతి చెప్పి చెప్పి తనని ఏదో హంతకురాలిని చూసినట్లు ఘోరంగా చూస్తున్నాడు. మరి అతను చేసిన చేస్తున్న తప్పులకి తను అతన్ని ఇంకెలా చూడాలి.

ఏమిటి అతని ధైర్యం...

మగవాడై పుట్టినంతమాత్రాన ఇంక ఎట్లా తిరిగినా ఫర్వాలేదన్నమాట.

అదేమని అడిగితే తిట్లు, తన్నులు.

పిల్లని చూడాల్సివస్తోందని చంద్రయ్య ఊరికి వెళ్ళిపోయాడు. మళ్ళీ రాలేదు.

ప్రియ ఆఫీసుకి వెళ్ళాక రాజేష్ కూడా వెళ్ళిపోతాడు. పాపని ఎత్తుకునేపనీ, ఆమెకి పాలుపట్టటం, మిగతా పనులూ అన్నీ చంద్రయ్యకి అప్పగించేవాడు. ఒళ్ళొంగకపోవటంలో చంద్రయ్య రాజేష్‌కి మేనమామ. తనవల్ల కాదని చెప్పి చూశాడు. కానీ పాపని ఇంకెక్కడన్నా బేబీ కేర్‌సెంటర్‌లో పెట్టాలంటే డబ్బు ఇవ్వాలి. ఆ ఖర్చు మిగుల్తుందికదా అని ప్రియ చంద్రయ్యనే చూడమని గట్టిగా పట్టుపట్టింది. రాజేష్‌కి కూడా అదే నయం అనిపించింది. తీరిగ్గా తిని తిరిగే చంద్రయ్యకి పాప ముందరికాళ్ళ బంధం అయి, ఇక్కడ ఉండడం నావల్ల కాదని వెళ్ళిపోయాడు.

పాపని బేబీ కేర్‌సెంటర్‌లో వేశారు.

★ ★ ★

రాజేష్‌కి డబ్బు అందనివ్వకుండా చేశానని ఆనందపడినరోజులు కొన్నే.

డబ్బు పెట్టెలో పెట్టుకుని తాళం వేసుకునిపోతే, తాళం పగలగొట్టి డబ్బు తీసుకుపోయాడు.

ప్రియకి ఏమీ తోచలేదు ఒక్క నిమిషం. అతన్ని ఎట్లా నిరోధించాలో తెలియలేదు. అసలు ముందు ఖర్చుల సంగతి ఎట్లాగా?

ఇంటద్దె ఇవ్వకపోతే ఇంటాయన చంపేస్తాడు. పాలకి ఇవ్వకపోతే పాలవాడు పాలు పోయడు. ఎట్లా చావాలి.

రాజేష్‌ని అడిగితే నిర్లక్ష్యంగా నవ్వాడు. "మరి నాకు డబ్బు ఇవ్వకపోతే అంతే..." అన్నాడు.

రాజేశ్వరిని అడిగి డబ్బుతెచ్చి పాలవాడికి ఇచ్చేసింది.

ఆఫీసులో మిగతావాళ్ళంతా తప్పుకుని తిరుగుతున్నారు. కనిపిస్తే ఎక్కడ అప్పు అడుగుతుందో అన్నట్లు చూస్తున్నారు.

తల్లీ తండ్రీ కూడా తమని డబ్బు అడిగి లాభంలేదని స్పష్టంగా చెప్పారు, చెల్లెలు పెళ్ళి చేయాలి. వాళ్ళని అడిగినా ఎంత అని ఇస్తారు. ఎంతకాలం ఇస్తారు. ఈ ఖర్చులు పెరిగేవే కానీ తరిగేవి కాదుకదా.

కిరాణాషాపు వాడు సరుకులు విసుక్కుంటూనే ఇచ్చాడు. కానీ ఈసారి ఇస్తూ చెయ్యి తగిలించి వెకిలిగా నవ్వాడు.

ఏం చెయ్యలేని నిస్సహాయత...

గమనించనట్లు సరుకులన్నీ సంచీలో వేసుకుంటుంటే ఎంతో ఏడుపు వచ్చింది.

ఇంటాయన బెడద వదిలే ఉపాయం రాజేష్ కనిపెట్టాడు. ఆయన దగ్గర అద్దె అడ్వాన్స్ ఉంది. కాబట్టి ఖాళీ చేసేముందు అతనికి అద్దె ఇవ్వక్కర్లేదు.

"మేము ఖాళీ చేసేస్తున్నాం. అడ్వాన్స్ అడ్జస్ట్ చేసుకోండి'' అన్నాడు దర్జాగా.

ఆయన సరేనని వెళ్ళాడు.

"ఇప్పుడు ఇంకో ఇల్లు చూసుకుని వెళ్ళాలంటే మాటలు కాదు. అంతా ఆర్నెల్లు అడ్వాన్స్ అడుగుతున్నారు. ఎక్కడినుంచి తెస్తాను'' అంది ప్రియ.

"ఏదో ఒకటి అప్పుడు చూద్దాం" అన్నాడు రాజేష్. ఖాళీచెయ్యాల్సిన రోజు వచ్చేసరికి





ఎక్కడో ఊరిబయట ఉన్న కాలనీలో రెండు గదులు అద్దెకి తీసుకుని సామాను అందులోకి చేర్చాడు.

కొత్త కాలనీ ఆఫీసుకి దూరంగా ఉంది. ప్రయాణానికి బోలెడు సమయం పడుతోంది. ఇబ్బందిగా ఉంది.

రాజేష్‌కి మాత్రం సంతోషంగా ఉంది.

కొత్త కాలనీ, కొత్త వ్యక్తులు, కొత్త అప్పులు పుడతాయని ఆనందం.

ప్రియ ఈమధ్య ఇంకాస్త రాటుదేలింది.

మనిషిలో కరుకుదనం, జాణతనం ఇంకాస్త పెరిగాయి.

ఏమాటలు మాట్లాడి ఎదుటివాళ్ళని నొప్పించవచ్చో, ఏం మాట్లాడి ఒప్పించవచ్చో బాగా నేర్చుకుంది.

ఈ పక్కింట్లో మాధవి అనే ఆవిడ, భర్త పిల్లాడు ఉంటున్నారు.

ఆ పక్కింట్లో తాయారు అనే ఆవిడ కుటుంబం. మాధవి కొరకరాని కొయ్య అని ప్రియకి నాలుగురోజుల్లోనే అర్థమైపోయింది.

రెండు మూడుసార్లు అడిగినప్పుడు పంచదార, బియ్యం లాంటివి ఇచ్చింది. తర్వాత అప్పులు ఇవ్వటం తనకి ఇష్టం ఉండదని కుండబద్దలు కొట్టినట్లు చెప్పింది.

"కొత్తగా వచ్చాంకదండీ. ఇంకా సామాను సరిగా సర్దుకోనేలేదు. దుకాణాలు కూడా ఎక్కడ ఉన్నాయో తెలీదు. అందుకే సరుకులు తెచ్చుకోవటం కుదరటంలేదు'' ప్రియ చెప్పిన సంజాయిషీకి మాధవి మొహం చిట్లించింది.

"మీవారు ఇంట్లోనే ఉంటారు కదండీ. ఆయన్ని తెమ్మనండి. లేకుంటే ఆఫీసునుంచి వస్తూవస్తూ మీరే తెచ్చుకోండి'' అనేసింది.

ప్రియ మొహం గంటుపెట్టుకుని తిరిగివచ్చింది. పక్కింట్లో ఉన్న తాయారు, ఆ పక్కన ఇంట్లో ఉంటున్న మాలిని పొగడ్తలకి ఉబ్బిపోతారు. ఊళ్ళోవాళ్ళ వ్యవహారాలు, లొసుగులు తెలుసుకోవాలని ఉవ్విళ్ళూరుతుంటారు. వాళ్ళని అడిగి అప్పులు తేవటం కష్టంకాదు.

రాజేష్ ప్రవర్తన రోజురోజుకీ మితిమీరిపోతోంది. అందరికీ వినబడేట్లు బూతులు తిడుతూ, కాలితో తన్నటం, కొట్టటం చేస్తున్నాడు.

ప్రియకి రోజులు దుర్భరంగా గడుస్తున్నాయి. డబ్బులు రాజేష్‌కి ఎంతమాత్రం అందకుండా జాగ్రత్తపడుతోంది. కానీ ఇంట్లో సామాను, తపేలాల వంటివి, తన చీరెలు అతనికి అందకుండా ఎలా జాగ్రత్తపడాలి. ఏదీ అందుబాటులో లేకపోతే ఇవే ఎత్తుకునిపోయి అమ్ముకుని డబ్బు తెచ్చుకుంటున్నాడు.

అన్నింటికన్నా భయంకరమైన నిజం మరొకటి తెలిసింది.

రాజేష్ మళ్ళీ పెళ్ళి చేసుకుందామని చూస్తున్నాడట.

ఒక పిల్లతో అతనికి పరిచయమై అది ప్రేమగా (అతని భాషలో) మారిందిట.

ఆ అమ్మాయిది చాలా బీదకుటుంబం. పద్దెనిమిదేళ్లు ఉంటాయిట.

పాతికేళ్లు పైబడి, పిల్లకి తల్లయి, రోజూ సమస్యలతో ఉద్యోగంతో సతమతమవుతూ అందాన్ని పోగొట్టుకున్న ప్రియలో అతనికి ఏ ఆకర్షణా కనిపించటంలేదు. ఆ పిల్ల వయసులో ఉంది కాబట్టి ఎట్లా ఉన్నా సొగసుగానే ఉంది.

అతను పెళ్లి చేసుకునిపోతే ప్రియకి సమస్యలేదు. పీడా వదిలిపోయాడు అనుకునేదే.

కానీ అసలు సమస్య - అతను పెళ్లిచేసుకుంటాడుగానీ, పోడుట. పెళ్లాన్ని కూడా ప్రియ డబ్బుతోనే పోషిస్తాడుట.

ఇది వినగానే ప్రియకి గుండెల్లో నెప్పి వచ్చింది. పెళ్లి, పెళ్లాం... అంటే తనకో సవితి...

కొన్నాళ్లకి ఆవిడకి పిల్లలు... అందరికీ తనే ఉద్యోగం చేసి సంపాదించిపెట్టాలి.

ఎందుకు భరించాలి యివన్నీ... ఈ మొగుడు నాకు వద్దు అని వెళ్లిపోవాలంటే... కుదర



దు. ఒకసారి వెళ్లి అనుభవం అయిందిగా

తను ఎక్కడికీ తప్పించుకుపోకుండా ఉచ్చు బిగించాడు.

అతనికి తనమీద ఎందుకింత కసి... అతని కి తన సర్వస్వం సమర్పించింది. నమ్మింది. మోసం చేశాడని తెలిసినా తిరిగివచ్చింది. మళ్లీ నమ్మింది. అతను మళ్లీ మోసంచేశాడు. తిట్టాడు, కొట్టాడు, కుక్కని చూసినట్లు చూస్తు న్నాడు.

దిగులు, దుఃఖం, కసి, పరిస్థితులవల్ల కలిగే అవమానం... అన్నీ కలిసి ప్రియని ఒక శాడిస్ట్‌గా మార్చేస్తున్నాయి.

ఎవరన్నా నవ్వుతూ కనబడితే సహించలేక పోతోంది. అందరూ బాగున్నారు.

అందరూ సుఖాలు అనుభవిస్తున్నారు. పైసా సంపాదించనివాళ్లు, ఏ అర్హతా లేనివా ళ్లూ, అంతా హాయిగా తింటున్నారు, మంచిబ ట్టలు కట్టుకుంటున్నారు. నవ్వుతూ తుళ్లుతూ తిరుగుతున్నారు.

మరి తను... కష్టపడి సంపాదిస్తున్న డబ్బుని కూడా అనుభవించలేకపోతోంది.

తన డబ్బుతో ఎవరో హాయిగా తిని తిరుగు తున్నారు. జల్సా చేస్తున్నారు. తనుమాత్రం... దరిద్ర దేవత ముద్దుబిడ్డలా... ఏ సుఖమూ నోచక, కనీసం ఆప్యాయంగా పిలిచే పలక రింపుకు కూడా నోచకుండా... వెలివెయ్యబడ్డ ట్లు ఎందుకిలా బతకాలి.

అందరూ సుఖంగా ఉన్నారు. తను తప్ప... అంతే.

ఈ ఆలోచనలు ప్రియలో రగిలి రగిలి ఆమెని మరింత క్రూరురాలిగా చేసేశాయి.

పుకార్లు పుట్టించటం మొదలుపెట్టింది. అవి ప్రచారం అయిపోయి దానికి బలి అయిన వాళ్లు గోడుమంటుంటే చూసి నవ్వుకోవటం సాగిస్తోంది.

అబద్ధాలు చెప్పటంలో ముందే ప్రావీణ్యం వుంది. ఆ కళని ఇంకాస్త మెరుగు దిద్దుకుంది. మనుషుల్ని బురిడీ కొట్టించటంలో ఆరితే రింది.



ప్రియ వంటింట్లోకి వెళ్లి బియ్యం డబ్బా తీసి చూసింది. బియ్యంలేవు.

గుండె ఝల్లుమంది. ఆకలికి కళ్లు తిరుగు తున్నాయి. పసిపిల్ల కెవ్వుకెవ్వున ఏడుస్తోంది. పొద్దున్న రెండుకేజీల బియ్యం తెచ్చి అందు లోపోసింది. సాయంత్రం చూస్తే లేవు.

అంటే రాజేష్ ఈలోపలే ఆ బియ్యం మాయంచేశాడన్నమాట.

కోపంగా ముందుగదిలోకి వచ్చింది.

"బియ్యం ఏవీ?" అంది.

"అరవకు"

"అరుస్తాను. ఏవీ బియ్యం. చచ్చీ చెడీ పొద్దున్నే వెళ్లి తెచ్చాను. వాటినేంచేశారు"

"నీ మొహం. నేనేంచేస్తాను? సిగరెట్లకి డబ్బు చాలకపోతే అవి ఇచ్చి తెచ్చుకున్నాను" అన్నాడు తాపీగా.

ప్రియ కాళ్లూ చేతులూ చల్లబడ్డాయి. రెండు మూడు రోజులు కనీసం పచ్చడి వేసుకునైనా తినొచ్చు అనుకుంది.

వాటిని సంపాదించటానికి తనెంత కష్టప డింది? రాజేశ్వరి ఇంటికి వెళ్లింది నిన్న సాయంత్రం.

రాజేశ్వరి లేదు. లేదని తెలిసే వెళ్లింది ప్రియ. మధ్యాహ్నం రాజేశ్వరి ఎవరితోనో అంటోంది, సాయంత్రం మార్కెట్‌కి వెళ్లాలని.

రాజేశ్వరి మొగుడు ఉన్నాడు ఇంట్లో.

"రండి... రండి... ఏం కావాలండీ'' వంకరగా నవ్వుతూ అడిగాడు.

"రాజేశ్వరి లేదా?" అంది ప్రియ ఎరగనట్లు.

"లేదండీ... ఏమన్నా చెప్పాలా? ఏం కావాలో అడగండి'' నవ్వాడు.

"అబ్బే... ఏంలేదండీ. తనదగ్గర ఒక హండ్రడ్ రూపీస్ ఉన్నాయేమోనని అడగటానికి వచ్చాను. అర్జంట్ పని పడింది''

"హండ్రెడ్ రూపీస్‌కి ఆవిడ ఉండాలిటండీ. నేను తెస్తాను కూర్చోండి''

అతను లోపలకు వెళ్లాడు. ప్రియ కూర్చుంది.

అతను తిరిగి వచ్చాడు. అతని చూపులు ప్రియను తినేసేట్లు ఉన్నాయి. కొద్దిగా భయంవల్ల ఊరుకున్నాడుగానీ లేకుంటే చొరవ తీసుకునేవాడే.

"ఇదుగోండి'' చెయ్యి తగిలిస్తూ ఇచ్చాడు.

నవ్వుతూ అందుకుని థాంక్స్ చెప్పి బయటకు వచ్చింది.

భోరుమని ఏడుపు వచ్చింది అప్పుడు. అంత సిగ్గూ, అభిమానం విడిచి పరాయి మగవాణ్ణి అడిగి వాడి లేకి చూపులు భరించి వచ్చినందుకు తనమీద తనకే జాలి కలిగింది.

అది కొద్దిసేపే... ఆ తర్వాత అయ్యో... వాణ్ని అయిదు వందలు అడిగి ఉండాల్సింది. తప్పకుండా ఇచ్చేవాడే, ఆ వాపిరి చూపుల వెధవ అనిపించింది.

ఈసారి బాగా గుర్తుపెట్టుకుని ఇట్లాంటి వెధవల్ని అయిదువందలకి తక్కువ కాకుండా అప్పడగాలి అనుకుంది.

పొద్దున్నే వెళ్లి బియ్యం, కొద్దిగా పప్పూ తెచ్చింది. అంత కష్టపడి సంపాదించి తెస్తే... అది కాస్తా రాజేష్ సిగరెట్లకి ఖర్చుపెట్టాడు.

ఒళ్లు తెలియని కోపం వచ్చింది.

"ఇట్లా చేస్తే ఎట్లా...? పస్తులున్నా ఫరవాలేదా? సిగరెట్లు, సీసాలు వుంటేచాలా'' వణుకుతున్న గొంతుతో అడిగింది.

"పస్తులెందుకుంటాం? నీ తెలివితేటలు నాకు తెలియవనుకోకు. ఎట్లాగో సంపాదించగలవు. ఆలోచించుకుని మళ్లీ ఎలాగో తే... పో..."

"ఎట్లా తేను?"

"ఏముంది? పుల్లలు పెట్టి, కబుర్లు చెప్పి తీసుకురాపో. పొద్దున్న నువ్వు వెళ్లాక మాధవి ఇంటికి పక్కంటి రాజారావు వెళ్లాడు. ఈ ఇన్ఫర్మేషన్ చాలు నీకు. వెళ్లి ఎదురింటి తాయారుదగ్గర బియ్యం అడిగి తే'' అన్నాడు.

లేచింది. వీధి తలుపు తీసుకుని బయటకు వస్తుంటే పక్క పోర్షన్‌లోంచి మాధవి వస్తూ కనిపించింది.

మెత్తటి సిల్కుచీర, జాకెట్టు, జడలో సన్న జాజులు, మెరుస్తున్న కళ్లు... మాధవి మొహంలో ఎంత కళ.

ప్రియ గుండె భగ్గుమంది. బోడిముండ... ఎక్కడలేని షోకులూ!.. కసిగా తిట్టుకుంది.

మాధవి ప్రియని ఏమాత్రం పట్టించుకోకుండా గేటు తీసుకుని ఎక్కడికో వెళ్లింది. ఎదురింటి తాయారు కిటికీలోంచి మాధవిని చూస్తోంది.

ప్రియ గబగబా తాయారు ఇంట్లోకి వెళ్లింది. మామూలుగా అయితే తాయారు ప్రియను చూసి మొహం చిట్లించుకునేదే. కానీ ఇప్పుడు పరిస్థితి వేరు. కుళ్లులో, ఈర్ష్యలో తాయారు ప్రియకి తక్కువ తిన్నదేమీ లేదు.

"చూశారా! టక్కుటక్కుమంటూ ఇంత సాయంత్రంపూట ఎటో వెళ్తోంది. నేను అయితే ఆఫీసు వదిలానంటే ఇంక వీధిమొహం చూడను. మా ఇంట్లో మా నాన్నగారు బోలెడు స్ట్రిక్ట్‌గా ఉండేవాళ్లులెండి. ఇక్కడ మావారూ అంతే. సాయంత్రాలు షికార్లు చేస్తే ఊరుకోరు'' అన్నది.

"నేనూ అంతే. అసలు మాటిమాటికీ

వీధిలో ఏం పనుంటుందో నాకర్థంకాదు'' అన్నది తాయారు.

"పొద్దున్నేం జరిగిందో తెలుసా? పొద్దున్న పదకొండు గంటలకి... అహ, నేను లేనను కోండి... మావారు చెప్పారు. ఆ పక్కింటి రాజా లేడూ... వాడు మాధవి ఇంటికొచ్చాడుట. మొగుడులేని టైమ్‌లో వాడెందుకు వెళ్లాలండీ'' గొంతు తగ్గించి చెప్పింది ప్రియ.

తాయారు మొహం చేటంతయింది.

"నిజంగానా... నేను చూడలేదు. ఏమిటో... అయినా మనకివన్నీ పడతాయా చెప్పు... ఎవరిపని వాళ్లు చేసుకుంటూ, గుట్టుగా కాపరాలు చేసుకునే రకాలం"

"అవున్లెండి... మనకెందుకొచ్చిన గొడవ..."

నిజానికి మాధవి పొద్దున్న పదకొండు గంటలకి ఇంట్లో లేదు. పిల్లాడికి ఫీజు కట్టి రావటానికి స్కూల్‌కి వెళ్లింది. ఆ విషయం ఈ ఇద్దరికీ అక్కర్లేదు.

కొంచెంసేపు మాధవి గుణగణాలన్నీ తిట్టి, తమను తాము పొగుడుకున్నాక వాగ్ధోరణి తగ్గుమొహం పట్టింది.

ఇప్పుడు అడక్కపోతే ఇంక తాయారు అప్పివ్వదనీ, ఇప్పుడున్న హుషారు తగ్గిపోయాక మళ్లీ బింకంగా మాట్లాడుతుందనీ గ్రహించింది ప్రియ.

"తాయారుగారూ... బియ్యం అయిపోయాయి. అదేంటో వెళ్దామనుకుంటూనే రోజూ మర్చిపోతున్నాను. కాస్త బియ్యం అప్పిస్తారూ...?"

తాయారు గతుక్కుమంది. ఎప్పటికప్పుడు ప్రియ మాయలో పడకూడదనుకుంటూనే అప్రయత్నంగా పడిపోతున్నందుకు తనను తాను తిట్టుకుంది. ఖర్మ... ఇంక తప్పదు.

"మా ఇంట్లోనూ అయిపోవస్తున్నాయి. కొద్దిగా ఈ పూటకి కావాలంటే ఇస్తాను'' అన్నది.

"సరే... ఇవ్వండి. రేపు పొద్దున్నే తెచ్చి ఇస్తాను''

తాయారు 'నీ మొహంలే' అని లోపల అనుకుని పైకిమాత్రం మొహం మాడ్చుకుని లోపలకి వెళ్లి బియ్యం తెచ్చి ఇచ్చింది.

ఆత్రంగా అందుకుని "వస్తాను'' అని చెప్పేసి బయటపడింది ప్రియ.

"తెచ్చావా... శభాష్, నాకు తెలుసు. నువ్వు సాధించలేనిదేదీ లేదని'' అన్నాడు రాజేష్.

మాట్లాడకుండా బియ్యం కడిగి పొయ్యిమీదికి ఎక్కించింది.

★ ★ ★

ఏమీ తోచని పరిస్థితిలో ఉన్న సుప్రియకి అనుకోకుండా ఒక వరం దొరికింది... పిన్నిరూపంలో.

పార్వతమ్మ పెద్దమ్మ కూతురు రుక్మిణి. ఆవిడ చాలా రోజులక్రితమే ఆఫ్రికాకి వెళ్లి స్థిరపడింది. ఆవిడ భర్త చాలా మంచివాడు. పిల్లలు బుద్ధిమంతులు. హాయైన జీవితం ఆవిడది.

ఆవిడ ఇండియాకి వచ్చింది. ఒకసారి అందర్నీ చూసిపోయినట్లు ఉంటుందని...

ప్రియనీ, ఆమె సంసారాన్నీ చూసి ఆవిడకి మతిపోయింది.

"ఏమిటే... ఈ మొగుడేంటి, ఈ అప్పులేంటి, ఈ తిట్లూ తన్నులూ ఏంటి?... ఎంత ఘోరమైన పరిస్థితిలో ఉన్నావో ఒక్కసారన్నా ఆలోచించావా... అసలు తిండి ఎలా వంటపడ్తోంది? నీ దుంపతెగ... అప్పులవాళ్లు వచ్చి ఇట్లా నానామాటలూ అంటుంటే ఎట్లా ఉండగలుగుతున్నావసలు.... నిన్ను తల్చుకుంటే నాకే గుండె ఠారెత్తిపోతోంది. నువ్వు ఎలా తిని తిరుగుతున్నావు?" అని తిట్టింది.

ప్రియ నిరాశగా నవ్వింది.

"పిన్నీ... ఇవన్నీ ఆలోచించి మతి పోగొట్టుకున్నాను. ఇంక ఆలోచించే ఓపికలేక ఊరుకున్నాను'' అంది.




"విడాకులిచ్చి నీదారిన నువ్వు బతికితే కొంతలో కొంత మేలు. ఇకముందన్నా అప్పు లు చెయ్యక్కర్లేదనుకుంటాను''

"ఆయన ఒప్పుకోడు''

"వాడు ఒప్పుకునేదేముంది వాడి దివసం? పొమ్మను పోతాడు''

"పోడు... అన్నీ అయ్యాయి'' ఒకసారి రాజేష్‌నుంచి వెళ్లిపోవాలని తను చేసిన ప్రయత్నం గురించి చెప్పింది ప్రియ.

ఆవిడ అంతా విని నిట్టూర్చింది.

"అయితే ఏం చేస్తావుమరి?" అంది.

"ఏంచేస్తాను? ఇలాగే బతుకుతుంటాను. వీల్లేకపోతే చస్తాను''

"ఎందుకు చావటం? బతికేదారి ఆలోచించాలిగానీ''

"ఏ దారీ లేదు''

ఆవిడ పదినిముషాలపాటు అట్లాగే కూర్చుంది ఆలోచిస్తూ.

"ప్రియా... నువ్వు నాతో ఆఫ్రికాకి రాకూడదూ'' అంది.

ప్రియ ఉలిక్కిపడింది.

"పిన్నీ... వేళాకోళమా?" అంది.

"కాదు ప్రియా... నిజంగానే. నువ్వు చాలా దీనస్థితిలో ఉన్నావు. నీకోసం నేను ఈ ఉపకారం చేస్తాను. నీ చార్జీలు నేనే భరించి నిన్ను తీసుకెళ్తాను. విజిటింగ్ వీసామీద ముందు రండి. నువ్వూ పిల్లా... ఆ తర్వాత అక్కడే ఉండిపోయే ప్రయత్నాలు చెయ్యవచ్చు. నీకేదైనా ఉద్యోగం చూస్తాను. నువ్వు చెయ్యాల్సిందల్లా గుట్టుచప్పుడు కాకుండా వీసా, పాస్‌పోర్ట్ తీసుకునే ప్రయత్నం చెయ్యటమే. ఒకపని చెయ్యి. నువ్వొక్కదానివే అయినా కనీసం వచ్చే ప్రయత్నం చెయ్యి. ఎట్లాగో ఒకలాగ అక్కడికొచ్చి పడ్డావంటేచాలు. నీకు ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు. హాయిగా బతకొచ్చు. ఈ గతిలేని వెధవ అంతదూరం ఛార్జీలు పెట్టుకుని వచ్చిచావడు. నాలుగు రోజులు ఇక్కడే అరిచి నోర్మూసుకుని కూర్చుంటాడు. మీ అమ్మావాళ్లకి కూడా చెప్తాను. నిన్ను గురించి గనక అడిగితే ఏమో ఎటుపోయిందో మాకు తెలీదని చెప్పమంటాను. వాడే పోతాడు'' అంది ఆవిడ.

"పిన్నీ... ఈ ఉపకారంగానీ చేసిపెడ్తే నీ మేలు మర్చిపోలేను... నా జీవితం పూర్తిగా మునిగిపోయిందనుకున్నాను. ఒడ్డున చేరుస్తానంటున్నావు... నిజంగా నాకెంత సంతోషంగా ఉందో తెలుసా?" అంది.

"పోవే... ఇదేమంత గొప్ప ఉపకారం. మీ అమ్మ ఎంత మంచిదో తెల్సా. మేమంటే ఎంతో ఆపేక్ష... అక్కకోసం ఈమాత్రం చెయ్యటం ఏం గొప్ప... మీరు సుఖంగా ఉంటే అంతేచాలు'' అంది రుక్మిణమ్మ.

ఊరికే మాట్లాడటమేకాక నిజంగానే ఆవిడ నడుంబిగించింది. ప్రియకి టిక్కెట్టుకోసం బాంక్‌లో డబ్బువేసింది. ఆ డబ్బు ఎట్టి పరిస్థితుల్లోనూ టిక్కెట్టుకి తప్ప ఖర్చు కాకూడదని మాట తీసుకుంది. ఏయే ఆఫీసులకి వెళ్లాలో చూపించింది. కొందరు స్నేహితుల్ని సాయంకోసం అర్థించింది. వాళ్లూ సానుభూతి చూపించి తమకు చేతనైనంత సాయంచేస్తామన్నారు.

"అంతా గుట్టుగా జరిగిపోవాలి'' అని మరోమారు హెచ్చరించి విమానం ఎక్కిందావిడ.

ఎంతో గప్‌చుప్‌గా జరిగిపోతుందనుకున్న వ్యవహారం ఎట్లా తెలిసిందోగానీ రాజేష్‌కి తెలిసిపోయింది.

ప్రియ వంటింట్లో పనిచేసుకుంటుంటే దూకుడుగా వచ్చి చెంపలు వాయించాడు.

"ఏమే ముండా... తెలివి ఎక్కువైపోయిందే! నన్నే బురిడీ కొట్టిద్దామని చూస్తావా? ఆఫ్రికాకి పోతావా ఆఫ్రికా. ఆఫ్రికా కాదు అమెరికా పోయినా, అంతరిక్షానికి పోయినా నిన్ను వెతికి పట్టుకుని ఈడ్చుకుని వచ్చి సంసారం చేయిస్తాను. హమ్మ ముండా... రోజురోజుకీ కొత్తకొత్త బుద్ధులు పుట్టుకుని వస్తున్నాయే... నీ మొహానికి ఫారిన్ కూడానా?"



అంటూ తిట్టాడు.

అతను బలంగా లాగి కొట్టడంవల్ల దెబ్బలు బాగా తగిలాయి. దెబ్బల బాధ ఒకపక్క.... తన వ్యూహం అతనికి తెలిసిపోయిందన్న బాధ మరోపక్క...

ప్రియ జవాబివ్వకపోవటం చూసి అతనికి మరీ మండిపోయింది.

"ఏమనుకుంటున్నావే? నన్ను తప్పించుకుని పోవటం నీవల్ల కాదు. నీ అబ్బతరం కాదు, నీ తాత తరం కూడా కాదు. అది తెలుసుకుని నోర్మూసుకుని పడుండు. అతి తెలివి చూపించకు'' అన్నాడు.

ప్రియ మాట్లాడకుండా ఊరుకుంది.

"నీ తెలివి చూపించావుగా. ఇంక నా తెలివి చూద్దువుగానీ. ఎట్లా పోతావని ఐడియారాక ఊరుకున్నానుగానీ లేకుంటే చక్రం తిప్పేసి, ముందే భూతాన్ని అష్టదిగ్బంధం చేసినట్లు చేసి ఎటూపోకుండా నిన్ను బంధించి పారేసి ఉండేవాడ్ని. ఇప్పటికైనా నా శక్తి తెలుసుకుని ఒక మూల పడుండు'' అన్నాడు రాజేష్.

ఆ తర్వాత బయటకు వెళ్లిపోయాడు విసురుగా. అతను అన్నంతపనీ చేశాడు. సంబంధిత ఆఫీసులకి ఒక పిటీషన్ మాదిరి పెట్టాడు. ప్రియ తన భార్య అనీ, ఆమెకి ఇక్కడ బోలెడు కమిట్‌మెంట్స్, అప్పులూ వగైరా ఉన్నాయనీ, తనకీ, ఇంకెవరికీ తెలియకుండా ఆమె దేశం విడిచి పారిపోవాలని చూస్తోందనీ, ఆమె ఆ విధంగా పారిపోకుండా చూడాలనీ రాశాడు.

వాటి కాపీలు ప్రియకి చూపించాడు. ప్రియకి తనకింక విదేశాలకి వెళ్లే అవకాశం లేదని అర్థం అయింది.

"చూశావా నా తడాఖా? ఇక ఇట్లాంటి వెధవ్వేషాలు వెయ్యకు'' అన్నాడు సంతోషంగా.



రుక్మిణమ్మ ఇచ్చిన డబ్బు కూడా లాక్కు న్నాడు. ఆ డబ్బుతో కనీసం ఒకటిరెండు అప్పులైనా తీరుద్దామని చూసిందికానీ అతను ఎంతమాత్రం పడనివ్వలేదు.

ఇప్పుడు అతని శక్తి పూర్తిగా అర్థమైన ప్రియ ఇంకేం మాట్లాడకుండా ఊరుకుంది.

★ ★ ★

మధు తిరిగి హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫర్ అయివచ్చాడు.

ప్రియ అతను తనని పట్టించుకోడేమో అని పలకరించలేదు. కానీ అతను తన సెక్షన్‌కే ఆఫీసర్‌గా రావటంతో మాట్లాడక తప్పిందికా దు. ఇదివరకు పెళ్ళికాగానే, ట్రాన్స్‌ఫర్‌మీద వెళ్ళేముందు చాలా గంభీరంగా పోజుపెట్టి నువ్వెవరో తెలీదన్నట్లు ప్రవర్తించాడు. ఇప్పు డు ఇంకొక ప్రమోషన్‌మీద ఇక్కడికి వచ్చాడు. ఇంకాస్త దర్జా ఒలకపోస్తాడేమో అనుకుంది.

మామూలుగా అయితే ప్రియకి మధుతో మాట్లాడవల్సిన అవసరంలేదు. అతను చాలా పెద్దాఫీసరు. తమ సెక్షన్ అతనికింద ఉన్న అనేక సెక్షన్లలో ఒకటి మాత్రమే. అతనితో ఏం మాట్లాడాలన్నా తమ సెక్షన్ ఆఫీసర్ వెళ్ళి మాట్లాడివస్తాడు.

కానీ మధు, ప్రియని ప్రత్యేకంగా పిలిపించి మాట్లాడాడు.

"ఏం చేస్తున్నావు? ఎట్లా ఉన్నావు?" అంటూ ఆప్యాయంగా పలకరించాడు.

ప్రియ హృదయం అట్లాంటి ఆప్యాయతకో సమే తహతహలాడిపోతోంది.

వెంటనే సమాధానం చెప్పింది చాలా ప్రే మగా. ఇదివరకు అతను చేసిన మోసం గుర్తుకురాలేదు.

"మీ ఆయన ఏం చేస్తుంటాడు?" అడిగా డు.

ప్రియ మౌనంగా ఉండటం చూసి ఆమెకి

జవాబు చెప్పటం ఇష్టంలేదని తెలుసుకుని మళ్ళీ అడగలేదు.

"లంచ్ ఎవరితో చేస్తున్నావు?" అన్నాడు.

"ఎవరూ లేరు"

"అభ్యంతరం లేకపోతే నాతో చెయ్యరాదూ. ఏ హెూటల్‌కి వెళదాం చెప్పు?" అన్నాడు మధు.

"నీ ఇష్టం" అంది ప్రియ.

"సందు చివర కార్లో వెయిట్ చేస్తుంటాను. ఒంటిగంటకి వచ్చెయ్యి" అన్నాడు మధు.

ప్రియ తల ఊపింది.

అట్లాంటి అవకాశాన్ని వదులుకోదల్చుకోలేదు ప్రియ. కడుపునిండా కోరిన తిండి తిని చాలా రోజులైంది. మరి ఇంత మంచి అవకాశం, కార్లో తిరిగి, హెూటల్లో తినే వీలు వచ్చినప్పుడు వదులుకోవడం ఎందుకు అనుకుంది.

రాజేష్‌కి తెలిస్తే... ఏం చేస్తాడు?

అంతగా అయితే పొమ్మంటాడు. అంతేగా ఈవిధంగా అయినా రాజేష్ వదిలిపోతే బాగుంటుంది.

ఇక లోకం... ఏమనుకుంటే తనకేం. తిండికి లేక మాడినప్పుడు, రాజేష్ చేతిలో తన్నులు తింటున్నప్పుడు... ఎవరు రక్షించారు?

అందరూ అన్నీ పొందుతున్నారు.

తను పెళ్ళయిందగ్గర్నుంచి ఒక్క సుఖానికి నోచలేదు. ఎందుకు దూరం కావాలి వాటన్నిటికి?

మంచో, చెడో... సుఖం కావాలి తనకి. అంతే. ఏవిధంగా ఆ సుఖాలు పొందేదీ అనవసరం. సుఖం, విలాసాలు కావాలి అంతే.

★ ★ ★

ఆ తర్వాత మధుకి చాలాసార్లు ఓ.కే. చెప్పింది ప్రియ. ఇద్దరూ కలిసి హాయిగా తిరగటం మొదలుపెట్టారు.

మధు తనతో తిరగటం, తన కోసం ఖర్చుపెట్టటం ఇవన్నీ ఎందుకో ప్రియకి తెలుస్తూనే ఉంది. మళ్ళీ శారీరక సుఖాలు అందించటం కోసం...

ఈ మగాళ్ళు ఇంతేనా అని నవ్వు వచ్చింది కూడా మధు భార్య ఎంతో అందంగా ఉంటుంది. అయినా ఏం లాభం? నాలుగురోజులు గడవగానే ఆమె అంటే బోర్ కొట్టేసినట్లుంది మధుకి.

మధు, ప్రియ రోజూ ఆఫీస్‌కి లేట్‌గా వస్తున్నా ఊరుకుంటున్నాడు. పని చెయ్యకపోయినా చూసీచూడనట్లుపోతున్నాడు.

ఏకాంతం దొరికినప్పుడు ఇద్దరూ ఏకమయ్యారు, చాలాసార్లు.

మధు, ప్రియకి డబ్బు ఇచ్చాడు. అది రాజేష్ కంటపడకుండా ఆఫీస్‌లోనే దాచుకుంది ప్రియ. ఆటోలకి ఖర్చు పెడుతోంది. సెంట్లు కొంటోంది మళ్ళీ. మంచి బట్టలు, రెండు జతలు చెప్పులు సమకూర్చుకుంది. వాటిని రాజేష్ ముట్టుకోకుండా జాగ్రత్తపడుతోంది.

మంచిరోజులు మళ్ళీ వచ్చాయి అనిపిస్తోంది. రాజేష్ మొదట్లో కనిపెట్టకపోయినా, మధు ట్రాన్స్‌ఫర్ అయివచ్చిన సంగతి మహేంద్ర అతనికి చెప్పేశాడు. మధుని చూపించాడు కూడా.

అతనిముందు రాజేష్‌కి తల కొట్టేసినట్లయింది.

ఏం చెయ్యాలి? ప్రియకి ఎట్లా బుద్ధి చెప్పాలి? అని వేచివున్నాడు.

మెల్లమెల్లగా తన సంగతి ఒక్కొక్కటీ చెప్పేసింది ప్రియ. రాజేష్ బెదిరింపులు కూడా చెప్పింది.

మధు భయపడవద్దని ధైర్యం చెప్పాడు.

"నాకు ఇక్కడా, హెడ్డాఫీసులో బోలెడు ఇన్‌ఫ్లుయెన్స్ ఉంది. నువ్వు ఇంక మీ ఆయన బెదిరింపుల గురించి మర్చిపో. ఆయన ఏమ




న్నా అంటే ఎదురుతిరుగు. ఇష్టం వచ్చినట్లు చేసుకోపో అను. నీకేం భయంలేదు, నేనున్నాను'' అన్నాడు లాలనగా.

ప్రియకి ధైర్యం వచ్చింది.

★ ★ ★

ఇంట్లో ఏమీలేవు.

ఉన్న బియ్యం ఇచ్చేసి డబ్బు తెచ్చుకుని ఖర్చుపెట్టుకున్నాడు రాజేష్.

"నువ్వు అక్కడే ఏదో హోటల్లో భోంచెయ్యి. నేను ఇక్కడ ఏదో సర్దుకుంటాను. వచ్చేటప్పుడు డబ్బుతే'' అన్నాడు.

"నేను తేను. ఏం చేస్తారో చేసుకోండి'' అంది ప్రియ.

"ఎందుకు తేవే...?"

"ఎందుకు తేవాలి?"

"ఇదేం ప్రశ్న?" చెంపమీద ఒక్కటి కొట్టాడు రాజేష్.

"మీరు చేసింది బాగుందా? పసిపిల్ల ఉందనే జ్ఞానం కూడా లేదు మీకు. మనం అయితే ఎట్లాగో సరిపెట్టుకుంటాం. చిన్నపిల్ల, ఆకలికి అల్లాడిపోదూ..." ఏడుస్తూ అంది ప్రియ.

"ఏడిశావ్... మరీ అంత ఇదిగా ఉంటే మీ అమ్మా వాళ్ళింటికి పోయివుండేవాళ్లం. ఏదో ఒకలాగా భోజనం జరిగిపోయేట్లు చూసుకుంటాంగానీ, మాడి ఎండుతామా..."

ప్రియ నోరు మూసుకుంది. ఏడుపు అణిచేసుకుంది. పిల్లకి స్నానం చేయించి, తనూ తయారై బయల్దేరింది.

"దాన్నెక్కడికి తీసుకెళ్తున్నావు''

"మా అమ్మా వాళ్లింటికి. కాస్త అన్నం పెట్టిస్తాను. ఇక్కడ ఉంటే మీరు హాయిగా భోంచేసి పిల్ల సంగతి పట్టించుకోరు''

రాజేష్ దీనికి అభ్యంతరం చెప్పలేదు.

ప్రియ పిల్లని ఎత్తుకుని వీధిలోకి వచ్చింది.

చేతిలో పైసా లేదు.

ఆఫీసుకి వెళ్లేందుకుగానీ, అమ్మగారింటికి వెళ్ళేందుకుగానీ... బాగ్‌లో ఉన్న డబ్బు, ఛార్జీలకి ఉంచినది కూడా ఖాళీ. ఆటో ఆపింది.

"మలక్‌పేట" చెప్పి కూర్చుంది.

ఆటో ఆగిన చప్పుడు విని చెల్లెలు బయటకు వచ్చింది.

"ఏంటి? పొద్దున్నే వచ్చావు'' అంది.

"ఇంట్లో ఎవరూ లేరా?" చెల్లెలు ప్రశ్నకి జవాబివ్వకుండా ఎదురుప్రశ్న వేసింది ప్రియ.

"లేరు. ఎక్కడో సంబంధం ఉందంటే మాట్లాడటానికి వెళ్ళారు''

"ముందా ఆటోకి డబ్బులిచ్చిరా. నా దగ్గర లేవు''

చెల్లెలు వెర్రిమొహం వేసింది.

"నా దగ్గరా లేవు. బీరువాతాళాలు అమ్మ పట్టుకెళ్ళినట్లు ఉంది''

"మరెలా?" ప్రియ తెల్లమొహం వేసింది.

అంతలోనే బుర్ర చకచక పనిచేసింది.

పక్కింటికి వెళ్ళి "ఆంటీ, ఆంటీ'' అని తలుపు కొట్టింది.

కమలమ్మగారు తలుపు తెరిచింది.

"ఆంటీ ట్వంటీ రుపీస్ ఉంటే ఇవ్వండి. నా దగ్గర ఛేంజ్‌లేదు. ఆటోవాడికి ఇవ్వాలి'' అంది గబగబా.

"ఎంతకి కావాలి ఛేంజ్'' అంది కమలమ్మ.

"వంద రూపాయలకి''

"సరే... నా దగ్గరా ఛేంజ్‌లేదు. ఇరవైరూపాయలే ఇస్తాను'' కమలమ్మ వెళ్ళి ఇరవై రూపాయలు తీసుకునివచ్చింది.

అందులోంచి పది రూపాయలు ఆటోకి ఇచ్చి మిగతా పదీ తన బ్యాగ్‌లో వేసుకుంది ప్రియ.

ఇంట్లోకి నడిచింది.

"అన్నం ఉందా? వండాలా?" అంది.

"అమ్మ వండి వెళ్ళినట్టుంది''

"సరే, నేను తినేస్తాను. దీనికి పాలుపట్టిపోతాను. పదకొండూ పన్నెండు గంటలప్పుడు కాస్త అన్నం పెట్టు''

"ఇది ఇవాళ ఇక్కడే ఉంటుందా?"

"ఇవాళ కాదు. ఇవాల్టినుంచీ''

"అంటే..."

"అంతా తీరిగ్గా సాయంత్రం చెబుతాను''

"సరే''

"ప్రియ ఆఫీసుకు వెళ్లింది''

అప్పటికి ఆఫీసులో ఇంకా ఎవరూ రాలేదు. మధు మాత్రం ఉన్నాడు.

"వాటె సర్‌ప్రైజ్... నువ్వింత పొద్దున్నే రాగలగటం..." నవ్వాడు.

"పొద్దున్న వంట చెయ్యలేదు. ఇంక పనేముంటుంది? తొందరగా వచ్చేశాను''

"వంట ఎందుకు చెయ్యలేదు''

"బియ్యం లేవు. అప్పు ఇచ్చేవాళ్ళు కూడా లేరు'' మధు ఒక్కక్షణం మౌనంగా ఉండిపోయాడు.

"పాపం... చాలా కష్టపడుతున్నావు'' లాలనగా అన్నాడు.

ప్రియకి అతనంత ఆప్యాయంగా మాట్లాడుతుంటే ఏడుపు ముంచుకొచ్చింది.

చేతుల్లో మొహం దాచుకుని ఏడ్చింది.

"ఏంటి నీ బాధ అసలు..."

"నీకు తెలియనిదేముంది? అతనే పనీచెయ్యడు. జల్సాగా తిరుగుతాడు. ఇంక నా ఒక్క జీతంలో నడవాలి''

"ఎంతమంది ఒక్క జీతంతో నడుపుకోవటంలేదు''

"వాళ్ళ సంగతి వేరు. జాగ్రత్తగా ఖర్చు పెట్టుకుంటారు. మేం అలా కాదుగా. అదీగాక ఒక్కజీతం అయినా పూర్తిగా ఉందనుకున్నావా? అతను బతిమాలి, బుజ్జగించి, బెదిరించి, భయపెట్టి ఒకటేమిటి... సామ, దాన, భేద దండోపాయాలన్నీ ప్రయోగించి, నాచేత అన్నిరకాల అప్పులూ చేయించాడు. నీకు తెలుసుగా. అన్ని కటింగ్సూ పోను నా చేతికి వచ్చేది చాలా తక్కువ.

మధు అవునన్నట్లు తల ఊపాడు.

"నిజమేననుకో. పోనీ... ఒకపని చెయ్యి. నెలకి సరిపడా బియ్యం, పప్పు, చింతపండు కొనేసి ఉంచుకో. కనీసం పులుసన్నం అయినా తినవచ్చు. తిండికి కూడా లేకుండా ఏం మాడతారు''

"అదీ అయింది. బియ్యం అయినా ఉంచుతాడనుకుంటున్నావా? అయినకాడికి అమ్ముకుని శుభ్రంగా సిగరెట్లు కొనుక్కున్నాడు నిన్న''

"అతను ఇట్లా ఎత్తుకి పైఎత్తువేస్తే నువ్వేం చెయ్యలేవు''

"అదేనా బాధ. అతనిముందు నా తెలివితేటలు పనికి రావటంలేదు''

"అతన్ని దారిలో పెట్టే ఉపాయం ఏదో ఒకటి ఆలోచిద్దాంలే'' అన్నాడు మధు.

ప్రియ తలెత్తి మధువైపు చూసింది.

"మధూ... నిన్ను ఒక్కసాయం అడుగుతాను. చేస్తావా? నువ్వు చెయ్యగలిగే పరిధిలోదే''

"అడుగు''

"ఇది ఒక్కరోజుతో మాసిపోయే సమస్య కాదు. దీనికి పర్మనెంట్ పరిష్కారం ఆలోచిస్తున్నాను నేను..."

"అదే మంచిది''

"నాకీ విషయంలో నీ సలహా సహకారాలు కావాలి. ఏం చేస్తే బాగుంటుందో చెప్పగలవా?"

"చెప్తాను. కానీ ఇప్పుడు కాదు. ఇది పైకి కనిపించేంత తేలిక వ్యవహారం కాదు. దీన్ని చాలా జాగ్రత్తగా డీల్ చెయ్యాలి. నీకోసం నేను రెండు మూడురోజులు ఆలోచిస్తాను''

"థాంక్స్. ఇంకొకమాట. ఒకవేళ నేను విడాకులు తీసుకోదల్చుకుంటే నువ్వు నాకు హెల్ప్ చెయ్యగలవా?"





"చేస్తాను" అతను వెంటనే అన్నాడు.

"బాగా ఆలోచించుకో మళ్ళీ ఇది నీ భార్యకి తెలిస్తే గొడవ పెడుతుందేమో?"

"లెక్క చెయ్యను. ఒకసారి నీకు తెలిసో తెలియకో అన్యాయం చేశాను. ఆ పాపం ఇట్లాగ ప్రక్షాళన చేసుకుంటాను"

"నా కర్మ ఇట్లా ఉంటే ఎవరేం చెయ్యగలరు. పోనీలే సాయం చేస్తానన్నావు. అది చాలు"

"ఇంకోటి కూడా ఆలోచించు. తొందరపడకు. అప్పుడే విడాకులూ, పెడాకులూ అని ఆలోచించకు. నాకు అతను మారుతాడనే అనిపిస్తోంది"

"నాకేం అనిపించటం లేదు. పెళ్ళయి నాలుగేళ్ళయింది. మూడేళ్ళ కూతురు ఉంది. అయినా ఆ మనిషికి ఏమాత్రం బాధ్యత తెలియటంలేదు. ఇన్నేళ్లు గడిచినా మారనిమనిషి ఇంకేం మారతాడు"

"విడిపోవటం దేనికి... ఇన్నాళ్ళూ సర్దుకు పోయినట్లే సర్దుకుపోలేవూ"

"కుదరదు. ఇన్నాళ్ళూ నేను ఒక్కదాన్నే కాబట్టి సర్దుకుపోయాను. రోజురోజుకీ పిల్లపెద్దదవుతోంది. అతనిట్లా ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తుంటే పిల్ల కూడా చెడిపోతుంది. ఇంట్లో రోజూ పోట్లాటలు, తిట్లు, తన్నులు, తింటానికి తిండిలేదు. చుట్టుపక్కలవాళ్ల ఛీత్కారాలు, అప్పులిచ్చే వాళ్ళ విదిలింపులు. సిగ్గులేనిదాన్ని కాబట్టి బతుకుతున్నాను. ఇవన్నీ నా పిల్లకి కూడా అలవాటు చెయ్యటం నాకిష్టంలేదు. విడిపోయి, మా అమ్మా వాళ్ళింట్లోనే ఉంటాను. పిల్లను బుద్ధిగా పెంచుకుంటాను"

ఎంత దుర్మార్గురాలైనా, అసూయాపరురాలైనా, గయ్యాళి గంపలే అయినా మాతృత్వానికి మాత్రం బానిసలే. ఇది ఎవ్వరూ కాదనలేని సత్యం.

ప్రియలోని మాతృహృదయాన్ని మధు గుర్తించాడు.

"మంచిదే... నువ్వీమాత్రం వివేకం ప్రదర్శించడం నాకు ఆశ్చర్యంగానే ఉంది" అనేశాడు.

ప్రియ అతన్ని ఒకసారి చూసి తల దించుకుంది. ఎవరేం మాట్లాడినా కోపగించుకునే స్థితిలో లేదు.

"నువ్వు మాట ఇచ్చాక నాకు కొద్దిగా ఓదార్పుగా ఉంది. థాంక్స్" అనేసి వచ్చి తన సీట్లో కూర్చుంది.

లంచ్‌టైంలో మధు భార్య ఆఫీస్‌కి వచ్చింది. ఇద్దరూ కార్లో బయటకు వెళ్లారు. ఏ హోటల్‌కో వెళ్లి భోంచేస్తారు కాబోలు.

"బాస్ భార్య చాలా అందంగా ఉంటుంది కదూ!" అన్నది రాజేశ్వరి.

"ఏడిసినట్లుంటుంది. ఆ చట్టిమొహమూ అదీను. దాన్ని చూస్తేనే నాకు వాంతొస్తుంది" అంది ప్రియ.

రాజేశ్వరి నవ్వేసి ఊరుకుంది. అంతలోనే తన మనసులోని ఈర్ష్యని గుర్తించి తనకి తానే సిగ్గుపడింది ప్రియ.

ఇంక ఇట్లాంటివన్నీ తగ్గించుకోవాలి. ఎవరు ఎలా ఉంటే తనకేం... ఎవరిగురించీ ఆలోచించకుండా తన బాగు తనే చూసుకోవాలి.

సాయంత్రం ఇంటికి వెళ్లేసరికి తల్లీ, తండ్రీ ఏడుపు మొహాలతో కూర్చుని ఉన్నారు.

"ఏంటి కొత్తగొడవ. ఇక్కడే ఉంటానని అన్నావుట" అన్నాడు గోవిందరావు.

"అవును... ఇంక భరించటం నావల్లకాదు"

"కానీ తప్పదు. కోరి చేసుకున్నావు. మంచో చెడో నువ్వే భరించాలి. నీ తర్వాత మాకు ఇంకో ఆడపిల్ల ఉంది. నువ్విక్కడ కూర్చుంటే దాని పెళ్లి ఎలాగ?"

"దాని పెళ్లికోసం నన్ను చావమంటారా? నన్ను అతనితోనే కాపరం చెయ్యమని మీరు చెప్పేపక్షంలో నేను ఒక్కక్షణం కూడా ఉండను. చెప్పండి. ఇప్పుడే అక్కడికి వెళ్లిపోయి

నేనూ, నా పిల్లా నిప్పంటించుకుని చస్తాం"

గోవిందరావు నిశ్చేష్టుడైపోయాడు. ప్రియ మొండితనం అతనికి తెలియనిది కాదు.

తన మనసుకి తోచినపని, ఎంత కఠినమైన దైనా, ఎంత ఘోరమైనదైనా ప్రియ వెంటనే చేసేస్తుంది. ఏమాత్రం సంకోచించదు.

అన్నంతపనీ చేసినా చేస్తుంది. వివేకం తక్కువ, మూర్ఖత్వం ఎక్కువ. ఏం చెయ్యాలి... ఒక కూతురి పెళ్లికోసం చెట్టంత కూతుర్నీ పండులాంటి మనవరాలినీ బలితీసుకోవాలా...

కుదరదు... తను ఈ వయసులో గర్భశోకాన్నీ, మనవరాలి మరణాన్నీ సహించలేడు.

ఏమైతే అది అయింది. అయినా ఏదో అన్నాడుకానీ, ప్రియ ఇక్కడున్నంత మాత్రాన తప్పిపోయే సంబంధాలు తప్పిపోవటమే మంచిది. ఒక కూతురితో ఎట్లాగూ పడుతూనే వున్నాడు. ఇంక ఇట్లాంటి సంకుచిత మనస్కులతో అసలు పడలేడు.

"సరేలే... నువ్వు హాయిగా కాపరం చేసుకుంటావేమోనని ఆశగానీ లేకుంటే మాదేంపోయింది. నీ జీతం నీకు వస్తుంది. నిన్ను పోషించాలా, పెట్టాలా?" అన్నాడు.

ప్రియ మాట్లాడలేదు. ఆలోచిస్తూ కూర్చుంది.

ఆరోజుకి ప్రియ రాకపోయినా రాజేష్ ఏమీ అనుకోలేదు. పుట్టింటికి వెళ్లిందని తెలుసు కాబట్టి చీకటి పడిందని మానేసిందేమో అనుకున్నాడు. అట్లాగే మర్నాడూ ఊరుకున్నాడు. మూడోరోజు ప్రియ ఆఫీసుకి వెళ్లాడు.

"ఇంటికి రాలేదేం?" అన్నాడు కరుగ్గా.

ప్రియ చురుగ్గా చూసింది.

"రాదల్చుకోలేదు'' అంది.

"ఎందుకని?"

"నాకక్కడ సుఖంలేదు. అందుకని''

"ఇప్పుడు హఠాత్తుగా నీకేం కష్టం వచ్చింది?"

"హఠాత్తుగా రాలేదు. కొంతకాలం వెయిట్ చేద్దామని పెట్టుకున్నాను. చేశాను. మీ బిహేవియర్ మారలేదు. అందుకని నేనే మారాల్సి వచ్చింది''

"ఇన్ని ఆలోచనలు నీకే వచ్చాయా?"

"నా బుర్రలో మట్టి లేదు''

"అదంతా నాకు తెలీదు. ఇంట్లో ఏమీలేవు. ఇవాల్టినుంచీ నేనూ మీ ఇంట్లోనే ఉంటాను''

"కుదరదు''

"ఎలా కుదరదో చూస్తాను'' అనేసి వెళ్లిపోయాడు రాజేష్.

ప్రియకి ఏమీ పాలుపోలేదు. లేచి మధుగదిలోకి వెళ్లింది.

"ఏం జరిగింది?" అడిగాడు మధు, ఆందోళనగా ఉన్న ప్రియ మొహంచూసి.

"అతను వచ్చాడు. ఇంటికి రమ్మని అడిగాడు. రానంటే తనే మా ఇంటికి వస్తాననీ, ఎలా రానివ్వవో చూస్తాననీ ఛాలెంజ్ చేసి వెళ్లాడు''

మధు చిన్నగా నవ్వాడు.

"ఇక్కడ నేనింత కష్టపడుతుంటే నీకు నవ్వు వస్తోందా?"

"ఏంలేదు... పోనీ మీ ఇంట్లో ఉండనివ్వరాదూ? పదిమందిలో ఉంటే నిన్నింత పీడించడేమో?"

"అదేంలేదు... మావాళ్లముందు కూడా నన్ను రెండుమూడుసార్లు కొట్టాడు''

మధు ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"నాకు తెలిసిన లాయర్ ఉన్నాడు. సంగతి చెప్పి సలహా తీసుకుందాం" అన్నాడు.

"నేనూ రావాలా?"

"తప్పదు. అన్ని విషయాలూ చెప్పాలిగా అతనికి. నాకేం తెలుస్తుంది'' అన్నాడు మధు.

ప్రియ తల ఊపింది.

"సాయంత్రం ఆఫీసునుంచి వెళదాం" అన్నాడు.

ప్రియ మనసు తేలికపడింది. తను ఒంటరిగా రాజేష్‌ని ఎదుర్కోలేదు. అతనికి బలం





ఉంది... కొడతాడు. చదువుకోలేదు.... కానీ పెళ్లాన్ని ఎట్లా యాతన పెట్టాలో తెలియటానికి చదువక్కర్లేదు.

డిగ్రీ చదివిన తను, టెన్త్ పదిసార్లు తప్పిన అతనిముందు జీరోగా మిగులుతోంది.

ఇప్పుడు కోర్టుకెక్కిస్తే సరి... తిక్క కుదుర్తుంది. పెద్దపెద్ద లాయర్లు బడబడా కురిపించే ప్రశ్నలవర్షం తట్టుకోలేక తడబడుతుంటే చూడాలి.

కసిగా పళ్లు నూరుకుంది. నిజంగా తను ఇన్నాళ్లూ ఎట్లా సహించింది. ఎందుకు వచ్చిందోగానీ హఠాత్తుగా వచ్చింది విడిపోవాలనే ఆలోచన. లేకపోతే ఇంకా అతని చేతిలో అన్నివిధాలా దోపిడీకి గురి అవుతూ ఉండేది.

తనచేత చాకిరీ చేయించుకుని దర్జాగా బతికాడు. తను చచ్చేట్లు వంటచేస్తే పొట్ట పగిలేలా మెక్కాడు. తను కష్టపడి అతని బట్టలు ఉతికి, ఇస్త్రీ చేస్తే నవాబు దర్జా ఒలకబోస్తూ తిరిగాడు. తన డబ్బుతో జల్సా చేశాడు. తనని అన్నివిధాలా దారుణంగా మోసగించి ఘోరంగా దోపిడీ చేశాడు. కడుపుతో ఉండి పనిచెయ్యలేక సొమ్మసిల్లి పడుకుంటే కడుపు మీద తన్నాడు. తన జీతంమీద బతికే వెధవ తననొక బానిసలా చూశాడు. ఆమె రక్తం మరుగుతోంది. ఇంతకు ఇంతా అనుభవించేలా చేయాలి. అసలు ఒక నోటీసు ఇప్పిస్తే చాలు... పక్షిలాగా వచ్చి తన దగ్గర వాలతాడు. వాలకపోవటానికి వాడికొక బతుకంటూ ఏడిస్తేగా... తను విదిలించకపోతే అన్నం మెతుకు కూడా పుట్టని వెధవ...

నాలుగు రోజులు కాగానే తన విలువ తెలుస్తుంది. ఉండటానికి నీడ, వేళకి తిండి, జేబులో డబ్బులు... ఇవన్నీ ఉంటే తన విలువ తెలియటంలేదు వాడికి.

పిడుగుపడి ఇల్లు కూలినట్లు ఒక్కసారి ఒక లీగల్ నోటీస్ చూశాడంటే చాలు తనూ తన స్థితీ అన్నీ కళ్లకు కట్టినట్లు తెలుస్తాయి. అదరగొట్టే భాషలో ఇవ్వమనాలి నోటీస్.

వెధవ... తను చచ్చే చాకిరీ చేసి వాడిని పోషిస్తుంటే మదమెక్కి కొట్టుకుంటున్నాడు పందివెధవ... వాడిపని పట్టాల్సిందే.

సాయంత్రం మధు ప్లీడర్ ఇంటికి తీసుకెళ్లాడు. మధు ఫ్రెండ్ భార్గవ అడ్వకేట్. అతని ఆఫీసుకి వెళ్ళారు. ఏదీ దాచకుండా చెప్పింది.

భార్గవ ఓపిగ్గా అంతా విన్నాడు.

"మీ ఉద్దేశం ఏమిటి... అతను బెదిరి మీ వద్దకి వచ్చి బుద్ధిగా ఉండేట్లు చూడటమా, లేకపోతే విడాకులు పుచ్చుకోవడమా... మీరు తేల్చి చెపితే దానిప్రకారం నోటీస్ ఇస్తాను'' అన్నాడు.

"మొదటిదే... అది కుదరని పక్షంలో రెండోది'' అన్నది ప్రియ.

"సరే, రేపు రండి నోటీస్ టైప్ చేయించి ఉంచుతాను. మీరు ఓ.కే. చేస్తే ఇష్యూచేస్తాను'' అన్నాడు భార్గవ.

"అలాగే!"

"ఈలోపల మీరు ఇంకోపని చేయండి. నాదగ్గరకి వచ్చిన విషయం రహస్యంగా ఉంచండి. రేపు మీరు సెలవుపెట్టుకునైనా మీ నాన్నగారినీ, మరికొందరినీ తీసుకుని అతని దగ్గరకు వెళ్లండి. అక్కడ మీ సామాను, నగలు ఏవైనా ఉంటే గుట్టుచప్పుడు కాకుండా తెచ్చుకోండి. ఒకవేళ విడాకులు తీసుకునే పక్షంలో మీ సామాను కూడా మీకు దక్కనివ్వడతను'' అన్నాడు భార్గవ.

ప్రియకి ఈ సలహా బాగా నచ్చింది. ముఖ్యంగా బట్టల పెట్టే, పాపాయివి కొన్ని సామాన్లూ చాలా అవసరం. తెల్లారి లేస్తే ఆఫీసుకి వెళ్లాలంటే చీరె, జాకెట్లు, లోపలి లంగాలూ వగైరా ఎన్నో ఉండాలి. పర్మనెంట్‌గా పుట్టింటికి మకాం మార్చాలంటే అవన్నీ తెచ్చుకోక తప్పదు. అడ్వకేట్ అన్నట్లు నోటీస్ చూశాక రాజేష్ మరీ రెచ్చిపోవచ్చు.

బయటకు వచ్చింది. అతను కారుదాకా వచ్చాడు.

"రేపు పొద్దున్న ఎవరినన్నా తీసుకుని వెళ్తాను'' అంది.

"జాగ్రత్త... ఏమన్నా గొడవపెట్టి సతాయించాలని చూస్తాడేమో అతను. అట్లాంటిదేమన్నా ఉంటే నాకు ఫోన్ చెయ్యి'' అన్నాడు మధు కార్లో.

"సరే'

ఇంటికి కొద్దిదూరంలో కారాపి దిగిపోయింది.

"ఏమ్మా! ఇంతాలస్యమైంది'' అన్నాడు గోవిందరావు.

మధుతో లాయర్‌దగ్గరకు వెళ్లినట్లు కాకుండా ఇంకో అమ్మాయితో వెళ్లినట్లు చెప్పింది ప్రియ.

"మా ఫ్రెండ్ ఒకమ్మాయి వాళ్లకి తెలిసిన లాయరు ఉన్నాడంటే వెళ్ళాను. ఒక నోటీస్ ఇప్పిస్తే సరి చచ్చినట్లు దారికొస్తాడు'' అంది ప్రియ.

గోవిందరావు మాట్లాడలేదు.

"అతను దారికి రాకుంటే అప్పుడు మనకేది దారి?" అంది తల్లి.

"అబ్బ... ఊరుకోమ్మా? అన్నింటికీ నెగిటివ్‌గా ఆలోచిస్తావు'' అన్నది ప్రియ.

"అట్లా ఆలోచించబట్టే కనీసం ఇట్లా బతికి బట్టకడుతున్నాం తల్లీ. దేనికైనా కీడెంచి మేలెంచమన్నారు. అంతేగానీ, నీలాగ తెగించి కూర్చుని చేసే పనేదో చేసేసి ఆపైన జీవితాంతం ఏడవటం నాకు చేతకాదు తల్లీ'' అన్నది ఆవిడ సాధింపుగా.

"అమ్మ చెప్పినదాంట్లో అర్థముంది'' అన్నాడు గోవిందరావు.

"అయితే ఏం చెయ్యమంటారు? వెళ్లి అతనితో తన్నులూ తాపులూ పడమంటావా?" అడిగింది ప్రియ.

"అదేంలేదు. తొందరపడి పెళ్లి చేసుకుని ఏడుస్తున్నావు. మళ్లీ తొందరపడి విడాకులు






పుచ్చుకుని ఆ తర్వాత మమ్మల్ని అంటే లాభంలేదు. నీ వ్యవహారంతో మాకేం సంబంధంలేదు. రేప్పొద్దున్న కష్టమొచ్చినా సుఖమొచ్చినా మాట్లాడకూడదు. మమ్మ ల్నేమీ అనకూడదు. అట్లా అయితేనే మా సాయం ఉంటుంది'' అన్నది పార్వతమ్మ.

"సరే'' అన్నది ప్రియ.

"రేపు వెళ్లి ఉన్న సామాను కాస్తా తీసుకువచ్చెయ్యాలి'' అన్నది ప్రియ.

"గొడవ చేస్తే?"

"ఎట్లా చేస్తాడో చూస్తాను. అందులో అతను సంపాదించిన డబ్బుతో కొన్నది చీపురుపుల్ల కూడా లేదు. ఇంక ఏం మాట్లాడతాడు? ఏమన్నా అంటే చెప్పుతీసుకుని కొడతాను'' అన్నది ప్రియ.

"సరే... అంత ధైర్యం ఉంటే పర్వాలేదు. రేప్పొద్దున్నే ఒక ఆటో మాట్లాడుకుని వెళదాం. లేకపోతే ఆటో మాట్లాడి వచ్చేలోపల ఎవరినన్నా తీసుకొచ్చి గొడవ చేస్తాడు. అంతా రహస్యంగా, గబగబా జరగిపోవాలి'' అన్నాడు గోవిందరావు.

ఆ రాత్రి అంతా మర్నాడు సామాను ఎట్లా తేవాలో అన్న ఆలోచనలో నిద్రపట్టలేదు ప్రియకి.

మర్నాడు పొద్దున్నే లేచి ఆటో ఒకటి మాట్లాడి అందులోనే ఎక్కి బయల్దేరారు.

ఇంటిముందు ఆటో ఆగింది. సామాను తీసుకుని వచ్చేస్తుంటే రాజేష్ ఎట్లా మొహం పెడతాడో చూడాలని ఉబలాటంగా ఉంది ప్రియకి.

తలుపులు తెరిచేవున్నాయి. లోపలకు వెళ్లింది. ఇల్లంతా ఖాళీ. గుండె ఆగిపోయినట్లయింది. గబగబా ఇల్లంతా తిరిగింది. బట్టలపెట్టె, చాప, పరుపు, స్టౌ, వంటసామాన్లు, రెండు కుర్చీలు... ఇంట్లో ఉండవలసింది ఒక్కటీలేదు.

ఏమైంది... సామానంతా ఏమైంది... కొంపతీసి ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోలేదుకదా!

గోవిందరావు అయోమయంగా చూస్తున్నాడు.

"ఏ సామాను తేవాలమ్మా..." అంటూ లోపలకు వచ్చాడు ఆటోడ్రైవర్.

గోవిందరావుకి పరిస్థితి అర్థమైంది.

"అక్కర్లేదయ్యా... మేం తర్వాత వస్తాం. నువ్వు వెళ్లిపో' అని ఛార్జీ ఇచ్చి పంపేశాడు.

ఆటో వెళ్లిపోయింది. ప్రియ నీరసంగా నేల మీదే కూలబడిపోయింది.

రాజేష్‌ని ఎదుర్కోవటం ఇప్పుడు కూడా తనవల్ల కాలేదు... సామానంతా ఏంచేశాడో.

పకపకా నవ్వు వినిపించితే అటుచూశారు ప్రియ, గోవిందరావు.

"బాగా అయిందా శాస్తి. సామాను పట్టుకు పోదామని వచ్చారుగా, సామాను, పట్టుకు పొండి'' రాజేష్ చచ్చేట్లు నవ్వుతున్నాడు.

"సామానంతా ఏంచేశావ్?" గోవిందరావు అడిగాడు.

"పెద్ద తెలివిగలవాళ్లలా వచ్చారుగా. నిన్న ప్లీడర్ని కలుసుకుని వచ్చావుగా ప్రియా! ఆ మధుగాడి కార్లో ఎక్కి ప్లీడరింటికి పోవటం నేను చూడలేదనుకున్నావా? ఇట్లాంటిదేదో చేస్తావని ముందే ఆ సామాను కాస్తా దాటించేశాను. దిక్కున్నచోట చెప్పుకో పో' అన్నాడు రాజేష్.

గోవిందరావు ప్రియవైపు తిరిగాడు.

"మధుతో వెళ్లావా?" అన్నాడు అప్రయత్నంగా.

"మీకు చెప్పలేదా! అయితే నువ్వూ మధూ ఇద్దరే నడిపిస్తున్నారా ఈ వ్యవహారం అంతా బాగానేవుంది'' అన్నాడు రాజేష్.

గోవిందరావుకి చిరాకేసింది. అయినాసరే రాజేష్‌ముందు మాత్రం బయటపడదల్చుకోలేదు.





"అదంతా అనవసరం. తప్పేముంది! వాళ్ల ఆఫీసర్ కాబట్టి సాయంకోరింది, వెళ్లింది. నిన్ను సామానేమైందని అడుగుతున్నాను. ఏమైంది చెప్పు'' అన్నాడు.

"ఏమైందో నాకేంతెలుసు? నిన్నరాత్రి ప్లీడరింటినుంచి వచ్చాక నీ కూతురూ, ఆ మధుగాడూ కలిసి ఆ సామానంతా అమ్ముకునిపోయారో, ఎక్కడన్నా దాచారో, ఏం చేశారో ఏమో, నీ కూతుర్నే అడుగు. అసలు నేను ఇంటికి వచ్చి రెండురోజులైంది'' అన్నాడు రాజేష్.

అతనితో వాదించటం తనవల్ల కాదనిపించింది గోవిందరావుకి.

సూటిగా మాట్లాడేవాళ్లతో ఎన్ని గంటలైనా మాట్లాడవచ్చు. పోట్లాడవచ్చు. అర్థంపర్థం లేకుండా, అడ్డగోలుగా మాట్లాడేవాళ్లతో ఏమని పోట్లాడాలి.

చుట్టుపక్కలవాళ్లంతా కిటికీల్లోంచి తొంగి చూస్తున్నారు. అక్కడ ఉండటం గోవిందరావుకి నచ్చలేదు. ఎంతసేపు మాట్లాడినా ప్రయోజనం ఉండదనిపించింది.

"సరే కోర్టులోనే తేల్చుకుందాం... సామాను తీసుకెళ్లి ఏదో సాధించేశాననుకోకు. ముందుంది ముసళ్ల పండుగ. నా కూతురు కష్టపడి సంపాదించి కొనుక్కున్న సామాను అది. దాంట్లో దాని చెమట బిందువులు దాగి ఉన్నాయి. అదంతా నీ పాలపడటం నేను చూస్తూ ఊరుకోను. నీ మీద కేస్‌పెడతాను'' అరిచాడు గోవిందరావు.

"నా యింటికి వచ్చి నా మీదే అరుస్తావురా ముసలోడా! పోముందు బయటకి'' అంటూ గోవిందరావుని మెడపట్టి బయటకు గెంటాడు రాజేష్.

గెంటాక ఒక మాట మాత్రం చెప్పాడు.

"నీ సామాను నేను దాచలేదు, అమ్మలేదు... అప్పుల వాళ్లు వచ్చి తలా ఒకటీ పట్టుకుపోయారు'' అన్నాడు.

చేసేది లేక తిరుగుముఖం పట్టారు.

"మధుతో వెళ్లావని చెప్పలేదేం" అన్నాడు

గోవిందరావు ఆటోలో యింటికి తిరిగి వస్తుంటే.

"ఊరికే"

"ఊరికే అంటే ఎట్లా. మధుతో వెళ్లానని చెప్పకపోగా యింకెవరితోనో అమ్మాయితో వెళ్లావని చెప్పావు. కనీసం తల్లితండ్రులతోనైనా నిజం చెప్పాండు. నీకే మంచిది'' చురుగ్గా అన్నాడు గోవిందరావు.

సరేనన్నట్లు తల ఊపి ఊరుకుంది ప్రియ. యింటికి వచ్చాక యిక ముందేం చెయ్యాలని ఆలోచించారు.

"అతను అప్పుల వాళ్లొచ్చి తలా ఒకటీ పట్టుకుపోయారని అంటున్నాడు. అది నమ్మొచ్చా'' అన్నాడు గోవిందరావు.

"నమ్మొచ్చు''

"ఎందుకని''

"అన్ని అప్పులు ఉన్నాయి కాబట్టి, తీర్చటం మానేసి ఎన్నాళ్లో అయింది కాబట్టి''

గోవిందరావు నిశ్చేష్టుడై చూస్తున్నాడు.

"అన్ని అప్పులు ఎందుకు చేయాల్సి వచ్చింది''

"ఖర్చులున్నాయి''

"ఏం ఖర్చులు''

"అతను బోలెడు జల్సాలు చేస్తాడు. ఆపైన ఒక్కరి సంపాదనలో బతకాలి''

"ఒక్కరి సంపాదనతోనే చాలా కుటుంబాలు బతుకుతున్నాయి''

"ప్రతివాళ్లూ యిదే మాట. ఏమో మరి... నాకు వస్తున్న జీతం అంతా ఖర్చయిపోతోంది. అతను ఖర్చులు తగ్గించుకోడు. నేను బయటకు వెళ్లి వచ్చేదాన్ని. చీరలూ, ఛార్జీలూ తిండి... ఏది తగ్గించుకోవాలి. అవికాక పార్టీలు, ప్రెజంటేషన్స్, ఎన్నో మొహమాటాలు ఉంటాయి. అప్పులవుతుంటాయి. ఇవ్వాలి... ఒకోసారి తిరిగి యివ్వరు. యిట్లా అనేక ఖర్చులు లెఖ్ఖలోకి రానివి'' అన్నది.

గోవిందరావు మాట్లాడలేదు.

ఆ రాత్రి ప్రియకు కొద్దిగా జ్వరం వచ్చింది. ఆఫీస్‌లో లీవ్‌లెటర్ యిచ్చి రమ్మంది.

యిదీమంచిదే అనుకున్నాడు గోవిందరావు. అతనికి కూడా ప్రియ ఆఫీసుకి వెళ్లి ఒకసారి అందర్నీ చూడాలని ఉంది.

ప్రియ బోలెడు ఖర్చుపెడుతోంది. స్నేహితులతో కలసి సరదాలు చేస్తోంది కాబోలు. కాస్త అమాయకత్వం, వెర్రి ఉన్నాయని కనిపెట్టి అంతా దీనిచేతే ఖర్చు పెట్టిస్తున్నారేమో

ప్రియ ఎట్లాంటి మనిషైనా గోవిందరావు ఆమెని కన్నతండ్రి... కన్నబిడ్డలు అమాయకులుగానే కనిపిస్తుంటారు ఏ తండ్రికైనా, వాళ్ల గురించి తెలిసినా.

మర్నాడు లీవ్‌లెటర్ తీసుకుని ఆఫీసుకి బయల్దేరాడు. మధుకి లీవ్‌లెటర్ యిస్తూ అతని మొహంలోకి చూశాడు.

మామూలుగా ఉంది అతని మొహం

అతని గది అంతా కలియచూశాడు.

ఏ.సి. రూమ్, ఒకవైపు పెద్ద టేబుల్, రివాల్వింగ్ చెయిర్, ఫోన్, ఇంటర్ కమ్, యింకొకవైపు సోఫాలు, వాటిముందు టీపాయ్. అందమైన ఫ్లవర్ వాజ్‌లో తాజాగా నవ్వుతున్న పూలు.

ఇవన్నీ చూసి ప్రియ అతని వలలో పడింది. ప్రేమించింది. పెళ్లి చేసుకుంటాడేమోనని ఆశపడి వెంట తిరిగింది. తిరిగినన్నాళ్లూ తిరిగి శుభ్రంగా మొహం చాటేశాడు.

ఆయనకి మధుని పీకనులిమి చంపాలన్నంత కోపంగా ఉంది. ఎట్లాగో దాచుకుని బయటకు నడిచాడు.

అదే ఆఫీస్‌లో ఉన్న తన స్నేహితుడు గోపాల్ దగ్గరకు వెళ్లాడు.

"గోపాల్... మా ప్రియ తెలుసుగా ఉత్త పిచ్చిది. అది గొప్పలకి పోయి లేనిపోని ఖర్చులన్నీ చేసినట్లుంది. ఇక్కడ ఆఫీస్‌లో దాని ఫ్రెండ్స్‌కి కూడా బోలెడు డబ్బివ్వాలని చెప్పింది. అన్ని అప్పులు తీర్చేస్తే అసలు



జీతం రెండు వందలు కూడా యింటికి తీసుకె ళ్లలేదు. ఏమిటో, దాని అమాయకత్వం చూసి నలుగురూ ఆడిస్తున్నారేమో ననిపిస్తోంది'' అన్నాడు.

ఆయన ఆలోచన ఆయనది.

అందులో తప్పులేదు.

ప్రియ మొదట మధు చేతిలో వంచించబ డింది. ఆ తర్వాత రాజేష్ ఆమెను సతాయిస్తు న్నాడు. ఇదంతా ప్రియ అమాయకత్వం వల్లే జరుగుతోందని ఆయన అనుకోవడంలో పొర పాటు లేదు. వాళ్లల్లాగే ఈ ఆఫీస్‌లో వాళ్లంతా ప్రియ సొమ్ము ఖర్చుపెట్టించి తాము ఒడ్డున కూర్చుని ఆమెని అప్పులపాలు చేశారేమోన న్న భ్రమ ఆయనది.

గోపాల్ నవ్వాడు.

"గోవిందం, నేను నీ బాల్య మిత్రుడిని. నన్ను నమ్మగలవా'' అన్నాడు.

"అదేం ప్రశ్న... నీతో కష్టం సుఖం చెప్పు కుందామనే కదా''

"అయితే విను... నీ కూతురొకటీ, నా కూతురొకటీ కాదు. మన పిల్లల గురించి ఊళ్లో అందరికీ తెలిసింతర్వాత మనకి తెలుస్తుంది. నీ కూతురు నువ్వనుకుంటున్నట్లుగా అమా యకురాలు, వెర్రిబాగుల్దీ కాదు. ఎవరినన్నా క్షణాల్లో బుట్టలో పడేయగల దిట్ట. మనుషుల్ని క్షణాలమీద విడగొట్ట గలదు. పరమ పిసినారి వెధవ దగ్గరకూడా అప్పు పేరుతో డబ్బు రాబట్టగల సమర్థురాలు. నీకు కోపం వచ్చినా నేను చేయగలిగేది ఏమీలేదు, నిజం చెప్పటం తప్ప. దేనికైనా తెగించగల అనవసరమైన ధైర్యం సాహసం ఉన్నాయి. ప్రియ తన బుద్ధిని సక్రమమైన మార్గంలో పెట్టుకుంటే మంచి తెలివిగలది అనే వాడిని నిస్సంకో చంగా. కానీ ఇప్పుడు అట్లా అనలేను. ప్రత్య క్షంగా ఆమె ప్రవర్తన అంతా చూస్తున్నాను. పూర్తిగా బాధ్యతా రహితంగా ఉంటుంది. పిల్ల తల్లిననే మాట కూడా మర్చిపోయి హోటళ్లకీ, సినిమాలకీ తిరుగుతుంటుంది. ఎవరితోనని అడగకు. నీకు తెలియదనుకోను. యింక నీ పిల్లను ఎవరో మోసం చేసి డబ్బులు ఖర్చుపె ట్టిస్తున్నారన్నది పూర్తిగా అర్థంలేని మాట. ప్రియ ఒకళ్లకోసం పైసా కూడా ఖర్చు చెయ్య దు. నిలువెల్లా స్వార్థం తప్ప యింకోటిలేదు. తనే అందర్నీ మోసం చెయ్యాలి తప్ప తనని మోసం చేసేవాళ్లెవరూ యిక్కడలేరు. ఆఫీ సులో అందరి దగ్గరా రకరకాల కబుర్లు చెప్పి అప్పులు చేసింది. మీ అమ్మాయిని నమ్మి వందలు వందలు అప్పు యిచ్చిన ఆడవాళ్లు తిరిగి అది రాబట్టుకోలేక యింట్లో మొగుడి దగ్గర తన్నులు తింటున్నారు. అన్నీ తెలిసి కూడా ఏమీ పట్టనట్లు తన సుఖం మాత్రమే తను చూసుకునే మనిషి మీ పిల్ల. ఆమె అప్పులు చేయటమే తప్ప అవి తీర్చటం మానేసి చాలాకాలం అయింది. నీ కూతురు చెప్పే కబుర్లన్నీ నమ్మితే నువ్వొక చవటవి అవుతావు'' అన్నాడు గోపాల్.

నిశ్చేష్టుడై వింటున్నాడు గోవిందరావు.

కళ్లకి కట్టిన మమకారపు పొరలు తొలగి పోయి పరమ సత్యాలు కనబడుతున్నాయి.

"ఇప్పుడేం చేస్తే బాగుంటుందంటావ్'' అన్నాడు నీరసంగా.

"మీ పిల్లకి బుద్ధి చెప్పుకో. ఎదిగే పిల్లని దృష్టిలో పెట్టుకుని తిళ్లూ, తిరుగుళ్లూ తగ్గించ మను. సిస్టమాటిక్‌గా వాడుకుంటే అప్పులు తీర్చటం పెద్ద కష్టం కాదు. మనిషన్నాక రోషం ఉండాలి. అప్పు తీసుకునేటప్పుడు చూపించే ఉత్సాహం, తీర్చేటప్పుడు కూడా చూపాలి. అక్ఖర్లేని ఖర్చు జోలికి పోకూడదు. ఒళ్లొంచి పనిచేసుకోవాలి. బీదరికంతో అప్పులు చేస్తే ఎవరన్నా జాలి పడతారుగానీ దర్జాలకీ, షోకు లకీ అప్పులు చేసి కూర్చుంటే జాలిపడరు. నీ దగ్గరే ఉంచుకుందామని అనుకుంటున్నావు కాబట్టి జీతం నీకే యివ్వమను. ఆవిడ ఖర్చు లకి నువ్వే డబ్బు యిస్తుండు, అప్పుడు తప్పకుండా దార్లో పడుతుంది'' అన్నాడు గోపాల్




"సరే వస్తాను'' అంటూ లేచాడు గోవిందరావు.

"బాధపడకు. ఎంతయినా మనం కన్న పిల్లల్ని మనమే కడుపులో దాచుకోవాలి. బుద్ధి చెప్పుగానీ, భయపెట్టకు'' అన్నాడు గోపాల్.

"అలాగే''

ఇంటికి వచ్చాక ఆయన అట్లాగే వెర్రిచూపులు చూస్తూ ఉండిపోయాడు.

తను పెద్ద అగ్ని గుండంలో పడ్డట్లు అనిపిస్తోంది ఆయనకి.

ఎవరి దగ్గరకన్నా వెళితే మీ పిల్లలు మంచివాళ్లు, బుద్ధిమంతులు అని పొగడాలని ఆశిస్తాడు ఏ తండ్రయినా. కనీసం ఏ పొగడ్తా లేకపోయినా ఫర్వాలేదు. కానీ నీ కూతురు నిజస్వరూపం ఇదీ అని ఎవరన్నా తేటతెల్లం చేస్తే కలిగే బాధ పగవాళ్లకి కూడ వద్దు అనిపించింది ఆయనకి.

"లీవ్ లెటర్ యిచ్చారా'' అడిగింది ప్రియ.

"ఊ'' అన్నాడు ముభావంగా.

ప్రియకి ఇప్పుడు జ్వరంలేదు. ఒళ్లు తేలిగ్గా హాయిగానే ఉంది. స్నానం చేసి భోంచేసింది కూడా.

"ప్రియా'' పిలిచాడు గోవిందరావు.

"ఏంటి నాన్నగారూ'' మెల్లగా అడిగింది ప్రియ.

ఏం మాట్లాడలేకపోయాడు గోవిందరావు. ప్రియ మొహం చూడగానే తెలియని బలహీనత ఏదో ఆవరించి అశక్తుడైపోయాడు. ఏదేదో చెప్పాలనుకున్నాడు. కానీ ఏదీ చెప్పలేకపోయాడు. కన్న కడుపు బాధతో మూలిగింది.

"అతను యిప్పుడు ఏం చేస్తాడనుకుంటున్నావ్'' అన్నాడు మెల్లగా.

ప్రియ గట్టిగా నవ్వింది.

"ఏం చేస్తాడు. ప్లీడరింటికి రహస్యంగా వెళ్లలేదు కాబట్టి అక్కడికి వెళ్లిన విషయం అతనికి తెలిసిపోయింది. అంత మాత్రాన అతడేదో చేస్తాడనీ, ఏదన్నా చేయగల సమర్థుడనీ మీరు అనుకోకండి. నాన్నగారూ... అతనేమీ చేయలేడు. నోర్మూసుకుని పడుంటాడు. ఆ కొంపలో ఉండబట్టి అతను దౌర్జన్యం చేశాడు. ఒకసారి బయటకి వచ్చేశాక యింకేం చేయగలడు'' హేళనగా నవ్వింది.

అంత విపత్కర పరిస్థితిలో ఉండి కూడా ప్రియ అంత హాయిగా ఎట్లా నవ్వుతోందో గోవిందరావుకి అర్థం కాలేదు.

"ఏమైనా యిది తీసి పారేయాల్సిన విషయం కాదు. తేలికైన వ్యవహారం కాదు'' అనిపించింది ఆయనకి.

ఏం చెయ్యాలి. తను ఏదో మామూలు మధ్య తరగతి మనిషి. కష్టపడి పనిచెయ్యటం, జీతం రాళ్లు తెచ్చుకుని జాగ్రత్తగా గడుపుకోవటం, ఒకళ్లతో పోట్లాడకుండా, గొడవలు లేకుండా ఏదో శాంతిగా బతుకు గడిచిపోతే చాలనుకోవటం యివి తప్ప తనకింకేం తెలియదు. తనేకాదు, తన తండ్రి, తాతయ్యా, తన తరపువాళ్లు, భార్య తరపువాళ్లు ఎవరికీ అత్యాశగానీ, దురాశగానీ లేవు. సాదాసీదా మనుషులు. మరి ప్రియకి ఈ బుద్ధులన్నీ ఎట్లా వచ్చాయి.

ఏదైతే అయింది. ఇప్పుడవన్నీ ఆలోచించి లాభం లేదు. ప్రస్తుతం ప్రియ ఒక ఆడపిల్ల. భర్త చేతిలో కష్టాలు పడుతున్న ఆడపిల్ల, తన కూతురు, దాన్ని క్షమించి కడుపులో పెట్టుకుని కాపాడాల్సిన బాధ్యత తన మీదుంది. యింక జల్సాలు, అప్పులు వాటి గురించి తీరిగ్గా క్లాసు తీసుకుంటే సరి. ముందు ఈ వ్యవహారం సెటిల్ అవుతే ఆ తర్వాత కూతురికి చెప్పుకునేవి చెప్పుకుని మార్చుకోవచ్చు.

ఎప్పుడో ప్రియ చిన్నతనంలోనే ఆలోచించి, ఆమె ప్రవర్తన కనిపెట్టి మంచి మార్గంలో పెట్టాల్సింది. ఉన్నదానితో తృప్తి పడాలనీ, దురాశ దుఃఖానికి చేటనీ గట్టిగా చెప్పి ఉండాల్సింది. తన ఖర్మ కాకపోతే, పిల్ల తల్లయిన పిల్లకి బుద్ధులు చెప్పాల్సి రావటం ఏమిటి... నిట్టూర్చాడాయన.



మర్నాటి నుంచీ ప్రియ ఆఫీసుకి వెళు తోంది. మధుకి చెప్పింది.

"సామానంతా అప్పులవాళ్లు పట్టుకు పోయారంటున్నాడు. నిజమే అయుండవచ్చు. ఎందుకంటే, ఎన్నోసార్లు అప్పులవాళ్లు గొడవ చేశారు. ఇది పట్టుకుపోతాం, అది పట్టుకుపోతాం అనే వాళ్లు. నేను లేని సమయం చూసి తీసుకునిపోయి ఉండవచ్చు. లేకపోతే వాడే పాత సామాన్ల కొట్లో అమ్మేసుకున్నాడో. ఏది జరిగినా జరిగి ఉండవచ్చు" అంది. మధుకి ఆమె చెపుతుంటే చచ్చేట్లు నవ్వువచ్చింది. "మొత్తానికి నీకన్నా మీ ఆయనే తెలివిగలవాడు" అన్నాడు.

ప్రియ దిగులు మొహం చూసి అతనికి జాలివేసింది. "బాధపడకు, పోతే పోయిందిలే వెధవ సామాను, మళ్లీ కొనుక్కోవచ్చు" అన్నాడు.

"సామాను సరే... నా చీరలు, జాకెట్లు అన్నీ బీరువాలోనే పెట్టాను. అవీ మాయం అయ్యాయి. రోజూ మా అమ్మవో చెల్లివో కట్టుకుని రావాలి" అంది.

"సాయంత్రం షాపింగ్‌కి వెళదాంలే' అన్నాడు మధు.

ప్రియ మొహం విప్పారింది.

"అలాగే' అంది.

సాయంత్రం యిద్దరూ కార్లో బయల్దేరారు.

రెండు షిఫాన్ చీరలూ, రెండు కాటన్ చీరలూ కొన్నాడు మధు. అక్కడ్నుంచి రెడీమేడ్ జాకెట్లూ, లంగాలూ అమ్మే షాపుకి వెళ్లారు. అక్కడ వాటికి మాచింగ్ జాకెట్లు చూపించమన్నారు.

నిజానికి ప్రియకి బట్టల ప్రాబ్లమ్ లేదు. తల్లీ చెల్లెలూ తమవి చెరో మూడు చీరలూ యిచ్చారు కట్టుకోమని. చెల్లెలు జాకెట్లు కూడా ఇచ్చింది. ఇద్దరిదీ ఒకే సైజు కావటంవల్ల వాటితో ఆఫీసుకి వచ్చి పోవటానికి బట్టల కోసం బాధలేకుండా పోయింది. కానీ మధుతో షాపింగ్ అంటే అన్నీ అతనే కొంటాడు. ఆ టెంప్టేషన్ చంపుకోలేకపోయింది.

గ్రీన్‌కలర్ షిఫాన్ చీరకి మాచ్ అయ్యే లంగా ఆ చీరకి దగ్గరగా పెట్టి చూస్తోంది ప్రియ.

ఇంతలో ఎవరో షాపులోకి వచ్చారు.

"చేతులున్న బనీన్లు తెల్లవి చూపించు బాబూ" అడుగుతున్నారు.

ఆ మాటలకి అప్రయత్నంగా తలెత్తి చూసిన ప్రియ అట్లాగే నిలబడి పోయింది.

ఆ వ్యక్తి గోవిందరావు.

జాకెట్లు, లంగాలు ఖరీదు చేస్తున్న ప్రియనీ, ఆ పక్కనే నిలబడి సూచనలిస్తున్న మధునీ చూసేసరికి ఆయన రక్తం మరిగిపోయింది.

ఒక్క క్షణం కూడా అక్కడ నిలబడకుండా బయటకు నడిచాడు.

"యిప్పుడేం చేద్దాం" గొణిగాడు మధు.

"ఈ పాకెట్లు నీతోనే తీసుకు వెళ్లు. మా నాన్నగారు చూస్తే చంపేస్తారు. నా దగ్గర డబ్బు లేదని ఆయనకి తెలుసు. నీతో వచ్చాననీ, నీ డబ్బుతో ఇవన్నీ కొనిపించుకున్నాననీ తెలిస్తే బతకనియ్యరు" అంది ప్రియ.

"నేనెక్కడికి తీసుకెళ్లను. మా ఆవిడ చూస్తే అసలు బతకనివ్వదు" అన్నాడు మధు.

"ఆలోచించు... ఎక్కడో, ఏ ఫ్రెండ్ యింట్లోనో రెండ్రోజులు ఉంచు"

"ఆ పని నువ్వే చెయ్యవచ్చుగా"

"బాగానే ఉంది. నేను ఎవరి యింట్లో ఉంచాలి. అసలే కొత్త బట్టలు. ఎవరికి యిచ్చి దాచమన్నా మళ్లీ నాకు తిరిగి ఇవ్వరు. బాకీ కింద అడ్జస్ట్ చేసేస్తారు"

"సరే చూస్తాలే' మధు అయిష్టంగానే ఆ పాకెట్స్ తీసుకున్నాడు.

వాటిని డిక్కీలో వేశాడు.

"ఇవి ఈ రాత్రికి యిక్కడే ఉంచుతాను. రేపు ఆఫీసుకి తెచ్చి బీరువాలో పెడతాను.




నీకు కావల్సినపుడు వచ్చి తీసుకువెళ్లు''
అన్నాడు.

"సరే"

బస్ స్టాప్‌కి కొద్ది దూరంలో దిగిపోయింది ప్రియ.

నడుస్తూ ఇంటిదారి పట్టింది.

తండ్రి ఏం అరుస్తాడోనని చచ్చేభయంగా ఉంది. గోవిందరావు యింకా యింటికి రాలేదు.

బస్‌లో వస్తున్నాడు కాబోలు అనుకుంది. ప్రియ వెనకే ఆయన కూడా వచ్చాడు.

"ఏం కొంటున్నావు షాప్‌లో" అన్నాడు.

ప్రియ ఆయన అడిగే ప్రశ్నలకి సమాధానం రెడీగానే ఉంచుకుంది.

"మధు భార్యకి చీర కొంటానంటే సెలక్షన్‌కి వెళ్లాను'' అంది.

"ఏం ఆవిడకి సెలక్షన్ రాదా''

"టైమ్ లేదుట"

'నీ సెలక్షన్ ఆవిడకి నచ్చుతుందా?"

"తెలీదు ఎంతైనా అతను ఆఫీసర్‌కదా! ఏదన్నా సాయం అడిగినప్పుడు కాదంటే బాగుండదు''

నదురూ బెదురూ లేకుండా సమాధానమిస్తున్న ప్రియని చూసి గోవిందరావు నివ్వెరపోయాడు.

ఆయన షాప్‌లో స్పష్టంగా విన్నాడు.

"ఈ చీరెకి ఈ జాకెట్ బాగా మాచ్ అవుతుంది. నీ ఒంటిమీద భలేగా ఉంటుంది. యిదే తీసుకో అంటున్నాడు మధు.

మధుతో బట్టలు కొనిపించుకుందన్న మాట. అది తనకు తెలియకూడదని ఎంత బాగా కబుర్లు చెప్తోంది.

నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయాడు.

"బస్‌స్టాండ్‌దాకా దింపినట్లున్నాడు''

"అవును మరి, తన పని మీదేగా వెళ్ళాము. ఆ మాత్రం లిఫ్ట్ యివ్వడా''

యింకేం మాట్లాడలేదాయన.

"ఏమిటో పిచ్చిపిల్ల. ప్రతీ వాళ్ళకీ సాయంచేయాలని తెగ హడావుడి పడుతుంది. ఆ ప్రయత్నంలో ఎవరేం అనుకుంటారోనని ఆలోచించదు. అసలే మీ ఆయన్ని వదిలి దూరంగా ఉండాలనుకుంటున్నావు. యిప్పుడు ఎంత ఆఫీసరైతే మాత్రం పరాయి మగాడితో షాపింగ్‌కి తోడువెళ్తే నలుగురూ ఏమన్నా అనుకోరూ. కాస్త గడుసుతనం నేర్చుకుని బతకాలి. ఏదో పనున్నదని చెప్పి బయటపడు యిక నుంచీ'' అన్నది పార్వతమ్మ.

"అట్లాగేలే" అంది ప్రియ.

గోవిందరావుకి నవ్వు వచ్చింది.

ప్రియ అమాయకురాలనుకుంటున్న పార్వతమ్మ అమాయకత్వం చూసి ఏడుపొచ్చింది.

ప్రియని చూస్తే అసహ్యం వేసింది.

యింతటి అఖండమైన బుర్రని మంచి మార్గంలో పెట్టుకుంటే ప్రియకీ యితరులకీ కూడా లాభంగా ఉండేది. కానీ యిట్లా వక్రమార్గంలో పెట్టుకుని తను మాత్రం ఏం సుఖపడుతోంది.

యిట్లాంటి వెధవ తెలివితోనేగా, రాజేష్‌కి గాలం వేస్తున్నాననుకుని తనే గాలంలో చిక్కుకుంది. అది చాలు, ప్రియ జీవితాంతం ఏడవటానికి.

యిప్పటికైనా అబద్ధాలు, అనవసరపు సరదాలు మానుకోలేదు. జిహ్వ చంపుకోలేదు.

తనకైతే ఒకటి, యింకొకళ్ళకయితే ఒకటి. మధుతో ఎందుకు తిరుగుతున్నావంటే కేవలం స్నేహం అని చెప్పి, అల్లరీ ఆగం చేసి అట్లా అడిగినవాళ్ళ పీక పిసికినంత పని చేస్తుంది.

అదే యింకెవరన్నా పొరపాటున యింకో మగాడితో మాట్లాడ్డం చూసిందంటే చాలు, నానా తాటాకులూ అంటగట్టేస్తుంది.

చిన్నప్పుడు ప్రియ లత దగ్గర చాక్లెట్లు, బిళ్ళలు లాక్కుని తిని లతే తన్ని కొట్టి లాక్కుందని చెప్పి ఏడ్చేది. అది పసితనం

అనుకున్నాడు ఆరోజుల్లో. యివాళ్టికి పాతికేళ్ళు పైబడ్డా ఈషణ్మాత్రం మారలేదు ఆ బుద్ధి. ఊళ్ళో వాళ్ళందరి దగ్గరా ఏదో ఒకవిధంగా ఉపకారాలు పొంది, డబ్బులు దోచేసి తనే అందరిచేతా ఎక్స్‌ప్లాయిట్ చెయ్యబడుతున్నట్లు నాటకాలు ఆడి, అందర్నీ నమ్మించాలని చూస్తోంది.

'భగవంతుడా... నాకేది దారి. ఎందుకిలాంటి కూతుర్ని యిచ్చావు నాకు' ఆవురుమంటూ ఏడ్చాడు తన గదిలోకెళ్ళి.

★ ★ ★

లాయర్ భార్గవచేత నోటీస్ యిప్పించింది ప్రియ. "ఈ దెబ్బతో కుక్కిన పేనవుతాడు. వచ్చినట్లు కాళ్ళదగ్గరకొచ్చి బతిమాల్తాడు. కొంచెంసేపు బెట్టుచేసి, ఆ తర్వాత చెప్పినట్లు వింటాననీ, కొట్టననీ, తాగననీ, ఏదన్నా ఉద్యోగమో, వ్యాపారమో తప్పకుండా చూసుకుంటాననే మాట తీసుకుని కాగితంమీద రాయించుకుని అప్పుడు తిరిగి కాపరానికి వెళ్ళు'' అన్నాడు మధు.

ప్రియ తల ఊపింది.

ఆ నోటీస్ నిన్నో, యివాళో రాజేష్‌కి అందే ఉంటుంది.

యివాళో, రేపో వస్తాడని అనుకుంటోంది ప్రియ. అనుకున్నట్లే రాజేష్ వచ్చాడు.

కానీ ఒంటరిగా కాదు.

అతనితో కలసి రోడ్లమీద తిరిగే బలాదూరు మనుషులు యింకో పదిమందిని తీసుకొచ్చాడు.

వాళ్ళు రావటం రావటం నేరుగా యింటి లోపలకు వచ్చేశారు.

అంతమందిని చూసేసరికి గోపాలరావుకీ, పార్వతమ్మకీ వణుకు ఆగలేదు. లత సంగతి చెప్పనే అక్కర్లేదు.






"ఏందే... నోటీసు పంపావు... నోటీస్..." అన్నాడు రాజేష్.

ప్రియ మాత్రం జంకలేదు.

"అవును మరి... నువ్వు తంతుంటే, తిడ్తుంటే పడటానికి నాకు సిగ్గులేదా. కూలిచ్చి తన్నించుకున్నట్లు నా డబ్బుతో నిన్ను పోషించేది చాలక యింకా నీతో తన్నులు తినాలా. ఫో బయటకి'' అన్నది రౌద్రంగా.

"దొంగముండా... నన్ను పొమ్మంటావే. నన్ను పోషిస్తున్నావా బోడిముండా. పోషించక ఏం చేస్తావే. మొగుడికి ఉద్యోగం ఉంటే పెళ్ళాన్ని పోషించడా! ఆడా మొగా సమానమే నని చెప్తుంటావుగా మరి. మొగుడికి నాలుగు మెతుకులు పెట్టాలంటే ఏడుపు వస్తోందేం. ఏడుపు'' రాజేష్ రంకెలు వేశాడు.

"అరవకు... అసలు ఈ పెళ్ళి చెల్లదు. నన్ను మోసం చేసి చేసుకున్నావని కేస్ పెడతాను. చదువూ ఉద్యోగం ఏమీ లేకుండా అవన్నీ ఉన్నాయని నన్ను మోసం చేశావు'' అన్నది ప్రియ.

"ఆహా... చదువుకున్నవాడు నాకన్నా నీకు ఎక్కువ ఏం చేస్తాడే'' అన్నాడు రాజేష్. ఆ తర్వాత పచ్చిబూతులు నాలుగు మాట్లాడాడు.

చుట్టుపక్కల అందరూ చేరి చోద్యం చూస్తున్నారు. గోవిందరావుకీ, పార్వతమ్మకీ పాతాళంలోకి కుంగిపోతున్నట్లు ఉంది.

"అరుచుకో... నాకేం సిగ్గులేదు. నీ అరుపులకి సిగ్గుపడీ, భయపడీ నీతో వస్తాననుకున్నావా. చచ్చినా రాను'' తనూ అరిచింది ప్రియ.

"ఎందుకొస్తావే... పాత రంకు మొగుడు తిరిగి మళ్ళీ తగులుకున్నాడు కదా. పాడుముండా! ఆ మధుగాడితో తిరుగుళ్ళు నాకు తెలియదనుకున్నావా. ప్లీడర్ని కుదిర్చిందీ వాడే. నీకు వాడేమేం చేస్తున్నాడో నాకు తెలీదా. నీ మొగుడ్నే నేను. నీకు నాలుగు రెట్లు అధికం

చదివాను లోకాన్ని'' అన్నాడు రాజేష్.

"ఏమన్నా అనుకో, పో'

"సరే... నువ్వు నన్నుఖర్లేదనుకున్నావు! నువ్వూ నాకు వద్దు. కానీ నా పిల్ల నాక్కావాలి. ఏదీ నా కూతుర్ని నాకిచ్చెయ్యి'' అన్నాడు రాజేష్.

"నీకెందు కివ్వాలి''

"ఎందుకివ్వవు... కొంపదీసి, అది నాకు పుట్టలేదా ఏంటి'' వెకిలిగా నవ్వాడు రాజేష్.

ప్రియకి ఒళ్ళంతా చీమలు పాకుతున్నట్లుంది.

"నేనివ్వను. నీకే గతిలేదు యింక పిల్లకేం పెడతావ్'' ఉగ్రంగా అరిచింది.

"అది నీ కనవసరం. గతిలేకపోతే ముష్టెత్తి పెడతాను. లేకుంటే నాతోపాటు పస్తులుంటుంది. అంతేగానీ నా కూతుర్ని మాత్రం వదులుకోలేను. నీలాంటి నీతిలేని దానిదగ్గర నా కూతురికి రక్షణలేదు. దాన్ని కూడా నీలాగే తయారుచేస్తావు. బలవంతంగానైనా సరే తీసుకెళ్తాను. చేతనైతే కోర్టులో గెలుచుకో?'' అన్నాడు రాజేష్.

గోవిందరావు యింక ఉర్కోలేకపోయాడు. రాజేష్‌తో వచ్చిన వాళ్ళని చూశాడు. వాళ్లంతా పచ్చి రౌడీలు, గూండాల్లా ఉన్నారు. తన లాంటి సభ్యమానవులు వాళ్ళ నోట్లో నోరుపెట్టలేరు. ఆపైన వాళ్ళు దౌర్జన్యానికి దిగితే అసలు ఎదుర్కోలేరు. అన్నీ చూసుకునే వచ్చాడు రాజేష్.

అతని ధైర్యం ఏమిటో తనకి తెలుసు. ఆడదాని బలహీనత పిల్లలు.

ఏరకం ఆడదైనా మాతృత్వానికి మాత్రం బానిసే. ఆ ధీమాతోనే రాజేష్ వచ్చాడు. పిల్లని తీసుకెళ్ళిపోతే తప్పనిసరిగా ప్రియకూడా వెనకే వస్తుందని తెలుసు కాబట్టి, దౌర్జన్యంగానైనా పిల్లని తీసుకెళ్దామని వచ్చాడన్నమాట.

"పిల్లను యివ్వదు. నీకేం కావాలన్నా కోర్టుద్వారా సాధించుకో వెళ్ళు'' అన్నాడు.

"నువ్వేందిరా మాట్లాడ్తావు. తంతాను జాగ్రత్త' అన్నాడు రాజేష్.

"ఏయ్ మర్యాదగా మాట్లాడు'' అన్నాడు గోవిందరావు.

రాజేష్ ఒక కవరు ఆయనమీదికి విసిరేశాడు. దానిలో ఫొటోలు... ప్రియ, మధు చాలా సన్నిహితంగా కౌగిలించుకుని ఉండగా తీసినవి.

"నీకేందిబే మర్యాద యిచ్చేది. నువ్వు కూతుర్ని నీ యింట్లో ఎందుకుంచుకున్నావో నాకు తెలీదా. అది అందరితోటీ తిరిగి సంపాదించిన డబ్బుతో మేడలు కడదామని. అది ఆఫీసర్ని పట్టిందని మురిసిపోతున్నావు. మొన్నదానికి మధుగాడు షాపులో బ్రాసరీలు కొని పెట్టుంటే చూస్తూ నిలబడ్డావు. నువ్వారా నాకు చెప్పేది. బ్రోకర్ వెధవా. పెళ్ళాన్నీ పిల్లల్నీ పెట్టుబడిగా పెట్టి దుకాణం తెరుస్తావురా'' అన్నాడు రాజేష్ గట్టిగా.

వినలేకపోయాడు గోవిందరావు.

జీవితంలో ఇట్లాంటి మాట పడాల్సివస్తుందని ఆయన ఎన్నడూ అనుకోలేదు.

ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాడు. మూసిన కళ్ళల్లోంచి రెండు కన్నీటిచుక్కలు కారాయి.

అంతే...

మరుక్షణం ఆయన మొహం రౌద్రంగా మారిపోయింది.

పిల్లను తెచ్చి ప్రియ చేతికి యిచ్చాడు.

"పో బయటకి'' అన్నాడు.

ప్రియ తెల్లబోయింది.

"ఎక్కడికి'' అన్నది.

"ఎక్కడికో నాకు తెలీదు. నీ యిష్టం వచ్చిన చోటికి పో. వెళ్ళి, మీ అసహ్యాకరమైన పోట్లాటలన్నీ అక్కడ పెట్టుకోండి. నా యింట్లో ఒక్క క్షణం కూడా ఎవరూ ఉండటానికి వీల్లేదు'' అన్నాడు.

"నాన్నగారూ... నన్ను పంపించారంటే




నేనూ పిల్లా చచ్చిపోతాం" ప్రియ ఆఖరుసారి బెదిరించింది.

"చావండి! అదే మంచిది. కన్న మమకారానికి లొంగి యిన్నాళ్ళూ మూగవాడినైపోయాను. యింక నా వల్లకాదు. తల్లితండ్రుల దగ్గర కూడా నిజాలు దాచి, దొంగాటలాడే నీలాంటి కూతురు పుట్టటం మా ఖర్మ. నువ్వు బతికి ఉంటే నేను రోజూ ఏడుస్తూండాలి. చచ్చావంటే ఒక్కరోజు ఏడ్చి ఊరుకుంటాను. అదే సుఖం"

"ఊరికే బెదిరిస్తున్నాననుకుంటున్నారేమో. కిరసనాయిల్ పోసుకుని నిజంగానే అంటించుకుని చస్తాం"

"ఇంకొక్కక్షణం యిక్కడే ఉన్నావంటే నేను పెట్రోలు పోసి అంటిస్తాను నిన్ను" అరిచాడు గోవిందరావు.

ప్రియ కొంచెం బెదిరింది.

"ఎక్కడికి వెళ్ళను" అంది దీనంగా.

"నీ యిష్టం. అతనన్నట్లు మధు యింటికే వెళ్ళుపోనీ పో' కర్కశంగా అన్నాడు గోవిందరావు.

ప్రియ ఏడుస్తూ నిలబడింది.

గోవిందరావు కరగలేదు. శిలలా నిలబడ్డాడు. ఏడ్చి ఏడ్చి తెప్పరిల్లి ఆలోచించింది ప్రియ. యిప్పటికి యింక రాజేష్‌తో వెళ్ళటం తప్ప మరో మార్గం లేదు.

పిల్లని భుజాన వేసుకుంది.

"వెళ్ళొస్తాను' అంది హీనస్వరంతో.

"మళ్ళీ రాకు. నాకు లత ఒక్కర్తే కూతురు. నా పెద్దకూతురు చచ్చింది" అన్నాడు గోవిందరావు.

తల్లీ, చెల్లెలూ లోపలి గదిలోకి వెళ్ళి తలుపేసుకున్నారు. తలుపు కొట్టి తను వెళ్తున్నట్లు చెప్పినా వాళ్ళు తెరవలేదు. గట్టిగా ఒక్క భీత్కారం మాత్రం వినిపించింది.

తలవంచుకుని బయటకి నడిచింది ప్రియ.

రాజేష్ యింటికి ఆటో మాట్లాడాడు. యింకేం మాట్లాడకుండా ఆటో ఎక్కి కూర్చుంది. రాజేష్ తనతో వచ్చిన వాళ్ళందరికీ ఏదో చెప్పాడు. వాళ్ళంతా వెళ్ళిపోయారు.

యిద్దరూ యింటికి తిరిగి వచ్చారు.

రాజేష్ గర్వంగా నవ్వుతూ చూస్తుంటే ప్రియకి కారం రాసుకున్నట్లయింది.

ఎట్లాగైనా దెబ్బకొట్టాలనిపించింది అతన్ని.

"పెళ్ళాం ఎవడితోనో తిరిగిందని తెలిశాక కూడా రమ్మనే వెధవని నిన్నే చూశాను" అంది.

రాజేష్ చాచి చెంపకాయ కొట్టాడు.

"నోర్మూయ్యి... నాకు వంకలు పెడదామని చూస్తావే. యింకోమాట వచ్చిందంటే ముందు పళ్ళు రెండూ విరగ్గొడతాను జాగ్రత్త' అన్నాడు.

ప్రియ మాట్లాడకుండా ఊరుకుంది. అతను తల్చుకుంటే అంతపనీ చేస్తాడని తెలుసు..

"యిప్పుడు నీకు ఏ దారీలేదు. మీనాన్న నిన్ను రానివ్వడు. వాడే కాదు, అసలు ఎవరూ రానివ్వరు. నన్ను వదిలి విడాకులు పుచ్చుకోవాలని కూడా యింక సాహసం చెయ్యకు. చేశావో ఆ సాక్ష్యాలూ, ఫొటోలూ యింకా బోలెడు తెచ్చి నీ బతుకు బజారుపాలు చేస్తాను. నాతో పెట్టుకోకు. నోరు మూసుకుని పడుండు, ఖబడ్దార్' అని అరిచాడు.

ప్రియ కిక్కురుమనకుండా ఊరుకుంది.

"యింకే వ్యవహారమన్నా చేశావో, నీ రక్తం కళ్ళచూస్తాను. ఆఫీసుకి వెళ్ళి వచ్చి ఒక మూల పడుండు. ఏం మాట్లాడవేం" అన్నాడు.

ప్రియ తల ఊపింది.

  

అంతా చెప్పి కళ్లు తుడుచుకుంటున్న ప్రియని చూసి జాలిపడ్డా, ఏం మాట్లాడలేకపోయాడు మధు.

"నన్ను అతనినుంచి ఎవరు రక్షిస్తారు

మధూ?" అంది ప్రియ.

"సారీ ప్రియా, ఆ ఫొటోలు కొన్ని మా ఆవిడకి కూడా పంపాడు మీ ఆయన. అసలే ఆవిడకి మనమంటే కొంచెం అనుమానం ఉంది. ఇప్పుడింకా కారాలూ మిరియాలూ నూరుతోంది. నీతో ఆఫీసు విషయం తప్ప మరేం మాట్లాడినా నన్ను చంపేస్తుంది'' అన్నాడు మధు.

"అంటే నువ్వేం చేయలేవా?"

"చెయ్యలేను. మామూలుగా అయితే నీకు ఆఫీసర్ హోదాలో, శ్రేయోభిలాషిగా వ్యవహరిస్తున్నట్లు కోర్టుకి సాక్ష్యాలకి కూడా వద్దామనుకున్నాను. కానీ అతను ఇన్ని సాక్ష్యాలు నీకు ప్రతికూలంగా సంపాదించాక నేనేం చెయ్యలేను. మనం మర్యాదస్తులం. ఏం చేసినా లీగల్‌గా ఉందా లేదా అని ఆలోచించాలి. ఇప్పుడు అతన్ని నేనేం అడగలేను. ఇంకా నయం... అతనే నామీద కేస్ పెట్టినా అడిగేవాడు లేదు. ఎందుకో పెట్టలేదు. కాబట్టి బతికిపోయాను. లేకుంటే నా పరువూ ప్రతిష్టా ఏం కావాలి?" అన్నాడు మధు.

ప్రియ రోషంగా తలెత్తింది.

"నీ పరువూ ప్రతిష్ట... హు... ఎంత స్వార్థం" అంది వెక్కిరింపుగా.

కసి, కోపం, ఏమీ చెయ్యలేని అసహాయత ఆమెని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి.

"స్వార్థం లేనిదెవరికి? స్వార్థం ఉండబట్టే ఆస్తీ అందం హోదా ఉన్నాయని నా వెంట పడ్డావు. నేను కాదన్నాక అవన్నీ ఉన్నాయనుకుని, రాజేష్ వెంటపడ్డావు. నీకన్నా స్వార్థం ఎవరికుంది. పెళ్ళాంకి ఇంకొకళ్ళతో సంబంధం ఉందని తెలిసినా నీ జీతం రాళ్ళ కోసం అడ్జస్టయిపోతున్న నీ మొగుడికి లేదా స్వార్థం. కూతురు చచ్చినా పర్వాలేదు, తమ పరువూ ప్రతిష్టా బాగుంటే చాలు అనుకున్న నీ తల్లిదండ్రులకి లేదా స్వార్థం. అసలు మనిషి పుట్టుకలోనే స్వార్థం ఉంది'' అన్నాడు కోపంగా మధు.

"మంచిది. నాకు తెలియని విషయాలు చాలా చెప్పావు'' అన్నది ప్రియ కోపంగా.

రాజేష్ తనని ఎట్లాంటి పరిస్థితిలోకి నెట్టేశాడో ప్రియకి బాగా అర్థమైంది.

తల్లిదండ్రులింక తనని పట్టించుకోరు. ఆఫీసులో, ఇంటి దగ్గరా ఎక్కడా తనకి స్నేహితులంటూ మిగల్లేదు. మిగిలిన ఒకేఒక్క మధు కూడా ఆ ఫోటోల పుణ్యమా అని ఇక లేనట్లే.

ఏం చెయ్యాలి?

"ప్రియా... నీకో సలహామాత్రం ఇవ్వగలను. ఎట్లాగో ఒకలాగా అతనితోనే సర్దుకుపో. ఏదైనా కష్టం అనుకుని చేస్తే కష్టంగా ఉంటుంది. కానీ ఇష్టంగా చేస్తే కష్టం అనిపించదు. నువ్వు అతన్ని ద్వేషిస్తూ కాపరం చేస్తున్నావు. అందుకే నీకు అతనితో ఉండాలంటే కష్టంగా ఉంది. అతను మారడు కాబట్టి నువ్వే మారాలి. అతన్ని తిరిగి ప్రేమించటం మొదలుపెట్టు. మెల్లగా నచ్చచెప్పి నీ మార్గంలోకి తెచ్చుకో. ఒకవేళ అతను మారకపోతే నీ ఖర్మ అనుకుని సరిపెట్టుకో'' అన్నాడు మధు.

"చాలా థాంక్స్. నిజంగా ఇంత మంచి విషయాలు ఇంత సులువుగా బోధించినవాళ్లు లేకపోయి ఇంత కష్టపడుతున్నాను. ఇంత చెప్పిన నీకు నేను కూడా రెండు మంచిముక్కలు చెప్పి పోకపోతే బాగుండదు. అందుకే చెప్తాను. దేన్నయినా చెప్పటం తేలిక, చెయ్యటం కష్టం, ఏదైనా అనుభవించేవాడికే తెలుస్తుంది. ఇంకోటి ఏమిటంటే ఈ లోకంలో అన్నిటికన్నా సులువైన పనేమిటంటే ఇతర్లకి సలహాలివ్వటం" కసిగా అనేసి అతని మొహం చూడకుండా బయటకి నడిచింది.

మధు నిట్టూర్చి ఫైల్‌లో తల దూర్చాడు.

ఆరోజునుంచీ...

ప్రియ మరింత కసిగా, కర్కశంగా తయారైంది. రాజేష్‌తో పోట్లాడటం మానేసింది.

అతను ఏం చెపితే అది సంతోషంగా చేస్తోంది. పదిరూపాయలు అప్పు తెమ్మంటే





తన చాతుర్యాన్ని ప్రదర్శించి ఇరవైరూపాయ లు తెస్తోంది.

భవిష్యత్తుని గురించి ఆలోచించటం మానే సింది. భయం, భక్తీ బొత్తిగా వదిలేసింది.

మనిషి తప్పు చేసినా పట్టుబడను అని అనుకుంటే చాలామంది అన్నీ తప్పులే చేస్తా రు.

కొందరిలో సహజంగా నేరప్రవృత్తి ఉంటుంది. వాళ్ళ ఉపయోగం ఉన్నా లేకున్నా చిన్న చిన్న దొంగతనాలు చేసి మహదానందం పొందుతారు.

హొటళ్ళకెళ్ళి స్పూన్స్ ఎత్తుకురావటం, పళ్ళు కొంటున్నట్లు నటించటం, నటిస్తూ బుట్ట లోంచి కొన్ని పళ్ళు కాజెయ్యటం, అవసరం ఉన్నా లేకున్నా అప్పు చేసేసి డబ్బు తిరిగి ఇవ్వకుండా ఆ అప్పు ఇచ్చినవాడిని ఏడి పించటం, ఇవన్నీ నేరవృత్తికి చిహ్నాలే.

ప్రియలో నేరప్రవృత్తి ఉంది. లేదని ఆమె అనుకోవటంగానీ, తనలోని నేరప్రవృత్తిని కని పెట్టలేకపోవటంగానీ ఆమె దురదృష్టం. ఎందుకంటే తనలో ఉన్న నేరప్రవృత్తిని ఆమె ఏమాత్రం పసిగట్టి ముందుజాగ్రత్త పడినా పరిస్థితి ఇంత ఘోరంగా ఉండేదికాదు.

ఆమెలోని నేరప్రవృత్తిని వెంటనే కనిపె ట్టింది రాజేష్ మాత్రమే. ఆమె తత్వానికి అతను విచారించకపోగా ఆనందించాడు. అత నిది కూడా అట్లాంటి ప్రవృత్తే కాబట్టి ఇద్దరికీ ఆ విషయంలో భేదాభిప్రాయాలు లేవు. ఎంత సేపు పోట్లాడుకున్నా డబ్బులు ఖర్చయ్యా యనో, లేకుంటే రాజేష్ తన్నాడనో తప్ప ఇద్దరి మధ్యా సిద్ధాంత పరమైన భేదాలు లేవు. అతను చెప్పింది తప్పేమోనని ఆమె ఎన్నడూ వెనుకంజ వెయ్యలేదు. ఏ ప్లాన్ చెప్పినా మురిసిపోయి అమలులో పెట్టింది. తప్పు ఒప్పుల మీమాంస ఎన్నడూ లేదు.

పొద్దున్నే లేచి వంటచేసి తిని, పిల్లను తయారుచేసి బేబీ కేర్‌సెంటర్‌లో దింపు తుంది. రాజేష్ తను కూడా లేచి వీధివెంట బయల్దేరుతాడు. ఫ్రెండ్స్‌తో తిరగటం, తా గటం, పేకాడటం మామూలుగానే చేస్తున్నా డు. ప్రియ చచ్చినట్లు నోర్మూసుకుని పడుండటం అతనికి చాలా నచ్చింది.

జబర్దస్తీకి జరగని పనిలేదు అనుకున్నాడు.

"ప్రియా" పిలిచింది రాజేశ్వరి.

"ఏంటి?"

"నా వెయ్యి రూపాయలూ ఇచ్చేస్తావా? మావారు అడగమన్నారు. మేము స్థలం కొందాం అనుకుంటున్నాం. డబ్బు అవ సరం..." మెల్లగా అడిగింది రాజేశ్వరి.

"ఇవ్వగలనో లేదో రేపు చెప్తాను" అన్నది ప్రియ.

రాజేశ్వరి ఒక్కసారి దీనంగా చూసి నిట్టూ ర్చింది.

అప్పు ఇచ్చి కూడా తనే అప్పు పుచ్చుకున్న దానిలా ఇన్నిసార్లు అడిగి లేదనిపించుకోవటం కష్టంగా ఉన్నా తప్పదు. భగవంతుడి దయవ ల్ల ఈ బాకీగానీ వసూలు అయిందా ఇక జన్మలో ప్రియకి అప్పివ్వకూడదు అనుకుంది రాజేశ్వరి.

ప్రియ ఆమె మొహంలో భావాలన్నీ గమని స్తూనేవుంది. రాజేశ్వరి ఏడుపు మొహం చూడ గానే చచ్చేట్లు నవ్వు వచ్చింది.

"దీని అప్పు చచ్చినా తీర్చకూడదు" అను కుంది మనసులో.

మళ్ళీ రాజేశ్వరి మొహం చూసింది.

అదే ఏడుపు మొహం, ఆ కళ్ళల్లో తన డబ్బు ఇక తిరిగి రాదేమోనన్న సందేహం...

తెరలు తెరలుగా వస్తున్న నవ్వు ఆపుకో వటం ప్రియవల్ల కాలేదు.

రాజేశ్వరి ఏడుపు మొహం చూస్తుంటే మనసులోని దుఃఖం అంతాపోయి హాయిగా అనిపించింది.

రెండ్రోజులాగి రాజేశ్వరి మళ్ళీ అడిగింది డబ్బు గురించి. ఇవ్వకపోతే ఊరుకోనన్నట్లు చూచాయగా హెచ్చరించింది.

ఒంటరిగా ఉన్నప్పుడు కాకుండా సెక్షన్లో అందరిముందూ అడిగింది.

"అసలు మావారొచ్చి అడుగుతానంటున్నారు. ఆయన వచ్చి అడిగితే ఎంత అసహ్యంగా ఉంటుందో ఆలోచించు'' అంది.

"ఏడిశాడు'' అనుకుంది ప్రియ మనసులో

"నాలుగురోజులు టైమివ్వు'' అంది పైకి.

"ఇవాళ సోమవారం, శుక్రవారందాకా టైమ్ ఇస్తాను. ఆ తర్వాత ఒక్కక్షణం కూడా ఆగను'' అంది రాజేశ్వరి నిష్కర్షగా.

ప్రియకి ఒళ్లుమండిపోయింది. రాజేశ్వరి అంత నిర్మొహమాటంగా అడగటంతో చెప్పలేనంత కోపం వచ్చింది.

"అంత ఖచ్చితంగా మాట్లాడితే బాగుండదు'' అంది చిరాగ్గా.

"ఎందుకు బాగుండదు? ఏడాదిక్రితం తీసుకున్న డబ్బు ఇందాకా ఇవ్వకపోవటం నీకు బాగుందా?" రాజేశ్వరి కోపంగా అడిగింది.

"డబ్బుంటే ఎందుకివ్వను''

"ఉన్నప్పుడు కూడా ఇవ్వలేదు. నాకు అంతా తెలుసు. ఇప్పుడు నువ్వేం చేస్తావో నాకు తెలీదు. శుక్రవారానికి నా డబ్బు నాకు వచ్చితీరాలి'' అంది రాజేశ్వరి.

"సరే... ఎట్లాగో తంటాలుపడి నీ అప్పు తీర్చేస్తాలే' అంది ప్రియ అనునయంగా.

రాజేశ్వరి మెత్తబడి ఊరుకుంది.

ప్రియకి రాజేశ్వరిని చూస్తే ద్వేషం మండిపోతోంది. బోడి, వెయ్యిరూపాయలు అప్పు ఇచ్చిందో, లేదో పెద్ద ఉద్ధరించేసినట్లు పోజు.

ఏం చెయ్యాలి. అందరిముందూ తన అప్పు తీర్చమని అడిగి అవమానం చేసిన రాజేశ్వరికి ఏదోశాస్తి చేయాలి. ఎలాగా?

అసలు ఎట్లాగో వెయ్యిరూపాయలు సంపాదించి దాని మొహాన కొట్టేస్తే అని ఆలోచన కూడా వచ్చింది. కానీ పైసా పుట్టే మార్గం కనిపించలేదు.

అయినా అట్లా చెయ్యకూడదు. ఆ అప్పు కాస్తా తీర్చేశాక అది ఇంక తన మొహం చూడదు. అప్పు తీరిస్తే దాని బాధ తీరిపోతుంది. అప్పుడు తన కక్ష తీరదు. అలా కాకుండా ఇస్తాను, ఇస్తానని ఊరించి అది ఏడుస్తుంటే చూసి ఆనందించాలి.

ప్రియలో కుళ్లుకి, కపటానికి తక్కువ లేదు. ఆపైన రాజేష్ నూరిపోసిన పాఠాలతో రాటుతేలిపోయింది.

అయినా ఎందుకోగానీ రాజేశ్వరిని క్షమించ బుద్ధికాలేదు.

ఇంతకన్నా గట్టిగా అడిగి, అరిచి గోలచేసి, యాగీచేసి డబ్బు తిరిగి తీసుకుపోయినవాళ్లున్నారు. కానీ వాళ్ళు వేరు. రాజేశ్వరిలాంటి సాధువు కూడా ఇంత గట్టిగా మాట్లాడుతుంటే ఇంక తనంటే ఎవరికి లెక్క ఉంటుంది గనక.

ఇంటికి రాగానే ఏడుస్తూ కూర్చుంది.

"ఏమైంది?" కంగారుగా అడిగాడు రాజేష్. ఎంత కష్టం ఉన్నా ప్రియ సాధారణంగా ఏడవదు.

"రాజేశ్వరి శుక్రవారం లోపల వెయ్యి రూపాయలు తిరిగి ఇచ్చెయ్యమంది''

"దానికి ఏడుస్తారా? ఇస్తాం అనే చెప్పు''

"ఎక్కడ్నుంచి ఇస్తాం?"

రాజేష్ మాట్లాడలేదు.

"అయినా మాత్రం ఏడుస్తారా?" అన్నాడు.

"దానికి కాదు నా ఏడుపు. అది అందరి ముందూ అడిగింది. మిగిలినవాళ్ళంతా నవ్వుతూ చూస్తున్నారు. నాకు ఇన్సల్ట్ అయిపోయింది''

"అవన్నీ లెఖ్ఖ చెయ్యకూడదు. అది సరే దానికి ఇప్పుడంత అర్జంటుగా ఎందుక్కావాలిట"

"స్థలం కొంటుందిట"

"స్థలాలూ, పొలాలూ కొనటానికి డబ్బుంది కానీ, మనకి అప్పించేందుకు లేదా?" పళ్ళు నూరాడు రాజేష్.




ప్రియకి ఆ మాట నచ్చింది.

రాజేశ్వరి స్థలం కొంటోంది. జాగ్రత్తమనిషి కాబట్టి బాగా డబ్బు దాచేఉంటుంది. ఆఫీస్‌లో లోన్ దొరుకుతుంది. పెద్ద ఇల్లు కడుతుంది. తను అద్దెకొంపలో ఈసురోమంటూ ఇంటివాళ్ళ తో తిట్లు తింటుంటే, రాజేశ్వరి హాయిగా సొంతింట్లో ఉంటుంది.

ఉండనీ. ఎవరు వద్దన్నారు. కానీ ఎంత పొగరు? ఎంత నిర్మొహమాటంగా అడుగుతోంది డబ్బు?

"స్థలం కొంటున్నానని పొగరెక్కింది ముండకి'' కసిగా తిట్టింది.

"దాని పొగరు అణిగేమార్గం నేను చూస్తాలే" అన్నాడు రాజేష్.

"ఎలా?"

"చెపుతాను. నేను చెప్పినట్లు చేస్తావా?"

"ఏంటది. చెప్పండి''

అతను చిన్నగా ఏదో చెప్పాడు.

వింటున్న ప్రియ కొయ్యబారిపోయింది.

"ఊహూ, నాకు భయం" అంది.

"నీ మొహం. భయం ఏంటి? దీంతో మన కసీ తీరుతుంది. దాని పొగరూ అణగుతుంది. పైపెచ్చు బోలెడు లాభం కూడా'' అన్నాడు రాజేష్.

"ఆలోచిస్తాను''

"నీ ఇష్టం"

ఇద్దరూ ఆ తర్వాత ఇంకేం మాట్లాడుకోలేదు.

రాజేష్ చెప్పిన దాని గురించి ఆలోచిస్తూ ఉండిపోయింది ప్రియ.

కొంచెం సేపయ్యాక అతను చెప్పినట్లే చెయ్యాలని నిశ్చయించుకుంది.

రాజేష్ చెప్పిన విషయం సామన్యమైనది కాదు. అతను ప్రియని దొంగతనం చెయ్యమని చెప్పాడు.

ఎల్లుండి జీతాలరోజు. జీతంతోపాటు బోనస్ కూడా ఇస్తారు. అంతా కలిసి రాజేశ్వరికి నాలుగువేల పైన వస్తుంది. రాజేశ్వరి ఆ డబ్బు తీసుకుని బ్యాగ్‌లో పెట్టుకుంటుంది. టాయిలెట్‌కో దేనికో ఆ తర్వాత వెళ్ళకమానదు. అప్పుడు సమయం చూసి బ్యాగ్‌లోంచి డబ్బు కొట్టేసి గబగబా ఇంటికొచ్చెయ్యాలి.

అదీ రాజేష్ చెప్పిన సలహా. జీతం డబ్బులమీదే ఆధారపడ్డ మనుషులు ఆ జీతం కాస్తా పోతే ఎంత విలవిలలాడుతారో ప్రియకి తెలుసు. ఆపైన రాజేశ్వరికి ఇప్పుడు డబ్బు చాలా అవసరం.

డబ్బుపోయి ఏడుస్తున్న రాజేశ్వరిని ఊహించుకుంటే చెప్పలేనంత సంతోషం కలిగింది. మళ్ళీ ఎందుకో భయం...

"ఏంటి ఆలోచిస్తున్నావ్? ఒకే దెబ్బకి రెండు పిట్టలు. ఒకపక్క నీ డబ్బు ఇబ్బందీ తీరుతుంది. ఇంకోపక్క దానికి తగిన శాస్తి చేశామన్న తృప్తీ కలుగుతుంది. ఇంకేం ఆలోచించకు'' అన్నాడు రాజేష్.

"పట్టుబడితే..." భయంగా అడిగింది.

"ఎట్లా పట్టుబడతావు? ఎవరన్నా చూసినా పెన్నో ఏదో కావలసివచ్చి దాని బ్యాగ్ తీశానని చెప్పు సరిపోతుంది''

లోలోపల భయంగానే ఉంది. అయినా తల ఊపింది. ఇంక తనకి దారులన్నీ మూసుకుపోయాయి. రాజేష్ చెప్పినట్లు చేస్తూ ఉండటం ఒకటే దారి.

చూద్దాం. ఇదెంత దూరంపోతుందో చూద్దాం. ఎంత దూరం పోతుందో అంత దూరం పోనిచ్చేది. పోయేందుకు ఇక తన దగ్గర ఏముంది గనక ఏదో పోతుందని భయపడటానికి.

అదీగాక ప్రియకి లోలోపల థ్రిల్లింగ్‌గానే ఉంది ఈ వ్యవహారం.

జీతాలరోజు రానే వచ్చింది.

మధ్యాహ్నం మూడుగంటలప్పుడు రాజేశ్వరి టాయిలెట్‌కని కాబోలు లేచింది.

సెక్షన్లో ఇంకెవరూ లేరు. జీతాలు తీసుకుని

వెళ్ళిపోయారు.

ప్రియ గబుక్కున లేచింది. రాజేశ్వరి టేబుల్ దగ్గరకు వెళ్లి సొరుగులాగి బ్యాగ్ తెరిచింది.

నోట్లన్నీ దొంతిగా పెట్టింది రాజేశ్వరి.

ఆ నోట్లల్లో చేతికి అందినవి తీసుకుని బ్యాగ్ మూసి వెనుతిరిగింది ప్రియ.

అంతే... కొయ్యబారిపోయింది.

ఆమె చేతిలోని నోట్లన్నీ జారి కిందపడ్డాయి.

అక్కడ...

రాజేశ్వరి నిలబడి ఉంది.

ఎంత ధైర్యంగా ఉందామనుకున్నా ప్రియకి భీతిగానే ఉంది. గుండె గబగబా కొట్టుకుంటోంది. భయంభయంగా రాజేశ్వరి మొహంలోకి చూసింది. రాజేశ్వరి సూటిగా ప్రియనే చూస్తోంది.

చిత్రం...

రాజేశ్వరి కళ్లల్లో అసహ్యంగానీ, కోపంగానీ, ద్వేషంగానీ లేవు.

ఆమె కళ్లల్లో దయ, జాలి... సానుభూతి, కరుణ నిండిన ఆ కళ్లు ప్రియని ఆశ్చర్యపడేట్లు చేశాయి.

ఏం చేయాలనుకుంటోంది రాజేశ్వరి... తనని పోలీసులకి పట్టిస్తుందా...

లేకపోతే పై అధికారులకి రిపోర్ట్ ఇస్తుందా? రాజేశ్వరి ఏం చేస్తుంది?

ప్రియ కదలలేదు... మెదలలేదు.

ఏది జరిగితే అది జరగనీ అనే మొండితనం, తెగింపు ఆమెని శిలలా నిలబెట్టాయి.

రాజేశ్వరివంక నిర్లక్ష్యంగా చూసింది. ఏంచేస్తావ్ అన్నట్లు.

రాజేశ్వరి ముందుకి కదిలింది. ప్రియ చెయ్యి ఆప్యాయంగా పట్టుకుంది.







"ప్రియా... ఏం చెయ్యబోయావ్" లాలనగా అడిగింది.

"దొంగతనం" నదురూ బెదురూ లేకుండా జవాబిచ్చింది ప్రియ.

"ఎందుకని?"

"అవసరం కాబట్టి!"

"ఎవరు చెయ్యమన్నారు?"

"మా ఆయన!"

రాజేశ్వరి చిన్నగా నవ్వింది.

"ప్రియా! నాకు తెలుసు. నువ్విలాంటిదేదో చెయ్యబోతున్నావని తెలుసు. నీకూ పట్టుబడితే కష్టం అని తెలుసు. కానీ ఏంలాభం? నువ్వు ఈ మార్గంలో ఎంతదూరం ప్రయాణించాలో, ఈమార్గం నిన్నే రొంపిలోకి దింపి ఊపిరి ఆడకుండా చేసి చంపేస్తుందో తెలీదు నీకు. అది తెలిస్తే ఎంతమాత్రం దీనికి ఒప్పుకునేదానివి కాదు''

"ఎక్కడెక్కడికి పోనిస్తుంది ఈ మార్గం"

"నేను చెప్పనా? ఇవాళ దొంగతనం చెయ్యమన్నాడు. రేపు వ్యభిచారం కూడా చెయ్యమంటాడు. చేస్తావా?"

ప్రియ జవాబివ్వలేదు.

"ప్రియా... అసలు నీ కథ ఏమిటి? ఎన్నడూ నువ్వు మనసువిప్పి నీ సమస్య ఇదీ అని చెప్పవు. ఒక్కటీ నిజంరాదు నిన్ను పలకరిస్తే అని ఎవరూ నీతో మాట్లాడటంలేదు. ప్రియా! ఆలోచించు. ఎప్పుడూ ఏవో గొప్పలూ, మసిబూసి మారేడుకాయ చెయ్యటం తప్ప నీ అసలు సమస్య నాకు చెప్పావా? ప్రియా నేను సమస్త జనాన్నీ ఉద్ధరించలేకపోవచ్చు. రోజూ ఆఫీసు, ఇల్లు, పిల్లలు తప్ప మరోలోకం లేక సంఘసేవా సమాజ ఉద్ధరణ చెయ్యలేకపోవచ్చు. కానీ చూస్తూ చూస్తూ నా స్నేహితురాలు సుడిగుండంలో ఇరుక్కుపోతుంటే చూస్తూ ఊరుకునేంత జడత్వం నాలోలేదు. చెప్పు... నీ బాధేంటో చెప్పు. తప్పకుండా నాకు తోచిన

సలహా చెపుతాను''

"మధు అట్లాగే అన్నాడు. చెయ్యలేదు. ఆఖరికి మా అమ్మానాన్నా కూడా..." ప్రియ గొంతు జీరబోయింది. వెక్కివెక్కి ఏడ్చింది. ఆ ఏడుపులో ఆమెకి తృప్తి లభించింది.

"లోకం అంటే మీ తల్లితండ్రులూ, మధూ మాత్రమేకాదు. ఇంకా చాలా లోకం ఉంది.'' రాజేశ్వరి ప్రియ కళ్లు తుడుస్తూ అన్నది.

"అంటే నాకు... సాయం చేసేవాళ్లున్నారా?" ఆశగా చూసింది ప్రియ.

"ఉన్నారు... నీ కథ చెపితే నేను తోచిన సలహా చెపుతాను''

"సరే... చెపుతాను'' అని ప్రియ అంతా చెప్పింది.

రాజేశ్వరి విని నిట్టూర్చింది.

"ఇప్పుడు చెప్పు రాజేశ్వరీ! నువ్వు నా పరిస్థితిలో ఉంటే ఏంచేస్తావు? ఆయన నా మొగుడు కాబట్టి నాకు మరో దిక్కులేదు. ఆయన చెప్పినట్లు మంచో చెడో చేస్తూపోతుంటాను''

"అట్లా అనుకోకు ప్రియా! నీకు నేను శుభాదేవిని పరిచయంచేస్తాను. ఆవిడ నీకు తప్పకుండా సాయంచేస్తుంది''

"శుభాదేవా... ఆవిడ ఎవరు?"

"చూపిస్తానుగా'' నవ్వింది రాజేశ్వరి''

"ప్రియా! నువ్వు మొదటినుంచీ రాంగ్‌రూట్‌లో వచ్చావు. ఇది జీవితం. సినిమా కాదు. ఏవేవో సినిమాలు చూసి, అభూత కల్పనల్లాంటి నవలలు చదివి అదంతా మన జీవితంలో జరుగుతుందనుకోవటం అవివేకం. మనిషికి ఆశ ఉండాలి. నిజమే... కానీ దురాశ పనికిరాదు. ఎవరో మనకేదో చెయ్యాలనీ, ఏవో ఇవ్వాలనీ ఆశించటం సరైనపని కాదు. జీవితం అంటే వడ్డించిన విస్తరి కాదు. అన్నీ మనమే తెచ్చుకుని వడ్డించుకోవాలి. సినిమా హీరోలాంటి భర్త దొరకాలనీ, వాడు మనల్ని కార్లలోనూ, విమానాల్లోనూ తిప్పాలనీ అనుకోవటం బొత్తిగా పనికిరాదు. మనిషి వాస్తవం తెలుసుకుని నేలమీద నిలబడితే నడవగలుగుతాడు. ఊహల్లో విహరిస్తూ, ఆకాశానికి ఎగరబోతే కాళ్లిరిగేట్లు కిందపడతారు..."

ప్రియ వింటోంది.

"ఈరోజుల్లో మనుషులు, ముఖ్యంగా మధ్యతరగతివాళ్లు నేర్చుకోవలసింది తమ కాళ్లమీద తాము నిలబడటం. భర్త అయినాసరే అతనిమీద పూర్తిగా ఆధారపడటానికి వీల్లేదు. నీ విషయంలో అంతవరకూ బాగానే జరిగింది. ఒక ఉద్యోగం సంపాదించుకున్నావు. అది నీకు బతుకుతెరువునిచ్చింది. ఉన్నదానితో తృప్తి పడితే బాగుండేది. ఆకాశానికి నిచ్చెన వేశావు. అది నీ పొరపాటు. అంతే అయితే బాగానే ఉండేది. కానీ ఆ నిచ్చెన వేయటంలో ఉచ్చనీచాలు మర్చిపోయి తొందరపడ్డావు. తప్పు చేసింది స్త్రీ, పురుషులు ఇద్దరూ అయినా స్త్రీనే పూర్తిగా బాధ్యత వహించమంటుంది ఈ లోకం. నీ విషయంలో ఇది పూర్తిగా నిజం అయింది. మధు పెళ్లి చేసుకుని హాయిగా ఉంటే, నువ్వు నింద మొత్తం నెత్తిన పడగా పూర్తిగా నష్టపోయావు. ఆ తర్వాత నువ్వు కూడా పెళ్లి సంబంధాలు చూసుకున్నావు. రాజేష్ నీకు తగినవాడు అనుకున్నావు. అతనితో ఉన్నమాట చెప్పి వుండాల్సింది. మూసిపెట్టి చేసిన వ్యవహారంలో మళ్లీ నీకు అన్యాయం జరిగింది. అక్కడితో నువ్వు ఊరుకోలేదు. మళ్లీ మధుతో తిరగటం మొదలుపెట్టావు. అన్నీ అవగా, చివరికి అందరూ తప్పుకోగా నువ్వు నీ భర్తచేతిలో యావజ్జీవ బందీగా, బానిసగా మిగిలావు..."

"అవును'' అంది ప్రియ.

"ఇదంతా నీకు ఎందుకు చెప్తున్నానంటే, మనిషికి ఆత్మపరిశీలన చాలా ముఖ్యం. అది ఉన్నప్పుడే తన పొరపాట్లు తను తెలుసుకుని ఒక ఉత్తమవ్యక్తిగా రూపొందగలుగుతాడు. తననుతాను ఒక మంచి వ్యక్తిగా రూపొందించుకోవటానికి ప్రతివారూ ఆత్మవిమర్శ చేసుకోవాలి. నువ్వు ఆత్మపరిశీలన, ఆత్మవిమర్శ చేసుకునే స్థితిలో లేవు. అందుకని నీ




మనస్తత్వాన్ని బాగా పరిశీలించి నేనే చెప్పా ల్సివస్తోంది''

"నిజమే''

"ప్రియా! నువ్వు కోరుకున్నది ఎట్లాగో ఒకలాగ సాధించితీరాలి అనుకుంటావు. అర్హత ను మించి ఆశిస్తావు. నీ ఆశలు నిన్ను ఒక యుక్తాయుక్త విచక్షణ లేని వ్యక్తిగా మార్చివే శాయి. అవన్నీ అవతలపెట్టు. కానీ జరిగిన ప్రతీ సంఘటనలో నీకు తీరని నష్టం జరి గింది. నీతో భాగస్వాములయినవారికి లాభం కలగగా నువ్వుమాత్రం బాగా నష్టపోయావు. ఏది నష్టపోయినా పర్వాలేదు శీలంమాత్రం పోగొట్టుకోకూడదు''

"ఇప్పుడు కొత్తగా పోగొట్టుకునేదేముంది? ఏనాడో మధు నా శీలం దోచుకున్నాడు''

"అదే పొరపాటు. శీలం అంటే కేవలం శరీరానికి సంబంధించినదే కాదు. మనసుకి సంబంధించినది. నీ మనసు అద్దంలా స్వ చ్ఛంగా ఉండాలి. నీవల్ల ఇతరులకి, సమాజా నికీ మేలు జరగాలి. మేలు జరగకపోతేమానె, కీడుమాత్రం జరగకూడదు. ఒక దొంగగా, పబ్లిక్ న్యూసెన్స్‌గా మిగలటం మంచిదికాదు. నీ ప్రవర్తన ఎవరికీ నష్టం కలిగించకూడదు''

"అవును..."

"నమ్మి సర్వస్వం అర్పించావు. అతను మోసంచేశాడు. ఇక్కడ శీలం పోయింది మధుకి కానీ, నీకు కాదు. నీ భర్త నీచేత తప్పులు చేయిస్తున్నాడు. నువ్వన్నట్లు నీకు వేరే గతిలేక అతను చెప్పినట్లు చేసి వుంటావు. ఇందులో శీలంలేని వ్యక్తి అతనే అవుతాడు కానీ, నువ్వుకాదు. 'ఇంతవరకూ జరిగిందేదో జరిగిపోయింది. ఇకమీదట జరగాల్సింది చూ డు. నీ మనసులోని మాలిన్యాన్ని తుడిచివె య్యి. కొత్త జన్మ ఎత్తు''

"రాజేశ్వరీ... నాకు నువ్వు చెప్పినవన్నీ చెయ్యాలని ఉంది. నన్ను చూస్తే నాకే అస హ్యం వేస్తోంది. అసలు చచ్చిపోవాలని ఉంది''

"ఎందుకూ చచ్చిపోవటం? పొరపాట్లు, తప్పులు చెయ్యటం మానవ సహజం. తప్పు చెయ్యనివాళ్ళెవరూ ఉండరు. చేసిన తప్పుని తెలుసుకుని తమ ప్రవర్తనని దిద్దుకోవటం మనిషి చెయ్యాలి''

"రాజేశ్వరీ... నాకు మనిషిగా బతకాలని ఉంది. కానీ, నాకు ఈ ఉద్యోగం తప్ప గతిలేదు. మా ఆయన నామీద రిపోర్ట్ చేసి, మధుతో కలిసి ఉన్న ఫొటోలు జతపరిచి నన్ను ఒక శీలంలేనిదానిగా నిరూపిస్తాడు. బహుశా నా ఉద్యోగం ఊడిపోవచ్చు''

"ఉద్యోగం పోదు. అంతగా పోతే పోనీ... వేరే ఉద్యోగం దొరక్కపోదు''

"దొరకొచ్చు... కానీ శీలంలేనిదానిగా ము ద్రపొందాక ఎట్లా నా మొహం ప్రజలకి చూ పించగలను''

"ఏం... మధు ఇట్లా ఆలోచిస్తాడా?"

"అతను మగవాడు''

"అయితే ఏం...? మగవాడికో నీతి, ఆడదా నికో నీతినా? శీలం ఇద్దరికీ ఒకటే. బహుశా నీ ఫొటోలు బయటపడి అందరికీ ఈ సంగతి తెలిసిపోతే మధు గర్వంగా కాలర్ ఎగరేసి తిరుగుతాడు. ఒక స్త్రీ తనకి శారీరకంగా లొంగిపోతే మగవాడు అదొక ఘనతగా భావి స్తే, స్త్రీ అది తనకి ఒక మచ్చగా అను కుంటుంది. నీలాంటివాళ్ళు ముందుకి వచ్చి, అవును... అతనితో నాకు ఒకప్పుడు శారీరక సంబంధం ఉండేది. ఏంచేస్తారు? అని అడిగితే అప్పుడేంచేస్తుంది ఈ లోకం...?"

"అంటే...?"

"అవును ప్రియా! నువ్వు ఆ విషయం బయటపడిపోతుందేమోనని అనవసరంగా భయపడకు. అయినా ఇప్పుడు కొత్తగా భయప డాల్సింది ఏముంది? అందరికీ ఈ సంగతి తెలుసు నిజానికి. కానీ ప్రత్యక్షంగా సాక్ష్యాలతో రుజువవుతుందనేసరికి నీకు భయంగా ఉంది. నువ్వు చేసింది పొరపాటు, తప్పు కాదు.

తప్పులకి భయపడాలిగానీ పొరపాట్లకి భయప డకు. నిర్భయంగా ముందుకి రా. అసలు నువ్వింత తెగించి కూర్చుని మాట్లాడితే మీ ఆయన కూడా ఏమీ చెయ్యలేడు''

"నిజమే కానీ... ఏమిటో జంకుగా ఉంది''

"ఎందుకు జంకు? దొంగతనాలు చెయ్యటా నికీ, అక్రమ సంబంధాలు పెట్టుకోవటానికీ నువ్వేమాత్రం జంకు చూపలేదు. తప్పుమా ర్గంలో నడవటానికి నీకు ఏ జంకూలేదు. కానీ మంచి మార్గంలో నడవటానికి భయంగా, జంకుగా ఉందా? నీ భర్త బ్లాక్ మెయిల్‌కి లొంగుతావుగానీ, నేను చెప్పే మంచిమాటలు నిన్ను లొంగదియ్యవా?"

ప్రియ మాట్లాడలేదు.

"ప్రియా! నీ ఇష్టం. నువ్వు చదువకున్నదా నివి. ఉద్యోగం ఉంది. పిల్ల తల్లివి. వయసు కూడా సరిపోయినంత ఉంది. నీకు ఏది మంచో ఏది చెడో ఆలోచించుకునే వివేకం నేను మేల్కొలిపానని అనుకుంటున్నాను. నా మాటలకి లొంగిపోకు. నీకు కావల్సినంత సమయం తీసుకో. ఆలోచించు. బాగా ఆలో చించు. నీకు ఇష్టం వచ్చిన మార్గంలో నడవటా నికి నీకు పూర్తి స్వేచ్ఛ ఉంది. నేను నిన్నేమీ అనను. ఏమీ అడగను. నువ్వు నా అప్పు కూడా తీర్చక్కర్లేదు. నీకు నచ్చిన నిర్ణయం నువ్వు తీసుకో. జరిగిన ఈ సంఘటనా, ఈ మాటలూ అన్నీ మన ఇద్దరిమధ్యే వుంటాయి. ఇంక ఇంటికి వెళతాను'' అన్నది రాజేశ్వరి.

"శుభాదేవి దగ్గరకు తీసుకెళ్తానన్నావు...!"

"ఇప్పుడేకాదు. నువ్వు బాగా ఆలోచించి నీకై నువ్వు ఒక నిర్ణయం తీసుకో. నీకు ఏ సాయం కావాలన్నా అప్పుడే అడుగు''

ప్రియ మౌనంగా ఉండటం చూసి రాజే శ్వరి చిన్నగా నవ్వింది.

"ప్రియా... నువ్వు ఎట్లాంటి వత్తిడులకీ లొంగిపోయి నిర్ణయం తీసుకోవటం నాకు ఇష్టంలేదు. నా మాటల ప్రభావం ఇప్పుడు నీమీద బాగా ఉంటుంది. నేనేం చెప్పినా అది సమంజసంగా ఉంటుంది. కానీ రెండ్రోజులు పోతే నేను చెప్పేది నీకు నచ్చక బాధపడవ చ్చు. అందుకే వారంరోజులు ఆగి చెప్పు''

"రాజేశ్వరీ... నేను వెళ్లేది వక్రమార్గమని నా అంతరాత్మకి తెలుస్తూనేవుంది. కానీ పరిస్థి తుల ప్రభావం నా అంతరాత్మ పీక నొక్కే సింది''

"నాకు అర్థమైంది ప్రియా! అందుకేగా ఇంత శ్రమ తీసుకుని నీకు ఇవన్నీ చెప్పింది. ప్రతీ మనిషిలో మంచీచెడూ రెండూ ఉంటాయి. చెడుని పీకనొక్కి చంపి మంచిని బతికించుకోవాలి''

"నాలో చెడుని చంపేస్తున్నాను. ఇక మంచిని బతికించటానికి నువ్వు సాయంచె య్యాలి. రాజేశ్వరీ... ఇవాళే శుభాదేవి దగ్గ రకు వెళదాం" అంది ప్రియ.

రాజేశ్వరి ప్రియ మొహంలోకి చూసింది. ప్రియ మొహంలో కృతనిశ్చయం కని పిస్తోంది.

ఆ కళ్లల్లో ఎన్నడూ లేని ఏదో మెరుపు. మనిషి తన తప్పులు తెలుసుకుని, ఇంకెప్పు డూ తప్పు చెయ్యనని నిశ్చయించుకుని, మంచిని ఆహ్వానించినప్పుడు ఆ కళ్లల్లో మె రుపు చూడాలే తప్ప వర్ణించటం ఎవరి తరమూకాదు.

జీవితంలో ఏ సౌఖ్యాలూ, భోగాలూ, విలా సాలూ ఇవ్వని, ఇవ్వలేని తృప్తినీ శాంతినీ మనసుకి ప్రసాదించేది మంచితనం... ఆ శాంతినీ, తృప్తినీ నింపుకున్న ఆ కళ్లు నిర్మల తటాకాలు.

రాజేశ్వరి మొహం కూడా సంతృప్తితో వెలిగిపోయింది. ఒక మనిషిని చెడుమా ర్గంనుంచి తప్పించి, మంచిమార్గంలో నడి పించబోయే మనిషి పొందే తృప్తి అనిర్వచ నీయం. రాజేశ్వరి ఆరోజే ప్రియని శుభాదేవి దగ్గరకు తీసుకెళ్లింది.

శుభాదేవి అడ్వకేట్‌గా పనిచేస్తోంది. న్యా యసలహాలు ఇస్తుంటుంది. ఆవిడ 'స్త్రీ సేవా





సమితి' అనే సంస్థను నడుపుతోంది. ఎక్కడ ఏ స్త్రీకి అన్యాయం జరిగినా వీళ్లతో చెప్పు కుంటే కావలసిన సాయం చేస్తారు.

ప్రియ ఆవిడకి దాచకుండా అంతా చెప్పే సింది.

శుభాదేవి అంతా శాంతంగా విన్నది.

ప్రియ శుభాదేవివైపే చూస్తోంది. ప్రియతో పాటు రాజేశ్వరికి కూడా ఆసక్తిగానే ఉంది. శుభాదేవి ఏం చెప్తుందా అని.

శుభాదేవి కొంచెంసేపు ఆలోచించింది. "ప్రియా... పూర్తిగా నిర్ణయించుకున్నావుగా. అతనితో కాపరం చెయ్యటం నీవల్ల కాదు. అంతేగా'' అంది.

"అంతేనండీ. అతను నన్ను అన్నివిధాలా నాశనం చేశాడు. అసలే పతనమై ఉన్న నన్ను పూర్తిగా నాశనం చేశాడు. దొంగతనాలు చెయ్యమని కూడా పురికొల్పాడంటే... రాజేశ్వరి అన్నట్లు ముందు ముందు ఇంకా ఏం చేస్తాడో నని భయంగా ఉంది. అతను ఉత్త జులాయి మనిషి. అతనితో ఇంకా కాపరం చేస్తే నేను నాశనం కావటం తప్ప మరొకటి ఉండదు. నేను మంచిగా బతకాలనుకుంటున్నాను. ఇంతవరకూ బతికిన పాడుబతుకు చాలు. ఇకనుంచీ మంచిగా ఉండాలి. అంతేకాదు. నాకు వీలైనంతలో ఒకళ్ళకి ఉపకారం చేద్దామని ఉంది. అతనితో ఉంటే నన్ను పచ్చి దొంగగా, జూదరిగా, దుర్మార్గురాలిగా తయారుచేస్తాడు. ఇది కేవలం భర్తమీద పోరాటమే కాదు. చెడుమీద మంచి జరిపే పోరాటంగా నేను భావిస్తున్నాను. మీరు నాకు సాయం చెయ్యాలి. అతనితో కాపరం నేను చెయ్యను. చెయ్యలేను'' అంది.

"అతను నీకూ మధుకీ చూపించి బెదిరించిన ఫొటోలు ఏవి?"

"తీసుకురాలేదు. మీరు తెమ్మంటే ఇవాళ వెతికి, వీలుంటే రేపు తెస్తాను''

"తీసుకునిరా. వాటితో చాలా పనుంది'' అంది ఆవిడ.

"ఇప్పుడేం చేస్తే బాగుంటుంది?" రాజేశ్వరి అడిగింది.

"నాకు వీలైనంత సాయం చేస్తాను. ఈ అమ్మాయి తన కూతురితో కూడా ఉండేందుకు బస ఏర్పాటు చేస్తాను. ప్రియా... నువ్వేం భయపడకు. నీకు నేనున్నాను'' అంది శుభాదేవి.

ప్రియకి గుండె తేలిగ్గా అయింది.

"ప్రియా... అన్నిటికీ ఆ ఫొటోలు చాలా అవసరం. వాటిని ఎట్లా అయినా సంపాదించి నాకిస్తే నేను సాయం చెయ్యగలను'' అంది ఆవిడ.

"ఇస్తాను... నాకు వీలైనంత ప్రయత్నించి తెస్తాను. కానీ వాటిని భద్రంగా ఎక్కడ దాచాడో? అయినా తప్పకుండా ప్రయత్నించి తెస్తాను. రేపు పొద్దున్నే రావచ్చా?" అంది ప్రియ.

"రా..." అంది ఆవిడ.

రాజేశ్వరికీ, ఆవిడకీ కృతజ్ఞతలు తెలిపి ఇంటికి తిరిగివచ్చింది ప్రియ.

రాజేష్ ఇంట్లోనే ఉన్నాడు.

"ఏంటి ఇంత ఆలస్యం? చెప్పినపని పూర్తయిందా?" అన్నాడు రాజేష్.

"కాలేదు''

"ఎందుకు కాలేదు. అది రాలేదా?" కోపంగా అడిగాడు.

"ఆవిడ వచ్చింది. నేనే మనసు మార్చుకున్నాను''

రాజేష్ చెయ్యిఎత్తి ప్రియని చెంపమీద కొట్టబోయాడు. ప్రియ కోపంగా ఆ చెయ్యి మధ్యలోనే ఆపేసింది.

రాజేష్ ఏమనుకున్నాడో ఏమో బయటకి వెళ్ళిపోయాడు.

ప్రియ వెంటనే అతనిపెట్టె వెతికింది.

అడుగున కవర్లో దొరికాయి ఆ ఫొటోలు. ఆ కవరు తీసుకుని తన బ్యాగ్‌లోపల భద్రపరచుకుంది.

రాజేష్ అరగంటలో తిరిగివచ్చాడు.

"ఏంటి? ఎంత వచ్చింది బోనస్ జీతం కలిపి?" అన్నాడు.

"ఎంతో వచ్చింది. లెఖ్ఖ కూడా చూడలేదు" ప్రియ అంది.

"ఎందుకు చూడలేదే? అంత ఎక్కువయిందా డబ్బు?" అరిచాడు రాజేష్.

ప్రియ గబగబా పిల్లను ఎత్తుకుంది.

ఒక్క పరుగులో వీధిలోకి వచ్చింది.

ఆటో కనిపిస్తే గబుక్కున అందులోకి ఎక్కి శుభాదేవి ఇంటికి పోనివ్వమంది.

వెనకాలే రాజేష్ పరుగెత్తుతూ రావటం కనిపించింది.

ఎంతోసేపు పరుగెత్తలేదు. ఇంటికి వెళ్ళిపోతాడు వెనక్కి అనుకుంది ప్రియ.

అట్లాగే అతను వెనక్కి వెనక్కి వెళ్ళిపోయాడు.

అతను ధైర్యంగా ఎందుకు వెళ్ళిపోయాడో, ఎందుకు వెంబడించలేదో ప్రియకి తెలుసు.

ఎందుకంటే అతనికి బాగా తెలుసు. ఏది వదిలిపోయినా తను ఉద్యోగం మాత్రం వదిలిపోదని. రేప్పొద్దున్నకల్లా ఆఫీసుకి వస్తుందని తెలుసు కాబట్టి, అక్కడే ఏ సంగతీ తేల్చుకోవచ్చు అనుకుని ఉంటాడు.

ప్రియ శుభాదేవి ఇంటికి చేరింది.

శుభాదేవి ప్రియను చూసి ఆశ్చర్యపోలేదు.

"రా..." అని ఆప్యాయంగా ఆహ్వానించింది. ప్రియ లోపలకి వెళ్ళింది.

ఆమె హృదయం అప్పటికి తేలికపడింది.

"ప్రియా... ఫొటోలు దొరికాయా?" అంది శుభాదేవి.

"దొరికాయి" ప్రియ ఆ ఫొటోలున్న కవరు శుభాదేవి చేతికందించింది.

"ఈ పాప మీ కూతురా... బాగుంది ముద్దుగా" పాప బుగ్గ సుతారంగా తడిమింది శుభాదేవి.

ప్రియ కుర్చీలో కూర్చుని సీలింగ్‌వైపు చూస్తోంది.

శుభాదేవి ఆ ఫొటోల్ని పరిశీలిస్తోంది.

"ప్రియా... ఇవి ఎక్కడ తీయబడ్డాయో చెప్పగలవా?" అంది.

ప్రియ ఆ ఫొటోల్ని చూసింది. వాటిలో ఒక గది స్పష్టంగా కనిపిస్తోంది. గదిలో ఒకమూల ఉన్న దీపస్తంభం ఆ దీపస్తంభం చక్కటి పనితనంతో ఫొటోలో కూడా చాలా అందంగా మెరుస్తోంది. దాన్ని ఒకసారి చూస్తే మర్చిపోవటం కష్టం అనిపిస్తోంది. దాన్ని తను ఎక్కడా చూసిన గుర్తురాలేదు ప్రియకి... ఆ గది కూడా తనకి అపరిచితంగా కనిపించింది.

"ఈ గది ఎక్కడా చూసినట్లులేదు" అంది.

"బాగా చూడు. ఇంకో సంగతి కూడా చూడు. నీ శరీరం ఇట్లాగే ఉంటుందా?" అంది ఆవిడ.

ప్రియ ఆ ఫొటోని అప్పుడు పరీక్షగా చూసింది. ఊహూ, కాదు. ఈ శరీరం తనది కాదు. తనకంత పర్సనాల్టీ లేదు. కానీ మొహం మాత్రం తనదే. సందేహం లేదు.

"ఈ మొహం నాదే మేడమ్. కానీ శరీరం చూస్తే నాది కాదు అనిపిస్తోంది" అంది.

శుభాదేవి తల ఊపింది.

"ప్రియా... నాకు అప్పుడే అనుమానం వచ్చింది. ఇవి నకిలీ ఫొటోలు. వీటిని పెట్టి నీ భర్త నిన్ను అనవసరంగా బెదిరిస్తున్నాడు. ఎవర్నో ఫొటోగ్రాఫర్‌ని పట్టుకుని ట్రిక్ ఫొటోగ్రఫీతో ఇట్లా ఒకరి మొహం ఇంకోరి శరీరం కలిపి ఏదో ట్రిక్ ప్లే చేశాడు. ఇవి పట్టుకుని అతను ఏం చెయ్యలేడు. నువ్వేం భయపడకు" అంది శుభాదేవి.

ప్రియ నిర్ఘాంతపోయింది.

అంటే, గుమ్మడికాయల దొంగంటే భుజాలు తడుముకున్నట్లు... తను తప్పు చేసింది కాబట్టి ఆ అపరాధభావం తనని న్యూనతాభావనలోకి నెట్టి ఆ ఫొటోలు నిజమేనేమో అని




నమ్మేట్లు చేసింది. అందుకే గుడ్డిగా నమ్మి భయపడి బెదిరిపోయి అతను ఆడించినట్లు చేసింది.

"ఛీ... ఎంత దుర్మార్గుడు...? ఎంత అమానుషంగా ప్రవర్తించాడు. భర్త అయి ఉండి కూడా ఎట్లా బ్లాక్‌మెయిల్ చేద్దామని చూశాడు'' అంది.

శుభాదేవి చిరునవ్వు నవ్వింది.

"ఇదేనా... ఇంతకన్నా చాలా ఘోరంగా ప్రవర్తించిన వాళ్లున్నారు. కావాలని తప్పులు చేయించి, ఆ తప్పుని బయటపెడతానని బెదిరించి, బ్లాక్‌మెయిల్ చేస్తూ, భార్యచేత అవే తప్పులు మళ్ళీ మళ్ళీ చేయించి డబ్బులు గడిస్తున్న వాళ్ళెందరినో చూశాను. భర్త అయినంతమాత్రాన ఆ మనిషి చెప్పింది ఎంత ఘోరమైన పనయినా చేసితీరాలని చాలా మంది అనుకుంటారు. చివరికి తాడే పామయినట్లు భర్తే దెయ్యంలా మారి బతుకు ఘోరం చేస్తుంటాడు. నేను అందుకే ఆడవాళ్లందరికీ చెప్తుంటాను. మనం మంచిగా ఉండవలసింది భర్తకోసం కాదు. మనకోసం మనం మంచిగా ఉండాలి. అంతే''

ప్రియ తల ఊపింది. ప్రియకి తెలిసినవాళ్ళలోనే ఇట్లాంటి కేసు ఒకటి ఉంది. భర్త భార్యని ఫోర్జరీ చెయ్యమన్నాడు. ఆవిడ సంతోషంగా చేసింది. దానిమీద కేసు నడిచి చివరికి భార్యమీదే నేరం అంతా పడింది. భర్త హాయిగా తిరుగుతుంటే భార్య అనుభవిస్తోంది. మా ఆయన చెయ్యమన్నాడూ చేశానంటే ఎవరు నమ్ముతారు? నిజానికి నమ్ముతారు. ఈ కాలంలోగానీ, ఏకాలంలోగాని భార్యకి భర్త తప్ప దిక్కులేదు. నిజానికి వాడెంత దుర్మార్గుడైనా, ఎంత దుష్టుడైనా వాడు చెప్పినట్లు చేసితీరాల్సిందే. లేకపోతే చంపుతామని బెదిరించే భర్తలు కూడా ఉన్నారు. సంసారాలు వదులుకోలేక భర్తని కాదనలేక తప్పనిసరిగా తప్పులు చేస్తే ఆ బాధ్యత చివరికి ఎవరిది?

దేవుడి దయవల్ల తను తొందరగానే రాజేష్ ఇనపహస్తాల్లోంచి బయటపడింది.

"ప్రియా... నీకు సుభద్రగారింట్లో ఆశ్రయం కల్పిస్తాను. మేమంతా నీకు తోడు ఉన్నాం. ఏం భయపడకు. మా ఇంట్లో భోజనం చెయ్యి ఇప్పుడు. నేను సుభద్రకి ఫోన్‌చేసి మాట్లాడి నువ్వు వస్తున్న సంగతి చెప్తాను. భోజనం చేసి అక్కడికి వెళదాం" అంది శుభాదేవి.

పాపకీ, ప్రియకీ అన్నం వండమని లోపల చెప్పివచ్చింది. తను కూడా వాళ్ళతోనే కూర్చుని భోంచేసింది.

తర్వాత సుభద్ర ఇంటికి వెళ్ళారు.

సుభద్రకి పిల్లలు లేరు. పిల్లలు లేరని బాధపడకుండా, బాధల్లో ఉన్నవాళ్లంతా తన పిల్లలే అంటుందిట.

పెద్ద ఇల్లు. ఇంట్లో కిందభాగంలో ఆవిడా, భర్తా ఉంటారు. పైన మేడమీద మూడు గదులున్నాయి. అక్కడ ప్రియలాగా ఏ దిక్కులేని వాళ్ళకి ఆశ్రయం ఇస్తుంటుందిట. వాళ్ళందరికీ భోజనం కూడా తనే పెడుతుంది. ప్రియకి ఉద్యోగం ఉంది కాబట్టి పేయింగ్ గెస్ట్‌లాగా ఉండవచ్చని చెప్పారు. వాళ్లల్లో ఉద్యోగం లేనివాళ్లు కొందరున్నారు. ప్రియ పాపని మధ్యాహ్నం చూసుకుంటామని వాళ్లు మాట ఇచ్చారు.

అందరూ ఆప్యాయంగా, ప్రేమగా మాట్లాడారు. ప్రియకి చాలా ధైర్యంగా, హాయిగా ఉంది.

మర్నాడు పొద్దున్న శుభాదేవి ఇంటికి వెళ్ళింది. శుభాదేవి ఇంట్లో, ప్రియ కోసమే వెయిట్ చేస్తోంది.

నువ్వు ఏం భయపడకు ప్రియా. అంతా నీకు ఫేవర్‌బుల్‌గా ఉంటుంది. ఆ ఫొటోలు ఒరిజినల్‌వి కావు. ట్రిక్స్ ఉపయోగించి నీ ఫొటోలా భ్రమ కలిగేట్లు చేశారు. నువ్వు నిశ్చింతగా ఉండు. ఇట్లా చేశాడు కాబట్టి అతనిమీద మనమే కేస్ పెట్టవచ్చు. నువ్వు విడాకులు కావాలని అడిగితే అతను ఇవ్వడు. ఇచ్చినా రోజూ వచ్చి నిన్ను ఏడిపించి బతుకు దుర్భరం చేస్తాడు. అంతకన్నా అతనితోనే

ఉండి అతను చెప్పినట్లే వినటం నయం అనిపించేట్లు చేస్తాడు. అందుకని ఒకటే దారి. అతను కుక్కలాంటి మనిషి. చెప్పు తీసుకుని ఒక్కటి కొడితే తప్ప పోడు. అతనికి మంచి బుద్ధి చెప్పాలి. లేకుంటే అతన్ని చూసి ఇంకొంతమంది పేట్రేగుతారు'' అంది శుభాదేవి.

"అవును'' అంది ప్రియ.

"ఇవాళ ఆఫీసుకి వెళ్తున్నావా?" అడిగింది ఆవిడ.

"వెళ్తున్నాను. కానీ భయంగానే ఉంది. అతను వచ్చి ఏం గొడవ చేస్తాడోనని'' అంది ప్రియ.

భయపడకు. ధైర్యంగా వెళ్లు. అతను వచ్చి గొడవ చెయ్యటమే మనకి కావాలి'' శుభాదేవి ప్రియకి ఏమేం చెయ్యాలో చెప్పింది.

ప్రియ తల ఊపింది.

ప్రియ ఆఫీసుకి వచ్చి పనిచేసుకుంటుంటే రాజేష్ విసురుగా వచ్చాడు.

"ఏమే... రాత్రి ఎక్కడికి పోయావ్? సిగ్గూ శరం లేకుండా ఎక్కడెక్కడో తిరిగి వస్తుంటే నేనెట్లా భరించాలి'' అన్నాడు.

"అవతలికి రా. మాట్లాడుకుందాం" ప్రియ బ్యాగ్ తీసుకుని బయటికి నడిచింది.

ప్రియని అనుసరించాడు రాజేష్.

ఇద్దరూ ఆఫీసులో ఉన్న గార్డెన్‌లోకి వచ్చారు.

"ఏంటో చెప్పు'' అన్నాడు రాజేష్.

"ఎందుకు నన్నిలా తప్పుడు పనులు చెయ్యమంటావ్. నాకు నీతిగా, ధర్మంగా బతకాలనుంది. అప్పులు చేసి నీ జల్సాలకి డబ్బంతా తగలేస్తున్నావ్. అదేమంటే చచ్చేట్లు కొడుతున్నావ్. ఇది నీకు న్యాయం కాదు'' అంది ప్రియ.

"ఏమిటే నీతులు మాట్లాడుతున్నావ్?" అన్నాడు రాజేష్.

"నీతులు కాదు. మనిషన్నాక పనిచెయ్యాలి. కష్టపడి బతకాలి. ఎన్నాళ్లు ఇట్లా సోమరిగా బతుకుతావు. పోనీ నేనే నిన్ను పోషిద్దామనుకుంటే ఇట్లాగ చెడ్డపనులు చెయ్యమంటున్నావు. అవి చెయ్యటం నా వల్ల కాదు'' అంది ప్రియ.

"ఏమిటే చెడ్డపని. దొంగతనం చెయ్యటం ఒక తప్పా? నువ్వు రంకుతనం కూడా చేశావు. దానికన్నా చెడ్డదా ఇది?" అన్నాడు రాజేష్.

"అబద్ధం. నేనేం చెయ్యలేదు'' అంది ప్రియ.

"ఏది అబద్ధం? ఇదుగో... నీవు చేసినదానికి సాక్ష్యంగా నా దగ్గర ఫోటోలు కూడా ఉన్నాయని మర్చిపోకు. ఏమన్నా ఎదురు తిరుగుదామని చూస్తే చంపేస్తాను జాగ్రత్త. ఏమనుకుంటున్నావో?"

"ఆ ఫోటోలన్నీ అబద్ధం" అంది ప్రియ.

"ఏమిటసలు నీ సంగతి? ప్రతిరోజూ పారిపోతుంటే రోజూ నిన్ను పట్టుకుని రావటం నావల్ల కాదు. ఈసారి ఇల్లువిడిచి వెళ్ళావంటే తోలు వలిచేస్తాను. నోర్మూసుకుని పద" కఠినంగా అన్నాడు రాజేష్.

"నేను రాను''

"రాకుండా ఉండటానికి వీల్లేదు. అమ్మా... నువ్వు కాస్తా చేజారిపోతే నాకింక ఏది దిక్కు? బంగారంలాంటి ఉద్యోగం ఉన్న పెళ్ళానివి. నిన్ను వదులుకునేంత వెధవని కాను'' అన్నాడు రాజేష్.

ప్రియ సంతృప్తిగా నవ్వుకుంది.

"సరే... సాయంత్రం శుభాదేవి దగ్గరకు రా..." అంది.

"ఆవిడెవరు?"

"ఫ్లీడర్' ప్రియ మెల్లగా అంది.

"నేను రాను. నేనెందుకు రావాలి? నువ్వే నా కాళ్ళు పట్టుకుని రావాలి'' మొండిగా అన్నాడు రాజేష్.





"రేపు చెప్తాను ఏ సంగతీ'' అంది ప్రియ.

"ఏమిటసలు నీ ధైర్యం?" రాజేష్ చిరాగ్గా వచ్చి ప్రియని కొట్టబోయి ఎందుకో ఆగిపోయాడు.

ఆఫీసులో గొడవ పెట్టుకోవడం అతనికి మామూలే. అయినా ఇవాళ ఎందుకో భయం అనిపించింది. అతను ఆగిపోవటం చూసి ప్రియకి సంతోషంగా అనిపించింది. అంతా శుభాదేవి చెప్పినట్లే జరుగుతోంది.

"ఏమిటంటావ్ అయితే...?" అన్నాడు రాజేష్.

"చెప్పానుగా. అడ్రసు ఇచ్చాను. ఆవిడ ఇంటికి వస్తేరా. లేకుంటే పో. ఏమన్నా వెధవవేషాలు వెయ్యాలని చూస్తే తగిన బుద్ధి చెపుతాను'' ప్రియ లోపలకి నడిచింది.

ఆఫీసులో కూడా శుభాదేవి నియమించిన వ్యక్తులు కొందరు తిరుగుతున్నారు. రాజేష్ ఒకవేళ దౌర్జన్యంగా వ్యవహరిస్తే ఆపటానికీ, అతను దౌర్జన్యం చేస్తున్నట్లు సాక్ష్యాలుగా నిలపటానికీ శుభాదేవి వాళ్ళనక్కడ ఉంచింది.

రాజేష్ లోపలకు రాలేదు.

ఒకసారి చూసి వెళ్ళిపోయాడు.



**రా**జేష్ నేరుగా మహేంద్ర దగ్గరకి వెళ్లాడు. ఫొటోల ఐడియా మహేంద్రదే.

మహేంద్ర ఫ్రెండ్ ఒకతనికి ఫొటో స్టూడియో ఉంది. ప్రియవీ, మధువీ మామూలు ఫొటోలు అతనికి యిచ్చి వాటిని అసభ్యకరమైన భంగిమలో ఉన్నట్లుగా తీయమని చెప్పాడు మహేంద్ర. ముందు అతను ఒప్పుకోకపోయినా, చివరికి సరేనన్నాడు. మొహాలకి యింకెవరివో శరీరాలు అతికి నానా కష్టాలూ పడి చివరికి ఈ ఫొటోలు తయారుచేశాడు.

యిన్నాళ్లూ ప్రియని బెదిరిస్తూ వచ్చాడు ఆ ఫొటోల సాయంతో. అదీగాక తనన్నా తన ఫ్రెండ్స్ అన్నా ప్రియ వణికి చచ్చేది. ఇప్పుడింత ధైర్యంగా ఉందంటే ఏమిటి కారణం? ఆ శుభాదేవి ఎవరసలు.

మహేంద్ర యింట్లోనే ఉన్నాడు. జరిగినదంతా చెప్పి ప్రియ యిచ్చిన శుభాదేవి విజిటింగ్ కార్డు మహేంద్ర చేతిలో పెట్టాడు రాజేష్.

అది చూడగానే మహేంద్ర ఉలిక్కిపడ్డాడు.

"రాజేష్ ఈవిడ రాక్షసి ఘటం. ఆవిడంటేనే అందరికీ భయం. ఆవులిస్తే పేగులు లెక్కపెడుతుంది. అసలీపాటికి అవన్నీ నకిలీవని కనిపెట్టేసి ఉంటుంది. మన కొంప మునిగినట్లే'' అన్నాడు మహేంద్ర.

"కనిపెడితే ఏం"

"ఏం అని అంత తేలిగ్గా అనుకోకు. కనిపెట్టేసిందంటే నీమీద కేస్ బనాయిస్తుంది. అనవసరంగా వేధించి భయపెడుతున్నావని గొడవ చేస్తుంది. ఎందుకొచ్చిందిగానీ, నాలుగు రోజులు మాట్లాడకుండా ఊరుకో. మీ ఆవిడే రాజీకి వస్తుంది'' అన్నాడు మహేంద్ర.

"రాకపోతే''

"చచ్చిన వాడి పెళ్లికి వచ్చిందే కట్నం. యిన్నాళ్లూ మీ ఆవిడ సంపాదిస్తుంటే హాయిగా తిని కూర్చున్నావుగా. అదే దక్కుదల. నోరు మూసుకోవటం తప్ప మనకి వేరే కర్తవ్యం లేదు''

"నువ్వేం చెయ్యలేవా. మొన్న మా మా

మని బెదిరించినట్లు బెదిరించి యింటికి తీసుకురాలేమా''

"మీ మామ ఒక పిరికిగొడ్డు. శుభాదేవి ఒక చిచ్చరపిడుగు. యిద్దరూ ఒకటే అన్నట్లు అడగడంలోనే నీ తెలివి బయటపడుతోంది''

"మరి నా పని ఎట్లా. తెల్లారితే యింటద్దె కట్టాలి. పాలవాడికి డబ్బు యివ్వాలి. డబ్బులేనిది ఒక్కపనీ జరగదు. ఆవిడ రాకుంటే నాకేది దారి''

"నీ మొహంలా ఉంది. ఆవిడ లేనిది నీ బతుకే లేనప్పుడు నోరు మూసుకుని ఆవిడ చెప్పినట్లు వింటే పోయేది. కనీసం ప్రేమగా చూస్తే ఆవిడ యిట్లా ఎందుకు చేసేది. నువ్వు భార్యేగదా ఆడముండ ఎక్కడికి పోతుందిలే అన్న ధైర్యంతో బానిసని చూసినట్లు చూస్తుంటే ఈ రోజుల్లో ఎవరూ సహించరు. నాలుగు తన్ని మరీ పోతారు. మామూలు మనుషులకే యివన్నీ తెలుసు. యింక పూర్తిగా ఆవిడమీదే ఆధారపడ్డ నువ్వు యింకెంత ప్రేమగా చూడాల్సింది. నీ తెలివి తక్కువవల్లే యిదంతా జరుగుతోంది''

"నువ్వేనా యిట్లా మాట్లాడుతోంది''

"ఆ నేనే... నీ తెలివి తక్కువతో ఏవేవో చేసుకుని ఏడుస్తూ వస్తే ఎన్నాళ్లని సాయం చేయాలి. మొన్న మీ మామ యింటికి వచ్చిన మనుషులకి నువ్వు పైసా యివ్వలేదు. ఊరికే రమ్మంటే ఎవరూ రారు. అంతేకాదు ఏ గొడవలకయినా రౌడీలు వస్తారుగానీ భార్యాభర్తల గొడవల మధ్యకి రావాలంటే వాళ్లకీ అసహ్యంగానే ఉంటుంది'' అన్నాడు మహేంద్ర.

అతను తనకి సాయం చెయ్యటం యిష్టంలేకనే యిట్లా మాట్లాడుతున్నాడని గ్రహించాడు రాజేష్.

రాజేష్‌కి యింకేం చెయ్యాలో అర్థం కాలేదు. వెనక్కి తిరిగి వచ్చాడు.

ప్రియతో రాజీ చేసుకోవటం ఒకటే మార్గం. యింక తనకి ఏ గతీ లేదని అతనికి అర్థం అవసాగింది.

తన బతుకుకి పూర్తి ఆధారం ప్రియ. ఆ విషయం తనకి స్పష్టంగా తెలుసు ముందు నుంచీ. అయినా ఎందుకు ప్రియని అట్లా పీడించాడు.

బంగారు గుడ్లు పెట్టే బాతుని చేజేతులా చంపుకున్నట్లు అయిందికదా!

యిపుడేదీ దారి?

ఏం చెయ్యాలి?

సుధీర్‌నీ యింకో యిద్దరినీ కూడా అడిగి చూశాడు.

ఎవరూ అతనికి సాయం చేసేందుకు ఒప్పుకోలేదు. శుభాదేవి టేకప్ చేశాక కేస్‌ని ఎవరూ ఏమీ చెయ్యలేరని చెప్పేశారు.

యింటికి తిరిగి వచ్చాడు. ఏం చేయాలో అర్థం కావటం లేదు.

యింటాయనకి ఖాళీ చేస్తున్నట్లు చెప్పాడు. అద్దె అడ్వాన్సు అతని దగ్గర ఉంది కాబట్టి అడ్జస్ట్ చేసుకోమని చెప్పాడు.

ఇంట్లో సామాను అమ్మేసి డబ్బు చేసుకుందామనుకున్నాడు. కానీ ప్రియ శుభాదేవిని అడిగి, యిద్దరు మనుషుల్ని తోడు తెచ్చుకుని, తన బట్టలూ యితర సామానూ తీసుకుని వెళ్లిపోయింది.

అది మాత్రం రాజేష్ సహించలేకపోయాడు.

తన సామ్రాజ్యం మొత్తం కూలిపోయినప్పుడు ఆఖరి ప్రయత్నం చేస్తున్న రాజులా ఉంది అతని పరిస్థితి.

ఏమైతే అయిందని ప్రియ ఉంటున్న ఇంటికి వెళ్దామనీ, నాలుగు తన్ని తీసుకువద్దామనీ అనుకుని వెళ్లాడు.

సుభద్ర అతన్ని గేటులోపలకి కూడా రానివ్వలేదు.

"ఏం మాట్లాడాలన్నా శుభాదేవి యింటికొచ్చి మాట్లాడు'' అని తరిమేసింది.

ఇంక లాభం లేదు... నిండా మునిగాక





ఆలోచించేదేముంది అనుకుని శుభాదేవి యింటికి వెళ్లాడు.

శుభాదేవి అతడ్ని నిలబెట్టే మాట్లాడింది.

"ఏమిటీ'' అంది చిరాగ్గా చూస్తూ.

"నేను ప్రియ భర్తని'' అన్నాడు.

"ఏం కావాలి'' అందావిడ.

"ప్రియ నన్ను వదిలిపెట్టి వెళ్లిపోయింది. నేనేం చేయాలి చెప్పండి'' అన్నాడు.

"బాగుందయ్యా... డబ్బంతా లాక్కుని తన్ని తగలేస్తుంటే ఎవరు మాత్రం ఉంటారు'' అంది శుభాదేవి.

'అబద్ధం... ప్రియ కారెక్టర్ మంచిది కాదని తెలిసి కూడా నేను కాపరం చేశాను. నా పెళ్లాం ఎంత తప్పుడు ప్రవర్తన కలదైనా పోన్లెమ్మని సహృదయంతో సర్దుకుపోయి క్షమించాను. ఇంతకన్నా ఎవరేం చేస్తారు'' అన్నాడు రాజేష్.

"అట్లాగా'' అంది శుభాదేవి. సొరుగు తెరిచింది. టేప్ రికార్డర్‌లో ఒక కాసెట్ పెట్టి ఆన్ చేసింది.

ప్రియనీ ఆరోజు ఆఫీసు గార్డెన్‌లో బెదిరిస్తూ చేసిన సంభాషణ అంతా ఆ కాసెట్‌లోంచి వినిపిస్తోంది.

రాజేష్‌కి చెమటలు పట్టాయి.

శుభాదేవి తనని ఉచ్చులో బిగించిందన్న మాట.

శుభాదేవి రాజేష్ వంక చూసింది.

"ఏమయ్యా... యిది చాలదూ నీ భార్యని నువ్వెంత క్షోభ పెట్టావో తెలియటానికి. సిగ్గులేదూ నీకు. పెళ్లి చేసుకున్నది ఎందుకు. పైగా దొంగ ఫోటోలు సృష్టించి బ్లాక్‌మెయిల్ చేస్తావా? ఇదంతా బయటపడితే నీకెంత శిక్ష పడుతుందో తెలుసా?" అంది.

రాజేష్ తల వంచుకున్నాడు.

"కానీ ప్రియకి నిజంగానే మధుతో సంబంధం ఉంది'' అన్నాడు.

"అది ఒకప్పటి సంగతి. అది తెలిశాక కూడా నువ్వు మామూలుగానే కాపరం చేశావు. నీ స్వార్థం కోసం ఆ విషయాన్ని ఆసరా చేసుకుని ఆమెని ఒక ఆటబొమ్మలా ఆడించావు. యిప్పుడు నీ ఆటలు ఇంక సాగవని తెలుసుకుని పిల్లిలా మాట్లాడుతున్నావు'' అంది శుభాదేవి.

"నేను పూర్తిగా ఆమె సంపాదనమీదే ఆధారపడి బతుకుతున్నాను. ఆవిడ నన్ను వదిలి వెళ్లిపోతే నాకేది దారి''

"సిగ్గులేదూ ఆ మాట అనటానికి. నీకు కాళ్లూ చేతులూ లేవూ? భగవంతుడిచ్చిన దుక్కలాంటి శరీరం లేదూ! పోయి కూలీ చేసుకుని బతుకు. కష్టార్జితం అంటే ఏమిటో తెలుసుకో. డబ్బు విలువ నీకు అప్పుడు కానీ తెలీదు'' అంది ఆవిడ.

"కూలీ మాత్రం ఎవరిస్తారు. ప్రియని ఎట్లాగైనా ఒప్పించండి. ఈసారినుంచీ బుద్ధిగా ఉంటాను''

"నువ్వు ఉండలేవు. ఒక్క నిమిషం బుద్ధిగా ఉందామనుకున్నా మరుక్షణమే నీ బుద్ధి కుక్కతోకలా వంకరగా మారుతుంది. పోయి నువ్వేమిటో తెలుసుకో. నువ్వు మంచివాడివని నిరూపించుకో. అప్పుడేవచ్చి మాట్లాడు. వెళ్లు... యింకో సంగతి గుర్తుంచుకో... ప్రియ వెంట మేమంతా ఉన్నాం అని మర్చిపోకు. ఒకవేళ ఆమెనేమన్నా రోడ్డుమీదో, ఆఫీసులోనో బెదిరిద్దామనో, యింకేమన్నా చేద్దామనో ప్లాన్ వేస్తావేమోనని చెపుతున్నాను. ప్రియకి ఏ అపకారం జరిగినా నీ అంతు చూస్తాము. వెళ్లి బుద్ధిగా బతుకు'' ఆవిడ ఖండితంగా చెప్పింది.

"ఎక్కడికి పోను. పదో క్లాసు కూడా పాస్ కాని నాకు ఎవరు ఉద్యోగం ఇస్తారు''

"ఉద్యోగమంటే ఫాన్‌కింద కూర్చుని చెయ్యటమే కాదయ్యా! హోటల్లో కప్పులు కడుగు. లేకపోతే బూట్లు పాలిష్ చెయ్యటం నేర్చుకుని చెయ్యి. ఏది చేశాం అన్నది కాదు ఎంత బాగా చేశాం, ఎంత నీతిగా బతికాం

అన్నది ముఖ్యం. కష్టపడి, చెమటోడ్చి సంపాదించే ప్రతి పైసాలో దైవం ఉంటాడు. పోయిరా... పోయి మనిషివయ్యాక తిరిగిరా. బతుకంటే ఎవరో ఒకరి నెత్తినెక్కి అధికారం చెలాయించటం కాదు. ఎవరి కాళ్లమీద వాళ్లు నిలబడటం. ఇదుగో ఈ కుర్చీ చూడు. దీనివైర్లు అల్లింది గుడ్డివాళ్లు. అంధత్వం ఉన్న వాళ్లు ఈ పని నేర్చుకుని ఎంతో చక్కగా చేస్తున్నారు. అట్లాంటిది కళ్లూ కాళ్లూ శుభ్రంగా ఉన్న మనిషివి. నీకు పనే దొరకదా చెయ్యటానికి'' అన్నదావిడ.

"దొరకకపోతే''

"అప్పుడు నా దగ్గరకి రా! నేను ఏదో ఒకటి చూపిస్తాను'' అన్నది ఆవిడ.

ఇంటికి వచ్చాడు... ఇల్లు ఖాళీ, ఇంట్లో మనుషులు ఖాళీ.

శూన్యంగా ఉన్న యిల్లు చూస్తే శూన్యమైన తన భవిష్యత్తు గుర్తుకొచ్చి భయంగా ఉంది.

ఇప్పుడు తన గతేంటి. బుద్ధి లేకుండా ప్రవర్తించి యిప్పుడేమనుకుని ఏం లాభం.

ప్రియ తిరిగి రాదు.

వెళ్లటంలో ఆమె తప్పులేదు.

యిప్పుడు తల్చుకుంటే తన ప్రవర్తన తనకే అమానుషంగా కనిపిస్తోంది.

తెల్లారి లేస్తే కాఫీ, భోజనం, బట్టలు అన్నీ సిద్ధంగా ఉంచేది పాపం. తన కోసం వంట నేర్చుకుంది. చెప్పినట్లు చేసింది. శుభాదేవి అన్నట్లు ప్రియకీ మధుకీ ఉన్న సంబంధం తెలిశాక కూడా తను కాపరం చేశాడు. ఇంక తనకి ఎందుకు అసంతృప్తి.

తను మాత్రం మంచివాడా! యిష్టం వచ్చినట్లు తిరిగినవాడే. అదీ సరదాకోసం. మరి పెళ్లి జరిగిపోతుందేమోనన్న ఉద్దేశంతో ఉన్న ప్రియ మధుతో సంబంధం పెట్టుకుంటే అందులో తప్పేం ఉంది. తప్పంటూ ఉంటే అదంతా ద్రోహబుద్ధితో ప్రియతో తిరిగిన మధుది.

ప్రియని తను క్షమించగలడు. కానీ ప్రియ తనని క్షమించగలదా!

తను చేసినవన్నీ మర్చిపోయి కాపరానికి తిరిగి వస్తుందా?

రావాలంటే... తననుతాను నిరూపించుకోవాలి ముందు. ఏం చెయ్యాలి.

శుభాదేవి అన్నట్లు తనకాళ్లమీద తను నిలబడాలి. డబ్బు సంపాదించాలి.

ప్రియ సంపాదన కోసం కాదు. ఆమె కోసమే ఆమెని తిరిగి ఆహ్వానిస్తున్నట్లు ప్రియకి తెలియాలి.

రాజేష్ లేచి నిలబడ్డాడు.

ప్రయత్నించాలి. గట్టిగా ప్రయత్నిస్తే ఏదో ఒకటి దొరక్కపోదు.

ప్రతి మనిషిలో మార్పు కలుగుతుంది ఏదో ఒకరోజు.

మంచివాడు చెడ్డవాడిలా మారవచ్చు. చెడ్డవాడు మంచివాడిగా మారిపోవచ్చు.

మనిషి తననుతాను తెలుసుకోక తప్పదు. జీవితంలోని కొన్ని సంఘటనలు మనిషికి వాస్తవాన్ని బోధిస్తాయి.

సాగుతుంటే ప్రతివాడూ జులుం చేస్తాడు. సాగకపోతే చతికిలబడతాడు.

అప్పుడు అతని జ్ఞాననేత్రం తెరుచుకుంటుంది.

ఇన్నాళ్లూ సాగింది, యిప్పుడెందుకు సాగటం లేదూ అని ప్రశ్న వేసుకుని, ఆ తర్వాత తననితాను పరిశీలించుకుంటాడు. ఆత్మ విమర్శ చేసుకుంటాడు.

రాజేష్ విషయంలో జరుగుతున్నదదే. అతను ఇప్పుడు వాస్తవాన్ని గ్రహించాడు.

ముందుకి కదిలాడు.

ఎక్కడైతే ఒకనాడు అమ్మాయిల వేటలో అల్లరిచిల్లరిగా తిరిగాడో, ఎక్కడైతే పని విలువ తెలీక పని సరిగ్గా నేర్చుకోలేదో, ఎక్కడనుంచి చెప్పాపెట్టకుండా విజయవాడకి పారిపోయాడో... అదే మెకానిక్ షెడ్డు వైపు నడిచాడు




రాజేష్.

దాని ఓనర్ తనని చూస్తే చిరాకుపడవచ్చు. అందులో సందేహం లేదు. కానీ బతిమాలాలి. కష్టపడి పని చేస్తానని చెప్పాలి.

రాజేష్ వెళ్లేసరికి పెద్ద మెకానిక్ ఒక కారుని రిపేర్ చేస్తున్నాడు.

"ఏంటిలా వచ్చావ్" అన్నాడు తేలిగ్గా చూస్తూ.

"పని కోసం"అన్నాడు రాజేష్.

"పనా... నువ్వేం చేస్తావ్. ఒకసారి మాకు అనుభవం అయిందిగా చాల్లే" అన్నాడతను.

"అప్పుడు వేరు యిప్పుడువేరు. యిప్పుడు బుద్ధిగా పని నేర్చుకోవాలనుకుంటున్నాను. ప్లీజ్ నాకు పని యివ్వు. నీకు తోచినంత జీతం యివ్వు చాలు'' అన్నాడు రాజేష్.

అతనేమనుకున్నాడో ఏమో, రాజేష్‌వైపు ఎగాదిగా చూశాడు.

రాజేష్ మొహంలో, కళ్లల్లో ఆనాటి జులాయి ఛాయలు కనిపించలేదు అతనికి.

"సరే ఒక అవకాశం యిస్తాను. ఏమన్నా తేడాలొస్తే ఈసారి ఊరుకోను. బుద్ధిగా, శ్రద్ధగా పని చేసుకోవాలి అర్థమైందా!" అన్నాడు.

"అర్థమైంది'' తల ఊపాడు రాజేష్.

"పోయి ఆ కారు తుడు'' ఆర్డర్ వేశాడతను.

రాజేష్ పాతబట్ట ఒకటి తీసుకుని ముందుకి నడిచాడు.

శ్రద్ధగా, శుభ్రంగా తుడవటం మొదలుపెట్టాడు. ఆ తర్వాత మరోకారు రిపేర్‌లో మెకానిక్‌కి సాయం చేశాడు.

ఒక గంట గడిచేసరికి ఒళ్లంతా చెమట పట్టింది. నుదుటి మీంచి కారుతున్న చెమట చేత్తో తుడుచుకున్నాడు.

ఆ చెమటలో తన భవిష్యత్తు కనిపించింది అతనికి. అందమైన పొదరిల్లు లాంటి యింట్లో ఆనందంగా తనూ, ప్రియా, పాపా కలిసి బతకటం కనిపించింది.

ఆ రోజు రావాలంటే... తను యింకా యింకా పనిచేయాలి. నేర్చుకోవాలి. తనూ ఈ పెద్దమెకానిక్ అంతవాడవ్వాలి. రేపు కాకుంటే ఎల్లుండయినా స్వంతంగా తనూ మోటార్ వర్క్‌షాప్ నడుపుకోవాలి.

అతను కసిగా ముందుకి దూకి పనిచేస్తున్నాడు.

★ ★ ★

ప్రియ రోజూ ఆఫీసుకి పోయి వస్తోంది. ప్రియా, పాపా సుభద్ర గారింట్లో బాగా అడ్జస్ట్ అయిపోయారు.

ఆఫీసులో పని శ్రద్ధగా నీట్‌గా చేస్తోందని మెచ్చుకుంటున్నారు కూడా.

ప్రియ విడిగా ఉంటోందనీ, రాజేష్ యిప్పుడు ఆమెని బాధించటంలేదనీ తెలుసుకున్న మధు తిరిగి ఆమెతో పూర్వంలా వ్యవహారం సాగిద్దామని చూశాడు. ప్రియ నిష్కర్షగా అతన్ని నిరాకరించింది. జరిగిందేదో జరిగిపోయింది. అలాంటివి తన దగ్గర యికనుంచీ కుదరవని గట్టిగా హెచ్చరించింది. మధు ఆ డోస్‌కి బెదిరిపోయి మళ్లీ ఆమెవైపు చూడలేదసలు.

అన్ని సమస్యలూ తీరాయనితెలిశాక తల్లి తండ్రులువచ్చి తమ యింట్లో ఉండమని బతిమాలారు. ప్రియ వెళ్లలేదు.

రాజేష్ ఒళ్లువంచి పని చేస్తున్న విషయం ప్రియకి తెలిసింది. మొదటి సంపాదనలో స్వీట్స్ కొని శుభాదేవికి యిచ్చాడట. తన కంటూ స్థిరంగా సంపాదన ఏర్పడ్డాక, కాస్త డబ్బు వెనుక వేశాక అప్పుడు ప్రియతో మాట్లాడి ఆమెని క్షమాపణ అడిగి తిరిగి రమ్మని బతిమాలుతాను అన్నాడుట. శుభాదేవి చెప్పింది.

"అదే జరిగితే నాకంతకన్నా కావల్సిందేముంది. అతను మారితే చాలు'' అంది ప్రియ.

జరిగినదంతా మర్చిపోయి కొత్త జీవితం ఆరంభించటానికి యిద్దరూ సిద్ధంగా ఉన్నారు.

★

# కుండీపై సమీక్షలు

జనవరి 'చతుర'లో ప్రచురితమైన మొగసాలె కన్నడ మూలానికి నలిమెల భాస్కర్ అనువాదం 'కుండీ' నవలపై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## సామాజిక సత్యం

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

నేటి నవలా గంజాయివనంలో తులసిమొక్క- "కుండీ''. జీవిత సమస్యల్ని చూపగలిగేదే మంచి రచన అయితే కుండీ ఆ కోవకి చెందినదే. సమస్య- రంగయ్య వీధిదా, రాజమండ్రిదా అనేది మానేస్తే నేటి మన జీవితం సమస్తం సమస్యలమయం అని చెప్పక తప్పదు.

నవల చదువుతున్నంతసేపూ రంగయ్య వీధిలో పాత్రల మధ్య మేమూ వున్నామని పించడం నవల వాస్తవికతకి దర్పణం పడుతూంది.

"ప్రజాస్వామ్యంలో బ్యూరోక్రసీ ఎంత బలంగా వున్నదీ తెలియచెప్తోంది ఈ చెత్త కుండీ. అలాగే మన దేశంలో వున్నది నిజమైన ప్రజాస్వామ్యం కాదనీ, చెత్తన్నర చెత్తస్వామ్యమనీ అనడానికి కూడా ఈ చెత్త కుండీ వ్యవహారం ఓ బలమైన సాక్ష్యం" రచయిత బాలన్నచేత చెప్పించే ఈ మాటలు పచ్చినిజం.

రాజకీయ వేత్తలూ, పెట్టుబడిదార్లూ, భూస్వాములూ, బ్యూరోక్రాట్లూ, గూండాలూ, డంకెల్లూ మానవ జీవితాల్ని ఎలా శాసిస్తున్నారో మనం చూస్తున్నాం. చెత్తాచెదారం, చెత్తకుండీ, చివరికి కుళ్లిపోయిన మాంసపు ముద్ద కూడా మానవ జీవితాల్నీ, మానవ సంబంధాల్నీ ఎలా అల్లకల్లోలం చేస్తున్నాయో రచయిత కళ్ల ముందుంచారు.

నూతన సంవత్సర కానుకగా ఒక మంచి నవలందించినందుకు చతురకు కృతజ్ఞతలు. నవలా రచయితకూ, అనువాదకునికీ నా హృదయపూర్వక ధన్యవాదాలు.

-మాచర్ల సూర్యనారాయణ,
ఎం. సింగుపురం-532 462

## పరిష్కారం కోసం సమరం

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

మంచిపుస్తకం అంటే దించకుండా చివరిదాకా చదివించేది అన్నాడు ఓ ప్రసిద్ధ విమర్శకుడు, ఆ కోవకు చెందుతుంది 'కుండీ' నవల.

సమాజంలో తనవంతు కర్తవ్యాన్ని ఎలా నిర్వహించాలో; ఎందుకు నిర్వర్తించాలో చెప్పే జర్నలిస్టు బాలన్న పాత్ర, తనకోసం కాక తన చుట్టూ వున్నవారికి సాయం చేయాలని తాపత్రయపడే తత్వంగల పాత్ర. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుడి చుట్టూ తిరుగుతుందనే ఖగోళ శాస్త్రప్రకారం ఉత్పన్నమైన సమస్య తనొక్కడి సమస్య కాకుండా అందరి సమస్యగా భావించి సాంఘికంగా, సమాజపరంగా పరిష్కారం కోసం పరుగులు తీస్తాడు బాలన్న. ఈ పాత్ర నవల్లో ముఖ్యసూత్రధారి. బాలన్న పాత్ర నడుస్తుంది, నడిపిస్తుంది. అన్ని పాత్రల్ని కదిలిస్తుంది.

యస్.ఐ. రామయ్య పాత్ర ప్రజలకు ఉద్యోగరీత్యా, చట్టరీత్యా న్యాయం, ధర్మం కల్పించాలని తన ఉద్యోగధర్మాన్ని నూటికి నూరుపాళ్లు





నిర్వర్తించాలని, ప్రజాస్వామ్య విలువలు పరిరక్షించాలని కంకణం కట్టుకున్నట్లు చెప్పి చివరకు పరిస్థితుల ప్రభావంవల్ల తన తత్వం మార్చుకున్న పాత్ర రామయ్య.

శివయ్యది సమస్య పరిష్కారంలో తన వంతు పాత్ర విజయవంతమైతే భవిష్యత్తులో తానో చిన్నసైజు ప్రజానాయకుడు కావాలని కలలుకనే పాత్ర. సమస్యల్ని ఇతర్లు పరిష్కరిస్తే తనవల్లే జరిగిందని చెప్పి మరో సమస్య సృష్టించి పరోక్షంగా ప్రతిష్ట సంపాదించుకునే కుహనా రాజకీయనాయకుడు సి.యం. అనే మునియప్ప. ఓ సైలంట్ విలన్‌లాటి పాత్ర. రెండు నాల్కల ధోరణితో ప్రవర్తించి అధికారాన్ని అవినీతి అక్రమమార్గంలో నడిపించే పురపాలక సంఘాధ్యక్షుడు రామస్వామి. బాధ్యతల్ని విస్మరించి నిర్లక్ష్యంగా ప్రవర్తించే హెల్తు అధికార్లు రుద్రయ్య, స్వామి, భీమయ్యలాంటి ఉద్యోగుల పాత్రల చిత్రీకరణలో సున్నితహాస్యం తొంగిచూసింది.

భిన్నత్వంలో ఏకత్వం సాధించిన పాత్రల రూపకల్పన "కుండీ" నవల యితివృత్తం. రచయిత, అనువాదకుడు ఇద్దరూ అభినందనీయులు.

-పి. వాహిని
ప్రొద్దుటూరు-516 360

## మన రాజకీయాలే మనసమస్య

*(మూడవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

కానుకల హుండీ, ఎడ్లబండి, చెత్తకుండీ కాదేదీ నవలకనర్హం అని నిరూపించారు మొగసాలెగారు తన నవల "కుండీ" ద్వారా అవకాశవాదుల రాజకీయం, సర్కారువారి రాసలీలలు, విజ్ఞుల అజ్ఞానం, అల్పజీవుల మౌఢ్యం, సంఘ అనైక్యతలకు సునిశితహాస్యం కలిపి "కుండీ"లో వేసి సమర్థవంతంగా గానుగాడించారు రచయిత.

రాజకీయాలు మనుగడ కొనసాగించుకోవడానికి అరాచకాలు, అయోధ్య, అణుబాంబుల్లాంటి పెద్ద సమస్యలే కావలసిన అవసరంలేదు. చెత్తకుండీల్లోంచి కూడా సమస్యల్ని సృష్టించి మనుగడ కొనసాగించుకోగలవు. సర్కారువారి కార్యాలయాలు' అవినీతి, అసమర్ధత, లంచగొండితనాలతో కూడా మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లగలవు అనే సత్యాల్ని చక్కగా ప్రతిబింబించింది ఈ నవల.

"మనదేశంలో సమస్యల్ని ఉత్పన్నం చేసేదే రాజకీయ నాయకులు. వాటికి పరిష్కారం వెదికేదీ వాళ్ళే. ఆ పరిష్కారం తాత్కాలికంగా వుండాలి. శాశ్వతం కారాదని కోరేదీ వాళ్ళే. ఎందుకంటే సమస్యలే లేకపోతే రాజకీయనాయకులు పనీపాటూ లేనివాళ్లవుతారు. ప్రజాస్వామ్యంలో బ్యూరోక్రసి ఎంత బలంగా పాతుకుపోయిందో చెప్పడానికి ఈ చెత్తకుండీ ప్రబల సాక్ష్యం" అన్న రచయిత భావాలతో మనం ఏకీభవించవచ్చు.

అసలు సమస్య ఎక్కడ ప్రారంభమైంది? ఎందుకు ప్రారంభమైంది? ఎవరు ప్రారంభించారు? ఏం ఆశించి ప్రారంభించారు? అనే ఆలోచన లేకుండా మన అజ్ఞానానికి మరికొంత అయోమయం జోడించితే ఇప్పుడు మనం చేస్తున్న పనుల వినాశకర ఫలితాలే మన భావితరాల్ని నాశనం చేస్తాయి. రాక్షస రాజకీయ విన్యాసాలు ఆపకపోతే ఈ కుండీలు మనకు సమాధులవుతాయి.

-యం. కృష్ణ,
వాల్తేర్-530 003

## ఎక్కడైనా జరగవచ్చు

*(నాలుగవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

ప్రజాస్వామిక ప్రభుత్వంలోని బ్యూరోక్రసిని స్పష్టంగా కళ్ల ముందుంచారు- మొగసాలెగారు "కుండీ" నవలలో.

ఎప్పుడూ ప్రశాంతంగా ఉండే రంగయ్యవీధి ఒకేఒక్క సంఘటనతో అల్లకల్లోలమై,

వీధివీధంతా ఉరుకులు పరుగులతో ఊపిరాడని పరిస్థితుల్లో అదే ఓ ప్రధాన సమస్యయి కూర్చుంది. ఈ కథలోని ప్రతి పాత్ర, సంఘటన సమకాలీన వ్యవస్థకు అద్దం పడుతున్నట్లుగా చిత్రీకరించారు రచయిత. రిటైరై ఇంట్లో కూర్చున్న శివయ్య అంత వాసనలోనూ వచ్చే మున్సిపల్ ఎన్నికల్లో వార్డుమెంబరుగా నిలబడాలనుకుంటాడు. మునియప్ప అనే అతడు అధికార పార్టీ తరపున ఎం.ఎల్.ఏ.గా పోటీ చేయాలనుకోవడం అందుకోసం సమస్యలు సృష్టిస్తాడు. ఉన్న సమస్యలను తమకు అనుకూలంగా మార్చుకోవటం రాజకీయనాయకులకు వెన్నతో పెట్టిన విద్యే. కంపుతో వీధంతా అతలాకుతలం అవుతుంటే, పురపాలక సంఘం అధ్యక్షుడు రామస్వామి ఆ సమస్య మున్సిపాలిటీకి సంబంధించినప్పటికి రూల్స్ ప్రకారం హెల్త్ డిపార్ట్‌మెంట్‌ను కలవాలనటం, హెల్త్ డిపార్ట్‌మెంట్ వారు చెత్తకుండీ పి.డబ్ల్యు డి. శాఖకు చెందిందనటం, పి.డబ్ల్యు.డి. ఆఫీసరేమో "లీవులో ఉన్నాను, మాట్లాడే తీరిక లేద"నటం మన ప్రభుత్వ అధికారుల అలసత్వానికి ప్రతీకలే! అంత గబ్బువాసనలోను ఓ కుర్రాడు అదేమి పట్టనట్లుగా అగరొత్తులు అమ్మటం వ్యాపార విలువలముందు ఏ నైతిక, భౌతిక స్పృహలు పనిచేయవనటానికి నిదర్శనం. ఈ కేసులో ఎక్కువగా ఇంట్రెస్టు చూపితే ఏ ఎడారికో ట్రాన్స్‌ఫర్ అవుతుందని ఎస్సై రామస్వామి బాలన్నతో అనటంలో అభద్రతా భావన స్పష్టంగా కన్పిస్తుంది. చాలా కష్టపడి బాలన్న మున్సిపాలిటీనుండి లారీ తెప్పిస్తే సమయానికి సి.యమ్. తన కిరాయి మనుషులతో వచ్చి, చెత్తకుండీని లారీలో ఎక్కించి సి.ఎమ్. జిందాబాద్ అని నినాదాలిస్తూ వెళ్లటం, జనం సి.యమ్.వల్లే చెత్తకుండీ తరలిందని నమ్మటం గొప్ప రాజకీయం.

జర్నలిస్టులు, కవులు, కళాకారులు, రచయితలు, మేధావులు ఏ వ్యవస్థలోనైనా తమ బాధ్యతల్లో నిక్కచ్చిగా వ్యవహరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఇంత మంచి నవలను ఎన్నిక చేసినచతుర సంపాదకవర్గాని కి కృతజ్ఞతలు. భాష ఏదైనా ప్రాంతం ఏదైనా మనిషి భావం, బాధలు, లక్ష్యం ఒక్కటేనని చెప్పినందులకు కృతజ్ఞతాభినందనలు.

**-జీగురు అయిలయ్య,**
జ్యోతినగర్-505 215

## రాక్షస రాజకీయం

***(అయిదవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)***

ప్రజాస్వామ్యంలో బ్యూరోక్రసి ఎంత బలంగా ఉందో తెలుసుకోవడానికి ఈ నెల "కుండీ" నవల దోహదం చేసింది. దేశంలో ఉన్నది చెత్తన్నర చెత్త ప్రజాస్వామ్యమని అనడానికి ఈ నవలలోని చెత్తకుండీ ప్రహసనం ఓ చక్కటి ఉదాహరణ.

బాలయ్యలాంటి ప్రముఖ వ్యక్తులే ఓ చెత్త కుండీలోని దుర్గంధం తొలగించడానికి గవర్న మెంట్ ఆఫీసుల చుట్టూ తిరిగి అన్ని అవస్థలు పడితే, ఓ సామాన్యుడు ఎన్ని కష్టాలను, అడ్డంకులను ఎదుర్కోవాల్సి వస్తుందో ఊహించుకోవచ్చు.

కాస్తో కూస్తో నాయకులు భయపడుతున్నారంటే, తాము తాకట్టుపెట్టకుండా ఉండడానికి పత్రికలు వెలికితీసే 'కుంభకోణాలే కారణం. రాజకీయ చతురతవల్ల నాయకులు చేసే కుతంత్రాలను చాలామంది మధ్యతరగతివారు విద్యావేత్తలు కూడా సరిగా అర్థం చేసుకోలేకపోతున్నారనటానికి ఈ నవలలోని పాత్రలన్నీ దేవుడి గుడి అనగానే చెత్తకుండీని తమ ఇంటిముందు ఉంచుకోవడానికి సిద్ధపడడమే ఓ చక్కటి నిదర్శనం.

ఈ వ్యవస్థను రాక్షసంగా పట్టిపీడిస్తున్న రాజకీయ యంత్రాంగాన్ని కూకటివేళ్లతో పెకిలించక తప్పదు. లోకకళ్యాణానికై గుండెల నిండా ధైర్యం నింపుకుని ఈతరం ఇందు కోసం ముందడుగు వేయాలి.

**-బి. సుధాకర్‌రావు,**
గుండాల-277




# చతుర ప్రపంచం

## ముదితల్ చేయగరాని చేత కలదే

పిల్లలందరూ సాయంకాలం అరుచుకుంటూ ఆడుకునేవేళ నిషా అనే అమ్మాయి 'కూరగాయలూ!' అంటూ అరుస్తూ అమ్ముకుంటూ వుంటుంది. కోటి విద్యలూ కూటికొరకే అయినా నిషా మాత్రం కేవలం చదువుకోసం కష్టపడి పనిచేసి డబ్బు సంపాదించేది. మహారాష్ట్రలోని రత్నగిరిలో ఓ రిటైరయిన స్కూల్ టీచర్‌కి మూడవ అమ్మాయి నిషా. తండ్రి రిటైరయ్యేసరికి నిషాకి ఎనిమిదేళ్ళు. భర్తకి వచ్చే పెన్షన్‌తో సంసారం గడవడం కష్టం అనుకుని, ఉన్నకొద్దిపాటి దొడ్డిని చదును చేసి కూరగాయల పాదులువేసి కూరగాయల వ్యాపారం ప్రారంభించింది నిషా తల్లి. దానికి మరింత సాయంచేసి ఆ వ్యాపారాన్ని అభివృద్ధి చేసింది నిషా.

స్కూలులేని సమయాల్లో మార్కెట్‌లో కూర్చుని కూరగాయలమ్మేది నిషా. పొద్దున్నే ఏడు గంటలకు స్కూలు బట్టలు ధరించి, టిఫిన్‌బాక్స్ బ్యాగ్‌లో పెట్టుకుని, నెత్తిమీద కూరగాయల బుట్టతో మార్కెట్ చేరేది నిషా. సరిగ్గా తొమ్మిది గంటలవరకూ అమ్మి అటు పైన ఆ బుట్టను పక్కన ఉండే ఓ తెలిసున్న అమ్మాయికిచ్చి స్కూలుకి పరుగెత్తేది. తిరిగి స్కూలునుంచి అటే మార్కెట్‌కి వెళ్ళి మిగిలిన కూరగాయలు అమ్ముకుని రాత్రి 8 గంటలకు ఇల్లు చేరేది నిషా. భోజనం కాగానే స్కూలుకి సంబంధించిన హోమ్‌వర్క్‌లూ వగైరా పూర్తిచేసుకుని పడుకునేది. మళ్ళీ ఉదయం 6 గంటలనుండి పరుగులు ప్రారంభమయ్యేవి.

"మా అమ్మకి నేను కాలేజీలో చదవడం ఎంతమాత్రం ఇష్టంలేదు. అయినా ఆమెను ఒప్పించగలిగాను. నా చదువుకి కాలేజీ లెక్చరర్స్ కూడా ఎంతో ప్రోత్సాహాన్నిచ్చారు. అప్పుడప్పుడు కొన్ని క్లాసులకి టైముకి హాజ



రు కాలేకపోతే సదరు లెక్చరర్లు ఆదివారంనాడు ఇంటివద్ద నాకు ఆ పాఠాన్ని వివరించేవారు. చాలామంది లెక్చరర్లు నా వద్ద కూరగాయలు కొనేవారు. నన్నెంతో గౌరవంతో, వాత్సల్యంతో చూసేవారు'' అంటూ తను చదువుకున్నప్పటి రోజుల గురించి చెప్తూ వుంటుంది నిషా. ఎనిమిదో సంవత్సరంనుంచే జీవన రణరంగంలోకడుగుపెట్టిన నిషా ఇప్పటికే ఎమ్మే పొలిటికల్ సైన్స్‌లో పట్టా తీసుకుంది. ఇటుపైన 'లా' చదివి న్యాయవాదిగా స్థిరపడాలన్నది ఆమె ధ్యేయం. కూరగాయలు కొని పట్టావడమే నామోషీ అనుకునే నేటి విద్యార్థులకు 'నిషా' ఓ చక్కని ఆదర్శం.

## ప్రకృతి పరిశీలన

**కొం**తమందికి కుక్కలంటే ఇష్టం. అందుకే ఎంతమంది పిల్లలున్నా వాళ్ళతో సమానంగా కుక్కల్నీ పెంచుకుంటారు. అవి మీద ఎక్కి, తొక్కి, నాకి... నానా అల్లరీ చేసినా ఏమనరు సరిగదా; అదే తన స్వంత బిడ్డే, పసివాడైనా సరే, బట్టతడిపితే... వెంటనే కిందకి దింపేసి... వాడిమీదా, ఆ టైములో వాణ్ణి చేతికిచ్చిన వాడి తల్లిమీదాపళ్ళు నూరతారు.

ఒక్క ఇష్టపడటమే కాకుండా సదరు జంతువుల, లేదా పక్షుల అలవాట్లు, స్వభావాలు వగైరాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించేవాడట ఆయన. వివిధరకాల పక్షులు, జంతువులు అన్నీ కలిపి దాదాపు మూడు వందలుదాకా వుండేవట జహంగీర్ వద్ద. ఆయన ప్రతిరోజూ వాటివద్ద చాలా ఎక్కువ సమయాన్నే గడిపేవాడు. ఒక్కొక్కసారి రాత్రిళ్ళు కూడా వాటివద్దనే వుండిపోయి అరుపులు, కూతల్లో వుండే వాటి భాషని, భావాల్ని అర్థం చేసుకునేందుకు




మరికొందరు పిల్లులంటే ఇష్టపడతారు. ఇంకొందరు చిలుకలంటే ప్రాణం పెడతారు. ఇలా ఏదో ఓ జంతువుమీదో, పక్షిమీదో ఇష్టాన్ని చూపించడం మామూలేగానీ... అక్బరుపాదుషా కొడుకు జహంగీర్‌కి అటు పక్షులు, ఇటు జంతువులు, మరోవైపు మొక్కలు... ఏవన్నా ప్రాణమేనట.

ప్రయత్నించేవాడు. వాటి గురించి ఎన్నో విషయాలను క్షుణ్ణంగా తెలుసుకున్నాడు జహంగీర్.

ఓ గర్భందాల్చిన ఏనుగును చూడగానే అది ఎన్నో మాసంలో వున్నదీ, ఎప్పుడు ప్రసవించేది... వగైరా విషయాల్ని ఖచ్చితంగా చెప్పేవాడు. అలాగే ఆడకొంగలు గుడ్లు పొదిగే విధానాన్ని వివరించి చెప్పేవాడు ఆసక్తిగల వారికి.

చెట్ల విషయంలో కూడా అత్యంత శ్రద్ధాసక్తులను చూపేవాడు జహంగీర్. ఏఏ చెట్లు ఏఏ ఋతువుల్లో ఎలాంటి ఫలపుష్పాలని ఏమేరకి స్తాయి? చెట్లను సోకే చీడపీడ లెలాంటివి? వగైరా విషయాలను కూడా క్షుణ్ణంగా తెలుసుకునేవాడాయన.

చివరగా తన ప్రకృతి పరిశీలన నంతటినీ 'యుజు-కి-జహంగిరి' అన్న పేరుతో ఓ పుస్తకం రాశాడు జహంగీర్.

## తల తెచ్చిన కీర్తి

'జుట్టున్నమ్మ ఎన్ని కొప్పులయినా పెడుతుంద'ంటారుగానీ, ఓ జుట్టున్న అయ్య మాత్రం అతని జుట్టుతో చెప్పలేనన్ని విన్యాసాలు చేస్తున్నాడు. రాజస్థాన్‌లోని దేవపురాకి చెందిన అతని పేరు దూదారామ్. 26 సంవత్సరాల వయసుగల దూదారామ్ జుట్టు అందరి జుట్టులా కాకుండా అతివేగంగా పెరుగుతుంది. చాలా ఒత్తుగా వుండి పైన ఓ బుట్ట బోర్లించినట్టుంటుంది. అజ్మీర్‌కి చెందిన ఓ ఆసామి ఈయన జుట్టుని రెగ్యులర్‌గా కొనే కస్టమర్లలో ఒకడు. విగ్గులు సవరాల కంపెనీలు ఇతని జుట్టుకోసం క్యూలు కట్టి నిలబడతారు. చిత్రమేమంటే దూదారామ్ జుట్టు ఎంత దువ్వినా ఒక్క వెంట్రుక కూడా ఊడదు.

ఒక్క జుట్టేకాదు, ఇతని తల ఇనపగుండులా గట్టిగా వుండి కొబ్బరికాయలు వగైరా గట్టిపదార్థాలని సునాయాసంగా పగలకొడుతుంది. ఆయనగారి జుట్టు కూడా ఎంత గట్టిదంటే జుట్టుని ఓ చెట్టుకు ముడేసి ఆ ఆధారంతో గాలిలో కిందకు వేలాడగలడు దూదారామ్.

చిన్నప్పటినుంచీ ఎలాంటి విద్యాభ్యాసం లేని దూదారామ్ గొర్రెలు కాసుకుని జీవించేవాడు ఒకప్పుడు. ఆ గొర్రెపాలే తాగేవాడు, తిండి దొరకనప్పుడు. కానీ ఇప్పుడు అతని తల, జుట్టు కలిసి అతనికి ఎలాంటి ప్రతిష్ఠ తెచ్చిపెట్టాయంటే అతన్ని ఎలాంటి పోటీలేకుండా గ్రామసర్పంచ్‌గా ఎన్నుకున్నారు ప్రజలు. ఇది కాక జుట్టు వ్యాపారంతో అతడు బోలెడు డబ్బు సంపాదిస్తున్నాడు. ఇదికాక గట్టిదైన తన తల చేసే విన్యాసాలతో ఎన్నో ప్రదర్శనలిచ్చి కీర్తి గడిస్తున్నాడు. సినీనిర్మాతలను కూడా ఆకర్షించిన దూదారామ్ మూడు సినిమాల్లో బందిపోటుగా నటించాడు. అంతటి మోటుమనిషిలో సున్నితమైన కళాత్మకత, భావుకత వుందంటే ఆశ్చర్యమేమరి. అక్షరజ్ఞానం లేని దూదారామ్ శృంగార, ప్రేమరసభరితమైన కవితలెన్నో రాశాడు. ప్రతి కవిసమ్మేళనానికి అతడు తన తలతో కొబ్బరికాయ కొట్టి ప్రారంభించవలసిందే.



# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | – |
| Address | : | 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **VASUNDHARA PUBLICATIONS** 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 482. |

**I, RAMOJI RAO,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 1995

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 290328. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad 318181, 399444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977, Rajahmundry 71390, Karimnagar 8316.



యం. పార్వతీశం

